# ఇందులో....

## అనుబంధం

# రంగనాయకమ్మ ముందుమాట

చలంగారి రచనలన్నీ వొక ఎత్తుగా, ఈ 'బిడ్డల శిక్షణ' వొక్కటీ వొక ఎత్తుగా తోస్తుంది నాకు.

"బిడ్డల శిక్షణ"నీ, "స్త్రీ"నీ చెప్పకుండా చలాన్ని చెప్పడం సాధ్యంకాదు.

స్త్రీల సమస్యల గురించి హృదయ పూర్వకమైన సానుభూతితో చర్చించిన వారూ, స్త్రీల పరిస్థితులకు అమితంగా బాధపడిన వారూ ఇంకా కొందరు రచయితలు లేకపోలేదు మనకు. కానీ బిడ్డల్ని గురించి ఇంత ప్రేమతో, దయతో చర్చించిన వారుమాత్రం చలం వొకరే. ఆయన చెప్పిన మాటల సారాంశం అంతా—బిడ్డల్ని నిజమైన శ్రద్ధతో, ప్రేమతో జ్ఞానవంతంగా పెంచాలన్నదే.

చలం ఈ రచన చేసిన నాటికీ, నేటికీ బిడ్డల్ని పెంచుతోన్న పరిస్థితుల్లో చెప్పుకో దగ్గ మార్పేమీ లేదు. ఆ నాటికీ ఈ నాటికీ దాదాపు వొక రకంగానే వుంది. ఇల్లేకాదు. బడీ, సమాజమూ కూడా పిల్లల విషయంలో ఆరోగ్య వంతంగా ఆలోచించడం లేదు. ఆ స్థితిని ఎలా సరిదిద్దుకోవాలో చలంగారు సాధ్యమైనన్ని విధాల చెప్పారు.

"ఆఁ ఏవో చదవడానికి బాగానే వుంటాయి ఇలాంటి పుస్తకాలు. అలాగే చెయ్యడానికి కుదురుతుందా ?" — అని కొట్టి పారేసేవాళ్ళున్నారు కనీసపు ప్రయత్నాలైనా చెయ్యకుండా.

"చలం చెప్పినట్టే పెంచాం. పిల్లలు కోతులైపోయారు. ఇక తన్నడం తప్పలేదు." అనో,

"చలం చెప్పినట్టు పెంచాలనుకున్నారా ? అదంతా తప్పని తెలి సొచ్చిందిగా ? చలాన్ని అతని తండ్రి బాగా తన్ని పెంచబట్టే అంత వాడయ్యాడండీ. ఆ సంగతి ఆయన గ్రహించలేమ గానీ"—అనో, చలం చెప్పిన దాన్ని అబద్ధం చెయ్యాలని కంకణం కట్టుకున్న పెద్దలూ మేధావులూ తటస్థ పడుతోనే వున్నారు.

'చలం చెప్పినట్టే పెంచాం' అనడమే గానీ, ఆ అన్నవాళ్ళు తమ పిల్లలతో ఏ విధమైన అరమరికలూ లేని స్నేహ సంబంధాలు ఏర్పర్చు కున్నారా ? చలం చెప్పిన క్రమ శిక్షణ తాము పాటిస్తూ తమ పిల్లలకు ఆదర్శవంతులుగా కనపడ్డారా ?

చలం ఏమంటారో చూడండి—

"చిన్న పిల్లలకు సరైన శిక్షణ ఇవ్వగలిగిన తల్లిదండ్రులు ఎప్పుడూ సంతోషంగా, దయగా వోర్పుగా వుండాలి."

"పిల్లల్లో ఏ సద్గుణాలు కలగ జెయ్యాలనుకుంటారో, ఆ గుణాల్ని పెద్దవారు తాము అలవరుచుకుని అనుష్టించాలి. వారినించి ఏ చెడు గుణాల్ని మాన్పించాలని వుంటుందో, వాటిని తాము వర్జించాలి. వుత్త బోధనవల్లా, దెబ్బల వల్లా ఏమీ లాభంలేదు."

"తల్లిదండ్రులమీద భక్తీ ప్రేమా పిల్లలకు కలిగేట్టు పెద్దవారు ప్రవర్తించ వలసిందే గానీ వూరికే బలవంతం చేస్తే వొచ్చేవి కావు అవి."

"అల్లరీ, పెంకెతనమూ ఏ కారణాల వల్ల కలుగుతాయో ఆలో చించి వాటిని తొలగించే ప్రయత్నం చేయవలసి వుంటుంది."— ఇలాంటి సూచనలు చెప్పిన వాళ్ళని తప్పుపట్ట వలసిందేమన్నా వుందా ? చలం చెప్పిన బిడ్డల శిక్షణ అసలు పెద్దల శిక్షణ అవడం వల్లనే అంత వ్యతిరేకం పెద్దలికి ఈ పుస్తకం అంటే.

చలం చెప్పిన పద్ధతుల్ని యధాతధంగా అలాగే, అక్షరాలా, చలం వుదాహరణల్లో చెప్పిన మాటలే వుపయోగిస్తూ పాటించాలని

అర్థం కాదు. చలం సూచనల్ని బిడ్డల పెంపకానికి మార్గ దర్శకంగా, గైడ్ లైన్సుగా తీసుకోవాలి. ఆ మాట రచయితే అంటారు.

"ఇట్లా బిడ్డకి నీతిని నేర్పడం సులభమైన పని కాదు సదా-సాధ్యం కాదు. అప్పుడప్పుడూ కఠినంగా అడ్డు పెట్టవలసి వొస్తుంది. కానీ సాధ్య మైనంత వరకూ ఈ పద్ధతుల్ని అవలంబించాలి."

"ఇదంతా మరీ వెర్రి అనుకున్నా, మీరు మీకు నచ్చిన వరకన్నా అంతవరకన్నా, అనుష్ఠించండి."

కొన్ని కొన్ని విషయాలలో 'చలం పొరపాటుగా అభిప్రాయ పడ్డారా?' అనిపించే ధోరణి వుంది. ముఖ్యంగా చిన్న పిల్లలకు బట్టలు వెయ్యక్కర్లేదు అనడం — అది మంచి విషయం కాదు. శీతోష్ణస్థితుల్ని గమనించకుండా ఫేషన్ కోసం, ఆడంబరాల కోసం, ఆరోగ్యానికి పనికిరాని విధంగా బట్టలు వెయ్యడం తప్పుగానీ, వాతావరణానికి అను కూలమైన బట్టలు, పిల్లలకు సుఖంగా వుండేట్టు వెయ్యడం చాలా అవ సరం. లేకపోతే చిన్నపిల్లల మర్మావయవాలకు చీమలు కుట్టడం, మట్టీ, ఇసకా, వడ్ల గింజలూ వంటివి జొరబడడం చాలా సార్లు జరుగుతూ వుంటుంది. లాగులు వెయ్యడం చాలా అవసరం.

అక్కడక్కడా కొంత కొంత అపార్థం కలిగించే విషయాలు కొన్ని వున్నాయి.

"....ఈ అందమైన ప్రపంచమంతా, ప్రపంచంలో వుండే వుత్సాహమూ, ధర్మమూ, ఆనందమూ బిడ్డవిగా చెయ్యాలి. ఈ లోకానికి యువ రాజై పుట్టినట్టుండాలి." — యువరాజై అన్నమాట వాడినందువల్ల రాజుల పెత్తనమూ, రాజుల అధికార దాహమూ, రాజరాగ ప్రవర్తించ డమూ మంచివి అని చెప్పినట్టు అవుతుందా ? 'గాంభీర్యంగా వుండాలి' అనే భావాన్ని చెప్పడానికే యువరాజై పుట్టినట్టుండాలి — అన్నట్టుగా అర్థం చేసుకోవాలి.

"జీవితంలో ముఖ్యమైన ఆనందం శరీరం వెముకల లోంచి

వస్తోంది. సుఖమైన భోజనం, చక్కని స్నేహం, మనసులో శాంతి, స్త్రీని గొప్పగా అనుభవించడం, ఆరోగ్యం, ఇవే ముఖ్యం."

"స్త్రీని గొప్పగా అనుభవించడం" అనడం వల్ల ఈ మంచి జీవితం అంతా పురుషుడి కోసమే చెప్పినట్టు అర్థం వొస్తుంది. సాధారణంగా శృంగారం విషయంలో పురుషుడికి స్త్రీని సంతోష పెట్టే దృక్పథం వుండదు కాబట్టి. ఈ విషయంలో పురుషుణ్ణి దృష్టిలోకి తీసుకుని చెప్పడం జరిగింది. అయినప్పటికీ 'స్త్రీని గొప్పగా అనుభవించడం' అన్న దానికి బదులు 'కామాన్ని గొప్పగా అనుభవించడం' అని వుంటే స్త్రీ పురుష లిద్దరికీ వర్తించేది. స్త్రీని గొప్పగా అనుభవించడం" అనే దాన్ని "కామాన్ని గొప్పగా అనుభవించడం" గానే అర్థం చేసుకోవొచ్చు, రచయిత మాటల్ని అలా మార్చవచ్చుకూడా. తప్పులేదు.

" (బిడ్డకి దెబ్బతగిలినప్పుడు) ఆ బాధతో బిడ్డ ఏడ్చినా, న్యూసెన్సుకాకుండా వేరే ఎక్కడన్నా ఏడవాలి.... బిడ్డకి జబ్బుగా వున్నాఅంతే. మందిచ్చి వచ్చెయ్యాలి. దగ్గిర కూచోడం ఆదుర్దా పడడం, యెత్తుకోడం చాలా తప్పు."— ఇలాంటి మాటలు కొన్ని చాలా కఠినంగా, వుండాలని చెప్పినట్టు అపార్థం కలిగిస్తాయి. ఇలాంటి మాటల్ని కేవలం యాంత్రికంగా లిటరల్‌గా, మక్కీకి మక్కీగా అర్థం చేసుకోకూడదు. ఈ రచనలో ప్రతిచోటా చెప్పిన ప్రేమనీ, దయనీ మూల సూత్రంగా పెట్టుకుని, ఇలాంటి మాటల్ని అర్థం చేసుకోవాలి. "మితి మీరిన గారాం లాంటిది చూపించవద్దు" అనడమే దీని అర్థంగానీ, పిల్లలు దెబ్బ తగిలో జబ్బుచేసో ఏడుస్తో వుంటే "కఠినంగా, చెక్కుచెదరకుండా వుండండి." అని చెప్పడం కాదు ... "వూరికే తిన భయాలతో, బాధలతో పెద్దవాళ్ళ సానుభూతిని చూపుతో వుండాలనే ఆశని బిడ్డవించి తొలగించడం ముఖ్యం"—అన్న రచయిత మాటల్ని విస్మరించకూడదు.

— "సాధారణమైన బిడ్డకి, ప్రతి బిడ్డకూ అవసరమయినది

## రంగనాయకమ్మ ముందుమాట

తెలుగు పత్రికలు చదవగల జ్ఞానమూ, వుత్తరాలు రాయగలగడమూ, చిన్న భాగారాలు, హెచ్చవేతలూ చెయ్యగలగడమూ, ఇవి నేర్పితీరాలి.... ...తక్కిన జ్ఞానం అనవసరం .... ఇంక ముందు జీవిత మంటారా ? ధనమూ, ఆస్తీ, అధికారమూ సంపాదించేందుకు పదవులకు పాకులాడే మనుషులు, ఎంత సౌఖ్యాన్ని బలిఇచ్చుకుంటారో తెలిస్తే తమ పిల్లల్ని ఆ విధంగా ఎన్నడూ ప్రోత్సహించరు."—ధనం కోసం, అధికారాల కోసం జరిగే పెనుగులాటలు చూస్తూ ఎంతెంత చదువులు చదివిన విద్యావంతులు కూడా జీవితాలలో నిజమైన సుఖ శాంతులు పొందే స్వభావాలు అలవర్చుకోక పోవడంచూసీ, పిల్లలకు సరైనజ్ఞానం ఇవ్వలేని బళ్ళనీ, పుస్తకాల్నీ చూసీ, 'పెద్ద పెద్ద చదువులు అనవసరం, వాటివల్ల సుఖపడే దేమీలేదు' అనే అభిప్రాయానికి వొచ్చారీ రచయిత. కానీ మిగిలిన రచన అంతా చూస్తే పెద్ద చదువులు వద్దని చెప్పడమే చలం అభిప్రాయం కాదని స్పష్టంగానే తెలుస్తుంది. పాఠశాలలు ఎట్లా మారాలో, విద్యఎలాంటి ప్రయోజనాలు ఇవ్వాలో, మానవుడు ఎంత వున్నతమైన ఆదర్శాలతో జీవించాలో చలం చెప్పింది గమనిస్తే అటువంటి విద్యకూడా పిల్లలకు అవసరంలేదని చలం చెపుతున్నట్టుగా అభిప్రాయ పడము.

—"అంతా తమకే కావాలని, ఎవరికీ పంచక దాచుకునే భాగ్యవంతులూ, తమకు లేదని ఈర్ష్యతో ఏడ్చే బీదవాళ్ళూ.... అందరూ చిన్నప్పుడు ఏడుపు గొట్లే."

"దయార్ద్ర హృదయులైనా, వాళ్ళకి అలవాటు గనక సిపాయిలూ రాజులూ యుద్ధంలో శతృవుల్ని చంపుతారు."

ఈ రకం అభిప్రాయాలు నిస్సందేహంగా తప్పు అభిప్రాయాలే. బీదవాళ్ళు ధన వంతుల్ని చూసి ఈర్ష్య వలన ఏడుస్తారనడం, యుద్ధాలు ప్రోత్సహించే పాలకులు దయార్ద్ర హృదయులుగా కూడా వుంటారనడం, ఇంకా ఈ రకం అభిప్రాయాలు వ్యక్తపరచడానికి కారణం

ఈ రచయితకు— "వర్గ" సమాజానికి సంబంధించిన శాస్త్రీయమైన అవగాహన ఏమీ లేక పోవడమే. తనకు తెలిసిన సమాజాన్ని చూసి తన కామెన్ సెన్స్‌కి అందినంతవరకే దాన్ని అర్థం చేసుకున్న ధోరణి ఇది.

—పిల్లల పెంపకం గురించి ఈ రచనలో చెప్పిన సూచనలన్నీ మధ్య తరగతి కుటుంబాలవారికి మాత్రమే అవసరమౌతాయి. వుపకరిస్తాయి. దేశ జనాభాలో సగానికి పైగా కటిక దరిద్రులు వున్నారే, వారి పిల్లల పెంపకం మాటేమిటి?

"పిల్లల్ని ఆరోగ్యకరంగా, జ్ఞానవంతంగా పెంచాలి." అన్నప్పుడు అది కేవలం మధ్య తరగతి వారికీ, ధనవంతులికి మాత్రమే వర్తిస్తుందా? పేద పిల్లల పెంపకానికి వర్తించదా?

"పేద పిల్లల సంగతి నాకెందుకు? వాళ్ళకోసం నేను చెప్పలేదు." అంటారా చలం? ఎన్నటికీ అనరు.

సాధారణంగా 'వర్గ' సమాజం గురించిన శాస్త్రీయ దృక్పథం లేని మధ్య తరగతి రచయితలు తమ చుట్టూ వుంటూ, తమకు పరిచయమైన మధ్య తరగతి సమస్యల్ని మాత్రమే చూడ గలుగుతారు. ఎవరైనా అంతే. చలం కూడా అంతే. అందుకే చలం మధ్య తరగతి కుటుంబాలకు సంబంధించిన పరిస్థితుల ప్రకారమే బిడ్డల పెంపకానికి సూచనలు ఇచ్చారు. చెప్పింది మధ్య తరగతి పిల్లల గురించే అయినప్పటికీ పేద పిల్లల గురించి రచయిత కేమీ సానుభూతి లేదని అర్థం కాదు.

"పిల్లల్ని శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతులుగా పెంచాలి"— అన్నప్పుడు ఆ మాటలు దేశంలో వున్న పిల్లలందరి విషయంలోనూ వర్తిస్తాయి. "కొందర్నే అలా పెంచాలి" అనే అర్థానికి అవకాశం లేదు.

పేదవారికి వారి పిల్లల పెంపకం గురించి ఏమైనా చెప్పవలసివస్తే "మొట్టమొదట— మీ చంటి పిల్లలికి కడుపునిండా పాలు ఇవ్వండి. మీ

ఎద పిల్లలికి కడుపునిండా అన్నం పెట్టండి. మీ పిల్లలికి ఎప్పటికప్పుడు శ్రద్ధగా వైద్యం చేయించండి. మీ పిల్లలు ఎప్పుడూ ఆరోగ్యవంతమైన ప్రదేశాల్లో నివసించే విధంగా చెయ్యండి. — అని మాత్రమే ముఖ్య సూత్రంగా చెప్పాలి. దాని తర్వాతే మిగతా పెంపకం అంతా.

మరి పిల్లలికి కడుపునిండా తిండి పెట్టే విషయం, వైద్యం చేయించే విషయం, ఆరోగ్యవంతంగా పెంచే విషయం పేద తల్లి దండ్రులు పాటించగలరా? అలా పాటించ లేకపోతే వారి తప్పు అవు తుందా? "వారు పిల్లల్ని సరిగా పెంచరు. కడుపునిండా తిండైనా పెట్టరు? వాళ్ళు పరమ మూర్ఖపు తల్లిదండ్రులు" అని వారిని ఎవరైనా అనవచ్చునా? అంటే అది కరెక్టు అవుతుందా ?

సరిగ్గా అలాగే, పిల్లల పెంపక విషయంలో మధ్యతరగతి కుటుం బాలవారు కూడా ఆచరించలేని విషయాలు చాలా ఉన్నాయి.

పిల్లల్ని పెంచే తల్లిదండ్రులు ఎప్పుడూ దయగా, సంతోషంగా ఓర్పుగా ఉండాలి అని రచయిత అన్నారు కదా ? అలా వుండటానికి తల్లిదండ్రులు తప్పకుండా ప్రయత్నించ వలసిందే. చలం చెప్పిన సూచనల్ని మార్గదర్శకంగా తీసుకొని తమ ప్రవర్తన సరిదిద్దుకో వలసిందే. కానీ, ఆ తల్లిదండ్రులమధ్య వున్న సంబంధంగానీ, ఆ సంసారంలో ఇతర పరిస్థితులుగానీ ఎప్పుడూ సంతోషంగా, దయగా, సహనంగా వుండటానికి వీలైనవేనా ? భర్తచేతనో, అత్తచేతనో తిట్లు తిన్న ఒక కోడలు (తిట్లుగాకపోతే ఆమెకు అయిష్టమైన ఇంకో విషయం) తన విసుగునీ, కోపాన్నీ పిల్లలమీద చూపించింది అనుకోండి. భర్త చేత దెబ్బలు తిన్న భార్య, తర్వాత ఎందుకో పిల్లల్ని కొట్టింది అనుకోండి. "పిల్లల్ని కొట్టకు. విసుక్కోకు. ఎప్పుడూ దయగా, మనసునిండా సంతోషంతో వుండు—" అని చెప్తే ఫలితం ఏమిటి? తల్లివిసుక్కోకుండా వుండాలంటే ఆమెకు జీవితంలో ఇతర సంబంధాలవల్ల విసుగు కలిగే

పరిస్థితులు లేకుండా వుండాలి. "పిల్లల్ని కొట్టకు" అని తల్లికి చెప్పినప్పుడు "నీ భార్యని (ఆ తల్లివి) కొట్టకు." — అని కూడా తండ్రికి చెప్పవలసి వొస్తుంది. తన భర్త తనని కొట్టడం సహజమైనప్పుడు, తను తన పిల్లల్ని కొట్టడంకూడా సహజమే — ఆ తల్లి దృష్టిలో.

"నీ భర్త నిన్ను కొట్టడం సంగతి ఎందుకుగానీ నువ్వు మాత్రం పిల్లల్ని కొట్టకు"—అనడం కుదరదు.

'కొట్టడం' అనే ఉదాహరణని తీసుకోవడం ఇష్టంలేకపోతే ఇంకే విషయమైనా తీసుకు చూడండి.

పిల్లల్ని తమతో సమాన వ్యక్తులుగా భావిస్తూ ఎప్పుడూ హీన పరచకుండా, అవమాన పరచకుండా ప్రవ ర్తించాలి—అంటారు రచయిత. పిల్లల్ని తల్లిదండ్రులతో సమాన వ్యక్తులుగా చూడడం ఎప్పుడు సాధ్య మౌతుంది ? ముందు తల్లీ, తండ్రీ సమాన వ్యక్తులుగా వున్నారా ? తండ్రి, తల్లిని ఏ విషయంలోనూ హీనపర్చకుండా వున్నాడా ? తల్లి తండ్రిని ఏ విషయంలోనూ ద్వేషించకుండా వున్నదా ? ఆడదాన్ని (భార్యని) మనిషిగా భావించడ మంటేనే ఆ తండ్రికి హేళన. ఎంత "అభ్యుదయ భావాలు"గల తండ్రికైనా స్త్రీలపట్ల కొంత "తక్కువచూపు" వుండక తప్పదు. తన భార్యనీ, ఇతర స్త్రీలనీ, పురుషులకన్నా కొంత తక్కువగానే భావించే భర్త—తనకు పుట్టిన ఆడపిల్లల్నీ, మొగపిల్లల్నీ వొక్కలాగ ఎలా చూస్తాడు ? మొగపిల్లల్ని కొంత యెక్కువ వారిగానే భావిస్తాడు. తండ్రికాదు, తల్లికూడా అలాగే భావిస్తుంది. ఆ కుటుంబంలో తల్లిదండ్రుల మధ్య వున్న యెక్కువ తక్కువలే, ఆ కుటుంబంలో పుట్టే ఆడపిల్లలకీ, మొగపిల్లలకీ మధ్య ఏర్పాడతాయి. ఇది ఒక తప్పనిసరి సూత్రంగా పనిచేస్తుంది.

"... ఆడపిల్ల పెళ్ళికోసమే పుట్టినట్టూ, ఎవరికో పెళ్ళాంగా పుట్టినట్టూ మాట్లాడకూడదు. ఆమె జీవితం యెప్పుడూ పరాధీనమేననీ, పురుషులకు సేవచెయ్యడం ఆమె విధి అనీ, అన్నలకూ, తమ్ములకూ

చాకిరీ చేయించరాదు. మాట్లాడితే 'ఆడపిల్లవని జ్ఞాపక ముంచుకో' అన కూడదు. స్త్రీ దగ్గిర్నుంచి విధేయతగా, చాకిరీ తీసుకోవడం బాబుడి 'హక్కులై' నట్టు నేర్పకూడదు."—ఇవన్నీ యెంతో చక్కనిమాటలు. మొగపిల్లలికి ప్రత్యేక హక్కులు ఇవ్వకూడదు. నిజమే. కానీ, పురుషుడికి ప్రత్యేక హక్కులు వున్న సమాజంలో మొగపిల్లలకి ఆ హక్కులు లేకుండా చెయ్యడం ఎలా సాధ్యమౌతుంది? స్త్రీ అన్ని విధాలా పురుషుడి మీద ఆధారపడుతూ, పురుషుడిద్వారా గుర్తించబడుతూ, పురుషుడికి అణకువగా వుండడం, పురుషుడికి సేవచెయ్యడం తప్పనిసరై, అలా ప్రవర్తించకపోతే దిక్కులేని, స్త్రీకి స్వతంత్ర జీవనంలేని సమాజంలో మొగపిల్లల్ని ఆడపిల్లల్ని సమానులుగా భావించడం ఎలా సాధ్యమౌతుంది?—నిజంగా వారి స్థితి "సమానంగానే" వుందా? సమానంగా లేకపోయినా వార్ని సమానంగానే భావించడం సాధ్యమౌతుందా?— ఎన్నటికీ సాధ్యంకాదు.

పురుషుడి పరిస్థితి వొకరకంగానూ, స్త్రీ పరిస్థితి ఇంకొకరకంగానూ లేకుండా ఇద్దరి పరిస్థితి వొకరకంగానే, 'సమానంగానే' వుండడం జరిగి నప్పుడే (ఎలా జరుగుతుంది? అన్నది వేరే సంగతి) స్త్రీ పురుషుల్ని సమానంగా భావించడం జరుగుతుంది. ఆడపిల్లల్నీ, మొగపిల్లల్నీ ఒకే రకంగా పెంచడం జరుగుతుంది. అంతేగానీ—

"స్త్రీ — పురుషుల పరిస్థితుల్లో తేడాలు వుంటే వున్నాయి. వాటి గురించి మీరేం పట్టించుకోకండి. ఆ తేడాలు మీ మనసులో మాత్రం లేకుండా చేసుకోండి. మీ పిల్లల్ని మొగా—ఆడా భేదంలేకుండా పెంచితే చాలు. ఆ పిల్లలుకూడా ఆ భేదాలు లేకుండా అవుతారు," అని ఎవరైనా అంటే అది సరైన దృక్పథం అవదు.

"స్త్రీ—పురుషుల్లో ఎక్కువ తక్కువ లేమిటి? ఇద్దరూ సమానులే."—అని వొకవ్యక్తి (లేదా కొందరు వ్యక్తులు) నిజంగానే భావిస్తున్నారనుకోండి. భావం మార్చుకున్నారు కాబట్టి సమాజంలో స్త్రీ—పురుషుల

పరిస్థితుల్లో తేడా మారిందా? ఆర్థికంగా, సాంఘికంగా స్త్రీ పురుషుడిమీద ఆధారపడటం అనేది మారిపోయిందా? ఆ పరిస్థితి అలాగే వుంది, 'స్త్రీ పురుషులు సమానులే' అని భావం మాత్రం మార్చుకుంటే స్త్రీ—పురుషులు సమానులవుతారా? సమానులుగా లేనివార్ని గురించి సమానులు అయినట్టే భావించడం అంటే—వొక అబద్ధాన్నీ, భ్రమనీ నమ్మడం అన్నమాట. సమాజంలో "వున్న" నిజాన్ని "లేదు" అనుకోవడం అన్న మాట. ఆ విషయాన్ని నిజంగా లేకండాచేసి, అప్పుడు 'లేదు' అనుకోవాలి గానీ, వునికిలో వున్నదాన్ని లేదనుకుంటే ఏం ప్రయోజనం?

స్త్రీ — పురుషుల పరిస్థితి సమానం ఐతేనే వారు 'సమానులు' అవుతారు. సమాజంలో వారి స్థితి సమానంగా లేకపోతే వారు సమానులు అవరు. ఆ స్థితి మార్చకుండా వూరికే పైకి "స్త్రీ తక్కువేమిటి? పురుషుడి ఎక్కువేమిటి? ఇద్దరూ సమానులే."— అని ప్రపంచం అంతా అనుకున్నా ఆ ఇద్దరూ అసమానులే గానీ సమానులు మాత్రం అవరు. స్త్రీ—పురుషులు సమానులేనని నిజంగా హృదయపూర్వకంగా భావించే వాళ్ళకూడా జీవితం పొడుగునా 'సమానులుగాని స్త్రీ పురుషుల్నే' చూడవలసి వస్తూ వుంటుంది. అంతేగాక అలా భావించే పురుషుడు స్త్రీతో గానీ, స్త్రీ పురుషుడితో గానీ అసమాన ధోరణిలో ప్రవర్తించవలసి వుంటుందేగానీ, తను అనుకునే 'సమానత్వం'తో ప్రవర్తించడానికి వీలువుండదు—అలాంటి సమానత్వం అసలు ఏర్పడలేదు కాబట్టి.

"ఆడపిల్లల్ని మొగపిల్లల్నీ సమానులుగానే భావించి పెంచండి."—అంటే వారు నిజంగా సమానులుగాలేని సమాజంలో అలా భావించడానికీ, అలా పెంచడానికీ వీలయ్యే పరిస్థితి వుండదు. ఎక్కడైనా వొకటి రెండు కుటుంబాల్లో తల్లిదండ్రులు వారి చైతన్యంవల్లా, వారి అభ్యుదయ భావాలవల్లా, వారి మధ్య నిజంగా ఏర్పడ్డ స్నేహంవల్లా, ముందు వారిలో ఎక్కువ తక్కువ భావాలు లేకుండా చేసుకుని తమ పిల్లల్ని

కూడా సమాన స్థాయిలో పెంచడానికి ప్రయత్నించారే అనుకుందాం. కానీ ఆ పిల్లల్ని తయారు చెయ్యడానికి ఆ తల్లిదండ్రుల పెంపకం వొక్కటే చాలదు. ఆ పిల్లల జీవితాన్ని ప్రభావితం చేసే యితర కోణాలు అనేకం వున్నాయి.

పిల్లల్ని ఇంట్లో మాత్రమే కూచోబెట్టి పెంచం. బయట యెంతో ప్రపంచం వుంది. సమాజం వుంది. ముఖ్యంగా బడి. పిల్లలు ఎన్నో సంవత్సరాలు బళ్ళల్లో విద్య నేర్చుకోవాలి. ఇతర సంస్థల్లో కళలూ, ఇతర విషయాలూ నేర్చుకోవాలి. ఇంట్లో స్త్రీ పురుషుల్ని సమానులుగా భావించడం నేర్పితే, బళ్ళో పురుషుడ్ని అధికుడుగానూ, స్త్రీని అల్పురాలిగానూ చెప్పే పాఠాలు వుంటాయి. పురుషుడికి సేవచెయ్యడమే స్త్రీ ధర్మమని బోధించే నీతులూ, శతకాలూ, పతివ్రత కథలూ వుంటాయి—ఇంట్లో ప్రకృతి జ్ఞానమూ, తర్కించే శక్తి నేర్పదల్చుకుంటే, బళ్ళో మూఢ నమ్మకాలూ, దేవుడి ప్రార్థనలూ చెప్పే వాతావరణం వుంటుంది. (పిల్లల్ని భక్తుల్ని చెయ్యాలన్నాకూడా ఇంతే. బయట సమాజంలో హేతువాద లక్షణాలు వున్నాయి—ఎంత తక్కువగానైనా ఇంట్లో భక్తి నేర్పదల్చుకుంటే దాన్ని పూర్తిగా నేర్పలేరు.)

ఇల్లూ, బడీ మాత్రమే గాకుండా, పిల్లలకు అనేకమంది స్నేహితులు వుంటారు. ఆ స్నేహితులు కూడా స్త్రీ—పురుషుల మధ్య వ్యత్యాసాలో, భక్తో, పాటించే స్వభావాలు ఏర్పర్చుకుని వుంటారు. (వారి తల్లిదండ్రుల వల్ల. స్నేహితులందరూ అలాగే వుండక పోవచ్చు. కొందరు ఇటూ అటూ చెందని అస్పష్టమైన అభిప్రాయాలతో కూడా వుండవొచ్చు.)— అంతేగాక ఇంకా బయట తారసపడే సంఘటనలూ, పుస్తకాలూ, సినిమాలూ — వీటన్నింటి ప్రభావమూ (సమాజ ప్రభావం) పిల్లలమీద పడుతుంది. తల్లిదండ్రుల ప్రవర్తన వల్లనే పిల్లలు బాగు పడడమో చెడి పోవడమో జరుగుతుందను కోవడం చాలా పొరపాటు.

ఒక కుటుంబంలో తల్లిదండ్రులు పెంచే ఆదర్శ పెంపకాని కీ, బయట సమాజానికీ పరస్పర వ్యతిరేకతలు (వైరుధ్యాలు) వున్నప్పుడు పిల్లల్ని మనం అనుకున్న విధంగా (మంచిగా) పెంచలేము. వైరుధ్యాలు లేని పరిస్థితుల్ని సృష్టించుకునే వరకూ అలా పెంచడం సాధ్యంకాదు.

వైరుధ్యాలు లేని పరిస్థితులు సృష్టించు కోవాలంటే మనసులో 'భావాలు' మార్చుకుంటే చాలదు. వైరుధ్యాల్ని కలిగిస్తోన్న పరిస్థితుల్ని మార్చుకోవాలి.

కానీ ఈ వైరుధ్యాలు ఎలా పోతాయి ? ఎవరో కొందరు వ్యక్తులు తమ పాత అభిప్రాయాలు మార్చుకున్నారు కాబట్టి, సమాజం అంతా మారుతుందా ? సమాజమంతా తన అభిప్రాయాలు మార్చుకుంటుందా ? అలా మారని సమాజంలో వుంటూ, మారని విద్యనే నేర్పిస్తూ, మారని సంబంధాలు పాటిస్తూ, పిల్లల్ని మాత్రం ఆ సమాజానికి అతీతంగా, సమాజంలో లేని అభిప్రాయాలతో పెంచడం ఎలా సాధ్యమౌతుంది ? అలా పెంచాలనుకునే పెద్దలు ఎక్కణ్ణించి వొస్తారు మారని సమాజంలో ?

"బిడ్డల్ని కొట్టకుండా తిట్టకుండా ప్రేమగా; బాధ్యతగా, జ్ఞానవంతంగా పెంచండి." — అని ఎవరైనా అంటే అందులో తప్పేమైనా వుందా ? —— ఏ మాత్రం లేదు. కానీ ఇంతకాలం వరకూ సమాజంలో పిల్లల్ని అలా పెంచడం మాత్రం జరగడం లేదు. పిల్లల్ని ఎలా పెంచితే సరిగ్గా పెంచడం అవుతుందో, ఆ ఆలోచనల్ని సమాజం పట్టించుకోవడం లేదు. దేశంలో పిల్లలందర్నీ తిండికీ, ఆరోగ్యానికీ లోటులేని స్థితిలో పెంచాలని దేశం భావించడంలేదు. (ధనికుల పిల్లలకు మాత్రం లోటు లేకుండా వుంటే చాలు) పిల్లల్ని సరిగా పెంచడం ఏమిటో తల్లిదండ్రులు ఎరుగరు. తమ పెంపకం సరిగ్గానే వుందనీ, అంతకన్నా సరి చెయ్యవలసిందేమీ లేదనీ వారను కుంటారు.

ఎక్కడైనా కొంత జ్ఞానం గల తల్లిదండ్రులు ఇంకా బాగా పెంచాలని ప్రయత్నించినా వారి ప్రయత్నాలు అంతగా సఫలం కావు. చుట్టూ సమాజం వారి ప్రయత్నాలకు విరుద్ధంగా వుండడం వల్ల వారేమి చెయ్యే లేరు.

పిల్లల్ని సక్రమంగా పెంచడం, పెంచకపోవడం అనేది ఎవరో వొకరిద్దరి వ్యక్తులకు సంబంధించిన విషయం కాదు. అది, మొత్తంగా సమాజాని కంతకీ సంబంధించిన విషయం. సమాజానికంతటికీ సంబంధించిన అనేక విషయాల్లాగానే పిల్లల్ని పెంచడం కూడా వొకటి. పున ప్రస్తుత సమాజంలో (వర్గ భేదాలు గల దోపిడీ సమాజంలో, ధనిక పేద తేడాలూ, స్త్రీ-పురుషుల మధ్య ఎక్కువ తక్కువలూ, ఇంకా ఇతర నీచాలూ వున్న సమాజంలో) పిల్లల్ని 'చక్కగా' పెంచే పరిస్థితులు లేవు.

కమ్యూనిస్టు సమాజంలో జరిగే మార్పులన్నింటిలోనూ వొక ముఖ్యమైన మార్పు — దేశ జనాభాలో పిల్లలకే ప్రథమ స్థానం ఇచ్చి, ప్రత్యేకత ఇచ్చి, ప్రతీ విషయంలోనూ పిల్లల్ని శ్రద్ధాశక్తులతో పెంచడం. ఆ సమాజ పరిస్థితుల్లో కొందరు చంటి బిడ్డలకు పాలు లేకపోవడం, కొందరు పిల్లలకు కడుపునిండా తిండి లేకపోవడం, వైద్యం లేకపోవడం ఆరోగ్యవంతమైన జీవన పరిస్థితులు లేకపోవడం వుండవు. కొట్టడం తిట్టడం పిల్లల విషయాల్లో అశ్రద్ధ చెయ్యడం, పిల్లల్ని పెద్దల సేవకిందా, భయం కిందా నొక్కి అణిచి వుంచడం జరగదు. పిల్లల్ని ఎలా పెంచాలని చలం ఆశిస్తారో, అలాంటి పెంపకానికి అనుకూలమైన పరిస్థితులు కమ్యూనిస్టు సమాజంలోనే ఏర్పడతాయి. ఆ సంగతి చలం గమనించక పోలేదు. కానీ అనేక సందేహాలు ఆయనకి ఆ సమాజం గురించి.

"ఈ పద్ధతుల్ని అమలులోకి తీసుకొచ్చి స్త్రీలకి బలవంతంగా నైనాసరే జ్ఞానాన్నీ, శిక్షణనీ ఇచ్చి, కాకపోతే ప్రభుత్వమే ఈ తల్లి

రాక్షసుల బిడ్డల్ని తీసేసుకుని రక్షించే ప్రయత్నం చేస్తుంది. 'సోషలిజం' అంటే ఎంత గొప్ప కృతజ్ఞత కలుగుతుంది నాకూ! ఇంకా ఎప్పుడు వస్తుందా అని ఎంత తొందర నాలో! తక్కిన విలువలు ఎంత ధ్వంసం కానీ, ఈమాత్రం ఏ ప్రభుత్వమైనా చెయ్యగలిగితే, బలవంతం తప్పు కాని, ఇతరుల్ని, ముఖ్యం దిక్కుమాలినపిల్లల్ని హింసించకండా పెద్దవార్ని ఎంత హింసించినా ఒప్పుకుంటుంది నా హృదయం." కమ్యూనిజంలో పిల్లల్ని ప్రేమగా, జ్ఞానవంతంగా పెంచుతారని చలానికి తెలుసు. అలా పెంచడం ఎందుచేత వీలవుతున్నదో,ఆ సమాజంలో జరిగే మార్పులేమిటో మాత్రం స్పష్టంగా తెలీదు. పైగా కమ్యూనిజంమీద అనేకరకాల భయాలు! సందేహాలు!—అక్కడ విలువలన్నీ నాశనమైపోతాయి అనీ, అక్కడ పెద్దల్ని హింసిస్తారు అనీ, ఆ ప్రభుత్వం పరిపాలన అంతా బలప్రయోగం తోనే చేస్తుంది అనీ, ప్రజలకేమీ స్వేచ్ఛవుండదు అనీ—ఇలాగ.

పిల్లల్ని చక్కగా పెంచే విలువ ఒక్కటీ వుండి మిగిలిన మంచి అంతా పాడైపోతుందా? ఒక మంచి ఏర్పడడానికి మిగతా మంచి నశించిపోతుందా? ఎప్పుడైనా ఎక్కడైనా చెడ్డంతా నశించినప్పుడే మంచి వొస్తుంది. మిగతా విలువలన్నీ మంచిగా మారడంచేతనే, బిడ్డల్ని పెంచే విషయంకూడా మంచిగా మారిందని అర్థం. ఏ దుర్భరపరిస్థితుల్లో పిల్లల్ని మంచిగా పెంచలేమో, ఆ దుర్భర పరిస్థితులు మారడం వల్లనే వాళ్ళని సరిగా పెంచగలుగుతాము. దుర్భరపరిస్థితులు మారడం అంటే పేద తనం, స్త్రీ పురుషుల మధ్య తేడాలూ, కులభేధాలూ, మూఢనమ్మకాలు వంటి చెడ్డలక్షణాలన్నీ నశించడమే. ఆ కోణాలలోకూడా మంచి ఏర్పడడమే. దాని ఫలితంగానే సమాజంలో వైరుధ్యాలు నశించి (నశించడానికి మార్గం ఏర్పడి) పిల్లల్ని మంచిగా పెంచడానికి వీలైన పరిస్థితులు కలగుతాయి. బిడ్డల్ని వున్నతంగా పెంచే సమాజం గురించి— "....తక్కిన విలువలు ఎంత ధ్వంసంకానీ...." అని బాధ

పడవలసిన అవసరం లేదు. తక్కిన విలువలు ఏమీ ధ్వంసం కావు. బిడ్డల్ని పెంచే విలువకూ (ఒక విలువకూ) తక్కిన విలువలకూ ఏ సమాజంలోనూ వైరుధ్యం వుండదు. (దోపిడీ సమాజంలో అన్ని విలువలూ వొక్కలాగే చెడ్డగా వుంటాయి, వొకదాని కొకటి విరుద్ధం గాకుండా. అందులో ఏదైనా వొక విలువని మంచిగా మార్చబోతే మిగతావాటితో వైరుధ్యం వొస్తుంది — అలాగే కొత్త సమాజంలో మారిన విలువలన్నీ వొక్కలాగే మంచిగా వుంటాయి. ఒకదాని కొకటి విరుద్ధం గాకుండా.)

కమ్యూనిజం గురించి చలం వ్యక్తంచేసిన ఇతర భయాలు — అక్కడి ప్రభుత్వం ప్రజలందర్నీ హింసిస్తుందనీ, స్వేచ్ఛ వుండదనీనూ అవును, హింసిస్తుంది। స్వేచ్ఛ వుండదు। కానీ, ఎవర్ని ? ఎవర్ని హింసిస్తుంది ? ఎవరికి స్వేచ్ఛ లేకుండా చేస్తుంది. ? — దోపిడీకే ! దోపిడీ అనుకూల శక్తులకే ! మళ్ళీ దోపిడీ సమాజాన్ని పునరుద్ధరించాలని కోరే నీచులికే. దోపిడీని హింసించ కూడదా ? దోపిడీని నాశనం చేయ్యడానికి ప్రయత్నించకూడదా ? దోపిడీకి కూడా స్వేచ్ఛ ఇవ్వాలా ? (దోపిడీని హింసించకుండా సుఖంగా స్వేచ్ఛయిస్తే కథంతా మళ్ళీ మొదటికి రావలసిందే. బిడ్డల్ని పెంచే గొప్పగొప్ప విధానాల గురించి ఇలాగే ఆశగా వూరికే పుస్తకాల్లో రాసుకుంటూ వుండవలసిందే. ఇక ఏనాటికీ అమలు జరగడం వుండదు) దోపిడీని తల ఎత్తనివ్వకండా చెయ్యడానికే ప్రజల్నందర్నీ కొన్ని నిబంధనల్లో, కొంత ప్రత్యేక క్రమశిక్షణలో వుంచుతుంది కమ్యూనిస్టు ప్రభుత్వం. దానివల్ల దోపిడీదారులకో, మళ్ళీ దోపిడీ సమాజం కావాలని కోరేవారికో తప్ప, దాన్ని వ్యతిరేకించేవారి కేమీ బాధవుండదు. ప్రభుత్వ నిబంధనల్ని వారు చాలా సంతోషంగా, బాధ్యతగా పాటిస్తారు. దానివల్ల వారేమీ హింసపడరు. హింసపడేదంతా దోపిడీ ప్రభుత్వంవల్ల సుఖపడాలనుకునే

వారే.—ఈ విషయాలు ఇంత స్పష్టంగా తెలిస్తే కమ్యూనిస్టు ప్రభుత్వంలో స్వేచ్ఛవుండదనీ, అక్కడ ప్రజలందర్నీ హింసిస్తారనీ అనుకోలేరు- ప్రజలు కమ్యూనిస్టు సిద్ధాంతాలవల్ల ప్రభావితులు కాకుండా వుండాలనీ, కమ్యూనిస్టు సమాజాన్ని కోరకుండా వుండాలనీ — దోపిడీ ప్రభుత్వాలు కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాలు చేస్తాయి. వాటి ఫలితమే చలంలాంటి మేధావులు కూడా కమ్యూనిజాన్ని తల్చుకుని జడుసుకోడం.

"ఒక్కటేవిధం. ఏ దయగల సోషలిజమో, ఏ డిక్టేటరో బిడ్డ బాధ పడుతున్నట్టు తెలిస్తే తల్లి దండ్రుల్ని కొరత వేయించడమో, లేకపోతే బిడ్డల్నందర్నీ ప్రభుత్వమే పెంచడమో చెయ్యాలి. అవొక్కటే మార్గం కనపడుతుంది."—అనడంలో అర్ధమేమిటి ? సోషలిజం స్వభావమేమిటో, 'డిక్టేటర్' స్వభావం ఏమిటో, సోషలిస్టు పరిపాలనకీ, డిక్టేటర్ పరిపాలనకీ తేడా వుందో లేదో, ఎంత తేడావుందో, ఎందుకు తేడా వుందో, డిక్టేటర్ ప్రభుత్వం బిడ్డలమీద దయగా వుంటుందో లేదో—ఈ విషయాలేవీ చలం ఆలోచించలేదు. పట్టించుకో లేదు — ఏదో వొక ప్రభుత్వం బిడ్డల్ని సుఖంగా వుంచాలి. అంతే. బిడ్డల్ని సుఖంగా వుంచలేని ప్రభుత్వాన్ని కాదు కోరేది. అలా వుంచలేని సమాజాలూ, ప్రభుత్వాలూ అక్కరేలేదు.

"బిడ్డ కడుపులో పడ్డది మొదలు బిడ్డకి ఏడాది వొచ్చేవరకూ తల్లిని సుఖంగా వుంచడం ప్రభుత్వ బాధ్యత. ప్రతి గర్భం ధరించిన స్త్రీ విషయం తెలుసుకుని పరిస్థితులు సరిగా లేనిచోట, అవసరమైతే ఆమెని బాధ్యత తెలీని భర్తనించీ, బంధువులనించీ, అధికార్లనించీ, ఎదిగిన పిల్లలనించీ, తప్పించి సరైన సంరక్షణ నివ్వడం ప్రభుత్వం తన ధర్మంగా చూసుకోవాలి."—అంటున్నారు.

ఏ ప్రభుత్వం, ఎటువంటి ప్రభుత్వం స్వీకరిస్తుందీ ధర్మాన్ని ? ఇప్పటి మన ప్రభుత్వాలు (చలం ఈ పుస్తకం 1924 లో రాశారు.

అప్పటి బ్రిటిష్ ప్రభుత్వంగానీ, తర్వాత ప్రభుత్వం గానీ) ఎందుకు గుర్తించడంలేదీ ధర్మాన్ని ?— అసలు వాటి దృష్టిలో ఇది ధర్మంకాదు గనక. రాజ్యాలు పాలించే ప్రతీ ప్రభుత్వమూ ఈ ధర్మం స్వీకరించదు. అన్ని రకాల ప్రభుత్వాలమీదా ఆశలు పెట్టుకుని లాభంలేదు. ప్రభుత్వ స్వభావాల గురించి శాస్త్రీయంగా చలం ఏమీ తెలుసుకోకపోయినా, బిడ్డల్ని పెంచడంలో తల్లిదండ్రులకే గాకుండా సమాజానికీ, ప్రభుత్వానికీ, చట్టాలికీ కూడా బాధ్యత వుండాలనే సంగతి అనేక సందర్భాలలో నొక్కి చెప్పారు.

—"ఇంటికి వొచ్చే ప్రతీవారినీ పెద్దవాళ్ళు సమానంగా చూడాలి. స్నేహ తారతమ్యమే గౌరవ తారతమ్యం కలిగించే ప్రధాన సూత్రంగా వుండాలి. (స్నేహాన్నిబట్టే గౌరవించాలనీ, స్నేహంలో ఎక్కువ తక్కువల్ని బట్టె గౌరవించడంలో ఎక్కువ తక్కువలు చూపాలనీ అర్థం) కులమూ, లింగమూ (స్త్రీ పురుష భేదాలు) భాగ్యమూ, మొదలైన భేదాలన్నీ ఏ మాత్రమూ గౌరవ విషయంలో పాటించకూడదు." — ఈ ఆచరణ ఎప్పుడు సాధ్యమౌతుంది ? భేదాలు పాటించకపోవడం ఎప్పుడు ? భేదాలు లేనప్పుడే। భేదాల్ని సృష్టించే పరిస్థితులు లేనప్పుడే। అంతేగానీ భేదాలు వున్నా వాటిని పాటించకపోవడం అనేది జరగదు. అశాస్త్రీయం అది। ఆ భేదభావాలు క్రమంగా మార్చుకోవాలని చెప్పడమే చలం దృష్టి.

"ప్రకృతిశాస్త్రం (సైన్సు)లో బిడ్డకు విశ్వాసం కుదర్చాలి. ప్రతిదీ మనుషులు తెలుసుకోగలరనీ, ప్రత్యక్షంగా ఎక్స్పెరిమెంటువల్ల గాక మూర్ఖంగా నమ్మాలని—అనే సంగతుల్లో చాలా అబద్ధాలుంటాయనీ బిడ్డకి తెలియజెప్పడం మంచిది. శాస్త్రాలూ, మనుషులూ చెప్పడం వల్లగాక

తనంతట తను చూచి స్వబుద్ధితో విచారించి తెలుసుకునే అభ్యాసాన్ని కలగజెయ్యాలి. పెద్దవారు ఏదో సంగతి చెప్పి, తాము చెపుతున్నారు గనక నమ్మమని బిడ్డ ననగూడదు. తల్లిదండ్రులు చెప్పినా నమ్మక తానే స్వబుద్ధి నుపయోగించే అలవాటు వీలైనంత వరకెక్కువ చెయ్యాలి."

రాత్రీ పగలూ, నిత్యం, ప్రతీక్షణం, దేవుళ్ళనీ, దెయ్యాలనీ భూతాలనీ, జాతకాలనీ, సాముద్రికాలనీ, నాడీ గ్రంథాలని పట్టుకు వేళ్ళాడే సమాజంలో—యౌవ్వనంలో నాలుగు సైన్సు మాటలు మాట్లాడి కాస్త వయస్సు మళ్ళగానే "మహర్షుల" వెంటా "ఆశ్రమాల వెంటా 'శాంతి' వెతుక్కునే మూర్ఖుల్ని వుత్పత్తిచేసే సమాజంలో బిడ్డలకు ప్రకృతి శాస్త్రాలు నేర్పుతారా? ప్రతీక్షణం ప్రతీ చెత్తనీ గుడ్డిగా, మూర్ఖంగా నమ్మే పెద్దలు, బిడ్డలకిమాత్రం "దేన్నీ గుడ్డిగా మూర్ఖంగా నమ్మకండి." అని చెప్ప గలుగుతారా?

ఇలాంటి విషయాల్నే "వైరుధ్యాలు" అంటుంది మార్క్సిజం. ఈ వైరుధ్యాల్ని అర్థం చేసుకొని బోధనలు, సమస్యల్ని సంపూర్ణంగా పరిష్కరించలేవు.

—మొగపిల్లలకూ ఆడపిల్లలకూ ఒకే విధమైన బట్టలు వెయ్యడం అవసరం. జుట్టు ఒకటే విధంగా వుంచాలి. ఆడపిల్లలకు ముక్కులు చెవులు కుట్టించడం తప్పు. పేర్లు కూడా మొగ ఆడ విచక్షణ లేకుండా పెడితే మరీ మంచిది." — పేర్ల విషయం తెలీదు గానీ మిగతా విషయాలన్నీ సోషలిస్టు చైనాలో ఆచరణలోకి వొచ్చాయి. మొగా ఆడా వొకేరకం బట్టలు, జుట్టు కత్తిరింపులు, ఎవ్వరూ ఏ రకమైన నగలూ పెట్టరు.

"చిన్నప్పటి నించీ కూడా బిడ్డలకి వివాహాన్ని గురించీ, ప్రేమ గురించీ చక్కని నిజమైన అభిప్రాయాలు ఇవ్వాలి."

"పిల్లలకు వారి దేహం మీదా, శీలం మీదా అమితమైన గౌరవం ఉండాలి. ప్రేమా, ఇతరులను ప్రేమించడం అనే అనుభవం అతి అద్భుతంగానూ, వున్నతంగానూ కనపడాలి. వారికి సంపూర్ణంగా ప్రేమిస్తేనే గానీ, తమ మనసునంతా అర్పిస్తేనే గానీ దేహాన్ని స్వాధీనం చేయడం అతి నీచమని తెలియాలి."

"బిడ్డ ఆరోగ్యకరమూ, సహజమూ అయిన జీవితాన్ని గడపాలి ..."

"ఇష్టం లేకపోతే బిడ్డని కనక్కర్లేదు. కానీ పొరపాటున పుడుతుందేమో దానికి సిద్ధంగా వుండాలి. పుట్టాక యింక యావశ్శక్తినీ వినియోగించి దాన్ని సుఖపెట్టాలి బతికించాలి. తల్లి కోసం, బ్రతకాలనే ఆ బిడ్డ ఆసక్తికోసం, వైద్యం, జ్ఞానం, తెలివీ మీకు సాయపడాలి."

—ఎంతెంత ఆరోగ్యవంతమైన సూచనలో! వీటి నన్నిటినీ సంపూర్ణంగా ఆచరణలోకి తెచ్చుకోవాలి — కానీ ఎప్పుడు ? ఈ సమాజం ఇలాగే వున్నప్పుడు మాత్రంకాదు.

స్త్రీ పురుషులు సమానులై, ప్రేమ కోసమే వివాహాలు జరిగి, భార్యాభర్తల సంబంధాలలో వైరుధ్యాలు నశించి, గృహానికీ సమాజానికీ మధ్య వైరుధ్యాలు నశించి, పిల్లల్ని జ్ఞానవంతంగా పెంచడం అనేది తల్లిదండ్రులికీ సమాజానికీ, ప్రభుత్వానికీ కూడా సమాన ధర్మమైనప్పుడు మాత్రమే.

"అయితే ఇక ఈ పుస్తకం వల్ల ప్రస్తుతం ఏమీ ప్రయోజనం

లేదా? పిల్లల్ని మంచిగా పెంచే ప్రయత్నాలు చెయ్యనే అక్కర్లేదా?"— అనే సందేహాలు రావొచ్చు.

"ఈ సమాజంలో పిల్లల్ని సరిగ్గా పెంచలేము" అనడం అంటే "ఆ ప్రయత్నాలేమీ చెయ్యక్కర్లేదు" అని అర్థం కాదు. మనకు సాధ్యమైనన్ని విధాలుగా మంచి పద్ధతుల్ని ఆచరిస్తూనే ఈ సమాజాన్ని మార్చేసే ప్రయత్నం కూడా చేసుకోవాలి. కొందరి భావాల మార్పు సమాజం మార్పుకీ (పరిస్థితుల మార్పుకీ), సమాజం మార్పు అందరి భావాల మార్పుకీ దారి తీస్తుంది. భావాల మార్పు ఆచరణని మారుస్తుంది. ఆచరణ మరి కొన్ని భావాలను మారుస్తుంది. ఏది ముందు అనే ప్రశ్న లేదు. భావమూ, ఆచరణా రెండూ ఒకదాన్నొకటి పెనవేసుకుని వుండేవే. ప్రస్తుతానికి ఈ రచనలో వీలైనన్ని సూచనల్ని ఆచరణలో పెట్టుకోవాలి. అవి తగినంత సత్ఫలితాన్ని ఇవ్వకపోతే (నిజంగా నిజాయితీగా ఈ సూచనల ప్రకారమే పెంచినప్పుడు నూటికి నూరు పాళ్ళూ మంచి ఫలితాలు రావాలనుకోండి. కాని ఈ సమాజంలో అయితే చాలా తక్కువగా నూటికి 25 వంతులలో 30 వంతులలో మాత్రమే ఫలితం కనపడవొచ్చు) మన పెంపకం పిల్లలమీద అంతగా పనిచేసినట్టు లేకపోతే అది ఈ సూచనల తప్పు కాదు. పిల్లల తప్పూ కాదు. మంచి విత్తనాల్ని చౌడు భూమిలో జిమ్మినట్టు మంచి సూచనల్ని తప్పు పరిస్థితుల్లో ఆచరిస్తున్నాం అన్నమాట. భూమి మంచిది గాకపోయినా ఆ భూమిలోనే పండించక తప్పనప్పుడు, దాన్నే కాస్త కాస్త బాగు చేసుకోడం తప్పదు. విత్తనాలు మాత్రం ఎప్పుడూ మంచివే జిమ్మాలి కదా? అలాగే పిల్లల్ని ఈ సమాజంలోనే పెంచవలసి వొచ్చినప్పుడైనా మంచి పద్ధతులే పాటించాలి కాబట్టి ఈ సూచనల్ని శ్రద్ధగా పాటించడానికే ప్రయత్నించాలి. తగినంత ఫలితం రాకపోయినా నిరుత్సాహ పడకూడదు.

"ఈ పుస్తకమంతా బిడ్డల్ని హింసించకుండా వాళ్ళచేత మీరు హింసపడకుండా వుండే మార్గం చూపడానికే వ్రాశాను"—అన్నారు రచయిత. ఆ మాటల్లో ఏమీ అతిశయోక్తి లేదు.

బిడ్డల్ని శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతగా పెంచడానికి ఎటువంటి సమాజం కావాలో, అటువంటి సమాజాన్నే ఈ రచయిత ఆశిస్తున్నారు.

"ముఖ్యంగా ప్రజలు, ఎంత ధీమంతులూ గమనించనిదీ, అన్ని విధాలా గమనించ వలసినదీ ఏమిటంటే — బిడ్డ లోకంలో సుఖపడడానికే పుట్టిందన్న సంగతి. మనుషుల్ని, ప్రతీ మనిషినీ, జీవినీ సుఖపెట్టే ప్రయత్నం బుద్ధి కలిగిన వాళ్ళందరూ చెయ్యాలి. లోకంలో ఈ పద్ధతుల మీద మార్పు చెందాలి, మార్పు చెందించాలి. మనిషినీ, బాధపెట్టే పరిస్థితి, సంస్థ, ధర్మం, ఎంత గొప్పదైనా నిర్మూలనం కావాలి."— "ప్రతీ మనిషినీ" సుఖపెట్టే విధంగా ఇప్పుడున్న పరిస్థితిని మార్పు చెందించాలి. అలా మార్పు చెందితే ఆ సమాజానికి ఏం పేరు వొస్తుందో ఆ పేరుతో పట్టింపు లేదు. అంత పుత్తమమైన సమాజం కావాలి." మనిషిని బాధపెట్టే పరిస్థితి .... ఎంత గొప్పదైనా నిర్మూలనం కావాలి." — అనడంలో అప్పటికి సమాజం ఎంత గొప్ప విషయాలుగా భావిస్తున్న వాటినైనా సరే నిర్మూలనం చెయ్యాలని అర్థం. దోపిడీ సమాజం "గొప్పగా" భావించే విషయాలు నిజంగా అందరికీ గొప్పవై వుండవు. కానీ గొప్పవిగా చలామణీ అవుతూ వుంటాయి. నిజంగా, అందరికీ సమానంగా గొప్పవైన విషయాలు మనిషికి బాధ ఎందుకు కలిగిస్తాయి? మనిషికి బాధ కలిగించే విషయాలు గొప్పవెలా అవుతాయి? అసలు వాటిని 'గొప్పవిగా' గుర్తించడమే పొరపాటు. కానీ వాటిని "గొప్ప" అనడంలో వాటికి సమాజం ఇచ్చే "గొప్ప"ని చెప్పడమే.

ఈ రచనలో అశాస్త్రీయంగా వున్న అంశాల్ని నిస్సందేహంగా తిరస్కరించాలి.

రచయిత కేవలం పొరపాటుగా వాడిన పదాల్ని సరిదిద్దుకోవాలి.

ఇంకా వివరంగా, స్పష్టంగాలేని మంచి విషయాల్ని ఇంకెంత వివరంగా అభివృద్ధి పరుచుకోవాలి.

నేటి సమాజానికీ, రేపటి సమాజానికీ కూడా బిడ్డల పెంపకంలో తల్లిదండ్రులూ, వుపాధ్యాయులూ, పెద్దలూ మొత్తం సమాజమే గైడెన్సుగా తీసుకోదగ్గ పుస్తకాలలో ఎంతో ముఖ్యమైంది — ఈ "బిడ్డల శిక్షణ".

"బిడ్డల శిక్షణ"ని స్వీట్ హోమ్ పబ్లికేషన్స్‌లో ప్రచురించిన సందర్భంలో రాసిన ముందుమాట

రంగనాయకమ్మ
30—10—1976

# మొదటి మాటలు

[ఇది మొదటి ముద్రణకు రాసిన ముందుమాట]

ఈ పుస్తకంలో వ్రాసిన యీ నూతన విధానంలో చాలా భాగము నేను కనిపెట్టింది కాదు. ఎన్నేళ్ళో శ్రమపడి, ఎందరెందరో మహాపురుషులు ఆచరణలో పెట్టి, అనుభవానికి తెచ్చుకున్నారు. నేను పూర్తిగా యీ పద్ధతుల్ని అనుష్టానములో పెట్టలేకపోయినాను. దానికి పరిస్థితులు చాలా వరకు కారణము. కాని ఈ పద్ధతులు వుత్త 'థియరీ' కావనీ, సంపూర్ణంగా ప్రత్యక్షరమూ ఆచరణలో పెట్టడానికి వీలువుందనీ యీ పద్ధతులవల్ల పిల్లలు పూర్వముకన్న చాలా బుద్ధిమంతులూ, ఆనందవంతులూ కాగలరనీ నా అనుభవంవల్ల తెలుసుకున్నాను.

దీనిలో వ్రాసిన పద్ధతులకు కారణాలు వ్రాయాలంటే చాలా శాస్త్రం వ్రాయవలసి వుంటుంది. చాలామందికి దాంట్లో అభిలాష వుండదని నేను ఆ ప్రయత్నం చెయ్యలేదు.

ఈ పుస్తకంలో చెప్పినవి సాధారణ (జెనరల్) పద్ధతులూ, మార్గంలో పెట్టడానికి సూచనలూ. ప్రత్యేకంగా ప్రతి శిశువుని బట్టీ, పరిస్థితులను పట్టీ *యెప్పటి కప్పుడు, యెవరికి వారు యోచించుకొని* మార్పులను చేసుకోవాలి.

మనుష్యస్వభావాన్ని అభివృద్ధి పరిచేందుకు బాల్యమొక్కటే తగిన వయస్సు. అప్పుడు గనుక బిడ్డను తగిన శిక్షణలో వుంచితే, ఆ బిడ్డ పెద్దదైనప్పుడు—యిప్పుడు ప్రజలకి వుండే మూఢత్వమూ, భయమూ, కలిగి వుండక—ఉన్నతురాలవుతుంది. ఆ నైసర్గిక స్వభావౌన్నత్యాన్ని బిడ్డలకు

యివ్వగలిగితే, యింక చట్టాలవల్లా, సంస్కారంవల్లా, బోధనవల్లా, కలిగించడానికి ప్రయత్నించే మార్పులు, యే శ్రమా లేకుండానే ప్రజలలో తటస్థిస్తాయి.

వారు స్వంతంగా జీవనభారం సమర్థించుకునే శక్తి కలిగించడాకా, పిల్లలకి తలిదండ్రులు చేసే సహాయం శిక్షణ. జంతువుల్లో, పక్షుల్లో కూడా శత్రువులనించి తప్పించుకోడమూ, యెగిరి ఆహారం సంపాయించుకోడమూ, మొదలైనవాటి విషయమై శిక్షణ కొంతవరకు వుంటుంది. పొట్ట పోసుకోడం మాత్రమే ఐతే, మనుష్యులు తమ పిల్లలకైనా యెక్కువ శ్రద్ధ తీసుకోనక్ఖర్లేదు. కాని రాను రాను లోకం చాలా విషయాల్లో 'కాంప్లెక్సు' అవుతోంది. చక్కగా, తెలివిగా, యెదిగి వృద్ధి పొందాలంటే, పిల్లలకి చాలా శ్రద్ధతో యిచ్చిన జ్ఞాన సంపన్నమైన శిక్షణ అవసరము. అందువల్లనే సృష్టీ, సంఘమూ, మనుషుల్లో పిల్లలను చాలాకాలం పెద్దవారిమీద ఆధారపడేట్టు యేర్పాటు చేశాయి. గుర్రపు పిల్ల తల్లిమీద ఆర్నెల్లు ఆధారపడితే మనుషుల్లో తల్లిమీద పిల్ల యిరవై యేళ్ళాధారపడుతోంది. లోకమింత విషమ సమస్యా భూయిష్టం కాక ముందు పిల్లలు చిన్న వయస్సులోనే స్వతంత్రులయ్యేవారు. పదహారేళ్ళకి రాజ్యాలేలేవారు. కాని యిప్పుడు లోకం మారినకొద్దీ వయసుకో ఆలస్యమైతేనే గాని సమర్థులు కావటంలేదు. చేతులకి బలంరాగానే వ్యవసాయానికై రైతుకొడుకు తయారవుతాడు. ప్లీడరుకొడుకు యిరవై యేళ్ళు చదివితేనేగాని ప్లీడరీ చెయ్యలేడు. ఇప్పటి పరిస్థితుల ప్రకారం పట్టణాల్లో ధనార్జనకూ, జీవయాత్రలో విజయానికీ, కుయుక్తులూ, వక్రవర్తనలూ అవసరం. పరిస్థితులకి సమాయానుకూలంగా మారనిప్రిన్సిపిల్సు పిల్లకు చిన్నప్పుడే నేర్పడంవల్ల జీవితంలో ఫెయిల్ అయిన కుర్రవాళ్ళు అనేకమంది ఉన్నారు. కనుక లోకపు అవసరాల్ని గుర్తెరిగి, దేనికోసం తమ కుర్రవాళ్ళని తయారు చెయ్యబోతున్నారో ముందే నిర్ణయించుకోవాలి.

ధనమూ మర్యాదా ఆర్జించి సుఖపడేందుకా, సద్గుణాలూ, ఆశయాలూ, పెట్టుకుని పోరాడేందుకా ? విరాగి కావడానికా, రసికుడు కావడానికా ? యీ విషమద్వంద్వాన్ని సమన్వయం చేసే మార్గముందా, అని ।

సరైన శిక్షణ యివ్వాలంటే, శిశువు పుట్టగానే శిక్షణ మొదలు పెట్టాలి. ఆలస్యంగా మొదలు పెట్టినకొద్దీ కష్టమౌతుంది. పుట్టిన నిమిషం నించి శిశువులో అభ్యాసాలేర్పడతాయి. సరైన అభ్యాసాలు యివ్వకపోతే దురభ్యాసాలు అలవాటవుతాయి. కాని అభ్యాసాలు లేకుండా మాత్రం బిడ్డ వుండదు. బిడ్డకు రెండున్నర సంవత్సరాల యీడు వొచ్చిందాకా జాగ్రత్తగా శిక్షణ యిచ్చారంటే యింక స్థిరంగా జీవితమంతా శాశ్వతంగా వుపయోగపడగల ప్రవర్తన యిచ్చారన్నమాటే, కాని, మొదటి మూడు సంవత్సరాలూ వృథాచేశారా యింక వారి పని చాలా కష్టమౌతుంది. అప్పటికీ కొంత ప్రయత్నం చెయ్యవొచ్చును కాని,యే శిక్షణ ఐనా ఆరేళ్ళలోపునేగాని పైన లాభంలేదు. మొదటి శిశువుకు శిక్షణ లేకుండా చేశారా, తరవాత శిశువుల శిక్షణ కష్టమవుతుంది. దీనికి చిన్న పిల్లలు పెద్ద పిల్లల్ని అనుకరించే గుణమే కారణము.

ఈ పద్ధతుల్ని ఆచరణలో పెట్టడం సులభంకాదు. ఈ పుస్తకం చదువుతో వుంటేనే అర్థమవుతుంది, తలిదండ్రులెంత శ్రమపడాలో । అంత శ్రమ పుచ్చుకునే వారు అరుదు. రోగం వచ్చింతరవాత మందు పుచ్చుకునేవారే కాని, రాకుండా జాగ్రత్త పుచ్చుకునేవారు కొద్ది. అట్లానే బిడ్డ అల్లరిదైన తరవాత, ఆ బిడ్డ అల్లరి వల్ల బాధపడి దండనవల్ల అణచడానికి ప్రయత్నించి, బిడ్డకీ తమకీ శ్రమ కలగజేసుకుంటారుగాని, ఎంత చెప్పినా ముందు అల్లరి స్వభావం బిడ్డకి కలగకుండా జాగ్రత్త పడరు.

ఈ విధంగా శిక్షణ పొందని పిల్లవాడు తలిదండ్రులకు కలిగించే శ్రమకంటే, యీ శిక్షణకోసం పెద్దవారు పడవలసిన శ్రమ చాలా

తక్కువ. అదిగాక ఆ శ్రమవల్ల పెద్దవారికి బాధ. పిల్లలు శ్రమ పెడితే, పెద్దవాళ్ళు యిచ్చే శిక్షలవల్ల పిల్లలకి బాధ. మొదటనే ప్రయత్నించి కొంతకాలం యీ పద్ధతిని ఆచరణలో పెడితే, తరవాత ఆ శ్రమలన్నీ వుండవు.

"పిల్లలకు శిక్షణ యివ్వాలి. వాళ్ళ పురోభివృద్ధి బాధ్యత మనది. దానికోసం ముందు మనం శిక్షణని నేర్చుకోవాలి"— అని తెలుసుకోవాలి పెద్దవారు. తమకి యెట్లాతోస్తే అట్లా చెయ్యడం యిప్పుడు జరుగుతోన్న పని. పిల్లని కనడం చాతకావడం చాత పెంచడంకూడా చాతనయిందనే ప్రజల వుద్దేశ్యం. లాయరు కావడానికీ, డాక్టరు కావడానికీ కష్టపడి చదువుతారు, నేర్చుకుంటారు. కాని శిశువు నిర్మలాంతఃకరణంమీద అధికారం చలాయించడానికి అందరూ పెద్దలే. దిక్కుమాలిన ఒక పిల్ల తమ అధికారం కింద దొరికింది కదా అని, దానిమీద ఆజ్ఞలు పెట్టి, తన్ని, సకల బాధలూ పెట్టే తల్లిదండ్రులనేకు లన్నారు. తమ కోపాలూ, ద్వేషాలూ, లోభాలూ, పిల్లమీద చూపుతారు అనేకులు.

రెండోది బిడ్డల చేష్టల్ని నిదానించి, పరీక్షించి వారికే విధమైన శిక్షణ మంచిదో, యెప్పటికప్పుడు నిర్ణయించుకుంటూ వుండాలి.

మూడోది, బిడ్డపైని ప్రేమ కలిగివుండాలి. ప్రేమ ప్రయత్నిస్తే వొచ్చేదికాదు. కాని, మొత్తానికి, మనకన్న, మన సౌఖ్యాలకన్న, బిడ్డనీ, బిడ్డ అభివృద్ధినీ యెక్కువ ముఖ్యంగా చూసుకోవాలి. సాధారణంగా తలిదండ్రులకి బిడ్డలమీద ప్రేమకన్న, సెంటిమెంట్లు, యెక్కువ. క్రమమైన శిక్షణకు సెంటిమెంట్లు ముఖ్య విరోధి. "వీరు మన పిల్లలే, వీళ్ళకిది చెయ్యాలి, అది చెయ్యాలి, మనం యీ మాత్రం చెయ్యకపోతే, లోకమేమంటుంది ?"అనుకుంటారు.'తల్లి విధి యిదికదా', 'తండ్రి విధి యిదికదా' అని పనులు చేస్తారు. ఆలోచనా, హేతువాదమూ, వివేకమూ, అన్నిటినీ 'సెంటిమెంట్లు' మింగి గుడ్డిగా పనులు చేయిస్తుంది. కనక, సెంటిమెంటును

చంపుకుని, నిజమైన ప్రేమను చాతనైతే అభివృద్ధి చేసుకోవాలి.

కాని మంచి శిక్షణకు పుత్రప్రేమ మాత్రమే చాలదు. ఆ ప్రేమను క్రమమైన మార్గాల వుపయోగించి, బిడ్డ క్షేమానికై ప్రయత్నించేది జ్ఞానము. బిడ్డ యేడ్చినప్పుడల్లా పాలిమ్మంటుంది ప్రేమ. అది అనారోగ్యమంటుంది జ్ఞానము. ఈ జ్ఞానానికి చోటులేకుండా చేసి, తరిమేస్తుంది సెంటిమెంటు. కాని వాస్తవమైన ప్రేమవుంటే, జ్ఞానానికి స్థలముంటుంది. ప్రేమలేకుండా వుత్త జ్ఞానమున్నా చాలదు. అప్పుడు యిల్లు "హాస్టలు" లాగుంటుంది. కాని ప్రేమకన్న జ్ఞానమే ముఖ్యం. రెండూ కలిసి వుండడం అంతకన్నా ముఖ్యం.

ఈ శిక్షణా విధానాన్ని ప్రవేశపెట్టాలంటే, పూర్వాచరణలో వున్న అనేక ఆచారాల్ని వొదులుకోవాలి. శిశువూ, దాని పురోవృద్ధీ మన ఆచారాలకన్న మన సెంటిమెంట్సుకన్నా అధికమని నమ్మి, ఏ ఆచారాలు ఆటంకాలని తోస్తాయో వాటిని వొదిలి తీరాలి. నవీన శాస్త్రజ్ఞానమే ప్రాముఖ్యంగా విశ్వసించకపోతే, యీ శిక్షణా విధానాన్ని అనుష్టించడంలో అర్థమేలేదు.



# తలిదండ్రులు

బిడ్డ కలగడం తల్లికీ, తండ్రికీ, ఆత్మాభివృద్ధికీ అవసరమని తోచినప్పుడే—బిడ్డని పోషించడానికీ, బిడ్డకీ తగిన శిక్షణ నివ్వడానికీ సరైన పరిస్థితులు వున్నప్పుడే—బిడ్డని సృజించుకోవాలి. గుడ్డిగా, అప్రయత్నంగా తమ వుద్దేశ్యమూ ఒళ్ళూ తెలీక, బిడ్డల్ని కని, తమనీ వాళ్ళనీ — యీశ్వరుణ్ణీ—కర్మనీ—తిట్టుకునే స్థితిలో పడడం, బిడ్డని చంపడంకన్న ఘోరమైన కార్యం. వరసగా అంగవికలుల్నీ, పిచ్చివారినీ, రోగిష్టుల్నీ, పుట్టగానే నరకబాధపడి చచ్చే పిల్లల్నీ కంటో, చూస్తే, ఇంకా అజ్ఞానంలో కీటకాలకన్న హీనంగా పిల్లల్ని పెడుతో, ఈశ్వరుణ్ణి నిందించే భక్తులూ, పతివ్రతలూ, పూజ్యమాతలూ, వేలకు వేలున్నారు.

చిన్నపిల్లలకు సరైన శిక్షణ యివ్వగలిగిన తలిదండ్రులు ఎప్పుడూ సంతోషంగా, దయగా, వోర్పుగా వుండాలి. అనారోగ్యవంతులు యీ గుణాల్ని కలిగివుండరు. కనక చిరకాలం జబ్బుగా వుండేవారు పిల్లల శిక్షణ బాధ్యత తీసుకోకూడదు.

పుట్టినది మొదలు బిడ్డని యింటికంతకూ ముఖ్యమైన దానివలె, అందరూ దాని సేవకూ, పురోభివృద్ధికీ జీవిస్తున్నట్టు భావించుకోవడం విధి. బిడ్డ పుట్టగానే తలిదండ్రుల జీవితానికి సాఫల్యం కలిగింది. వారి జీవితాలకు అర్థం, బిడ్డని అభివృద్ధిలోకి తీసుకురావడంలో లీనమైపోయింది. కనుక వారి శక్తి బిడ్డలకోసమే ముఖ్యంగా వినియోగపరచవలసిన ఆవశ్యకత కలుగుతుంది.

పిల్లలు అల్లరి చేసినప్పుడు, విసిగించినప్పుడు వారిని పెద్దవారు

శిక్షించేటప్పుడు, యెప్పుడూ దయా, ఆనందం కనపరచాలి. తీరుబడి చేసుకుని వారి సంగతి శ్రద్ధగా కనుక్కోవాలి. వాళ్ళ ఆటలూ, ఆలోచనలూ గమనించాలి. వాళ్లు పలకరించినప్పుడూ, ప్రశ్న లడిగినప్పుడూ, అల్లరి చేసినప్పుడూ శ్రద్ధగా వాళ్ళ అభిప్రాయాలు, కష్టాలు అన్నీ విచారించేందుకు తీరుబడి కలగ చేసుకోవాలి. కథలు చెప్పాలి. వాళ్ళతో ఆడుకోవాలి. అనేక విషయాలు తెలియచెయ్యాలి. అలవాట్లు నేర్పాలి, దిద్దాలి. వాళ్ళ విషయం అవసరమైనప్పుడు, అవతల పనియెంత తొందరైనా మానెయ్యాలి. ఏమన్నా కావాలని అడిగినా, ప్రశ్నలడిగినా, వెంటనే ప్రత్యుత్తర మియ్యాలి. కనక తీరుబడిలేని తలితండ్రులు, బిడ్డల్ని కనకూడదు.

బిడ్డకి శిక్షణ నియ్యడం ప్రారంభించక పూర్వమే తమ అహంభావాన్నీ, తమ అధికృతనీ, ఆత్మసుఖాన్నీ. అభిమానాన్నీ త్యజించడం మొదటి పని. బిడ్డకోసం అవసర మయిందా, తలితండ్రులు త్యజించలేని విషయం వుండకూడదు.

ఇంత కాలమూ బిడ్డలు తలితండ్రులకై త్యజించడం బోధించారు. అది అక్రమమనీ, బిడ్డలు పెద్దవారికై యేమీ త్యజించవక్కర లేదనీ, పెద్దవారే బిడ్డకై త్యాగం చెయ్యవలసినది విధి అనీ నేను యీనాడు బోధిస్తున్నాను. ఇంత తిండిపెట్టి, బొమ్మలు కొనియిచ్చి, బిడ్డలకెంతో సహాయం చేశామని కులికి సంతోషించేవారు పెద్దలు. అనవసరంగా హానిగలిగేటట్టు ముద్దుచూపి, తాము బిడ్డకై సమస్తమూ అర్పించామని లోకమంతా చాటేవారు కొందరు. సర్వమూ—బిడ్డకై అవసరమైనప్పుడు—కాలము, ఆనందము, ధనము, బలము—అన్నీ—యిచ్చివెయ్యడం పెద్దవారి విధి. బాల్యంలో బిడ్డను మాడ్చి యేడిపించి, ధనమంతా కూడబెట్టి, పెద్దవాడైనాక బిడ్డకి ఆస్తిరూపాన యిచ్చే యీ వేనవేలు మూర్ఖులకి "మీరు మూర్ఖులు. ఇంత చదువుకున్నా హృదయమూ, తెలివీలేని మొద్దు

లని" యెంత చెప్పినా అర్థంకాదు. ఎప్పటికో లోకం తమ అవివేకాన్ని గుర్తించదం ! ఇదంతా బిడ్డ క్షేమమేననే పేరులో తమ స్వార్థాన్ని సమర్థించుకునే కపటం అంతే. స్వార్థమంటే తమమీద తమకే అసహ్యం కలుగుతుంది గనక, ఆత్మగౌరవం నిలుపుకోవడం కోసం ఆ స్వార్థానికే పవిత్రమైన పేర్లుపెట్టి పేడకుప్పమీద పట్టుబట్టలు కప్పి తమనీ, లోకాన్నీ మోసపుచ్చుకుంటారు.

పిల్లలు తప్పుచేస్తే—పెద్దవారు తమకీ, తమ అధికారానికీ ధిక్కారం జరిగినట్లు చూచుకోకూడదు. తండ్రిననీ, గొప్పవాడిననీ, లోకమంతా తనని మర్యాద చేస్తున్నదనిన్నీ మరిచిపోవాలి. పిల్ల దూషించినా, కొట్టినా, తనను యితరులముందు అవమానం చేసినా కోపం తెచ్చుకోకూడదు. తనకి జరిగిన అవమానం సంగతి గాక, పిల్లకి తటస్థించిన ఆ చెడ్డ ప్రవర్తనను గురించి చింతపడి, పిల్లలకి స్నేహితులవలె ప్రవర్తించాలి. గొప్పగా భయంకరంగా, అధికారంగా వుండి హడలగొట్టకూడదు వాళ్ళని. "ఆర్డర్" చెయ్యడమూ, 'చూసుకో విన్నేం చేస్తానో !' అని వారిని గర్భశత్రువువలె చూడడమూ మంచిదికాదు. వాళ్ళు మంచిగా వుండేందుకై సహాయం చేసే మిత్రులులాగు వుండాలి. తమకేమీ తెలియకపోయినా, అన్నీ తెలిసినట్లూ, లోకానికి సర్వాధికారులైనట్లూ, యెన్నడూ తప్పు చెయ్యని ఈశ్వరులమల్లేనూ కనబడక — సహజంగా, దయగా వుండాలి. పిల్లల యెడల తాము తప్పు చేస్తే వారి క్షమాపణ అడగాలి.

పిల్లల్లో యే సద్గుణాలు కలుగజెయ్యాలనుకుంటారో, ఆ గుణాల్ని పెద్దవారు తాము అలవరుచుకుని అనుష్ఠించాలి) వారినుంచి యే చెడు గుణాల్ని మాన్పించాలని వుంటుందో, వాటిని తాము వర్జించాలి. వుత్త బోధనవల్లా, దెబ్బలవల్లా యేమీ లాభంలేదు.

పిల్లల గుణాలూ, అభిప్రాయాలూ, "టేస్టూ" అభివివేశాలూ యెటువంటివో తెలుసుకుని వాటి ప్రకారం వాటినే అభివృద్ధి చేసేందుకే

ప్రయత్నించి, వాటిననుసరించి పెద్దవారు నడవాలి. అంతేకాని—తమ అభిప్రాయాల ప్రకారం పిల్లల స్వభావాలూ, ఆశయాలూ యేర్పడాలని నిర్ణయించుకుని, వారి సహజశక్తుల్ని గుర్తించక, కళ్ళు మూసుకుని, వారిని వొంపుతియ్యడానికి ప్రయత్నించకూడదు. వారి మృదు సహజ స్వభావాలకి యెదురుగా, అడ్డంగా శిక్షణనిస్తే వారికున్న ఉత్తమ శక్తులు ధ్వంసమవుతాయి.

బిడ్డమీద, దానికోసమే దయగా వుండాలి. అది బుద్ధిమంతురాలైనంత కాలమూ, పెద్దవాళ్ళ ఆజ్ఞల్ని విన్నంత కాలమూ దానిపైన దయా ప్రేమా చూపి, అది తమ మాట వినకపోతే దానిపైన ద్వేషం చూపుతారు. పిల్ల పెద్దవారి ఆజ్ఞానుబద్ధురా లెందుకు కావాలి? తన పురోభివృద్ధికి. అంతేకాని, పెద్దవారిని సంతోషపెట్టి వారి అధికారపు చలాయింపులు పడేందుకు కాదు, కనక అది తిరగబడి చెడిపోతే విచారం కలగాలి. కాని కోపం రాకూడదు. అది దుర్మార్గురాలైనకొద్దీ, దానిమీద ప్రేమ ఎక్కువ కావాలి.

కొందరు పెద్దవారు, పిల్లల్ని తమ ఆటవొస్తువులకింద చూసుకుంటారు. వాళ్ళచేత తమాషాలు చేయించుకోడమూ, బడాయిపడడమూ లోకంముందు "ఎగ్జిబిట్" చెయ్యడమూ చేస్తారు. వాళ్ళతో తమాషా మాటలు మాట్లాడతారు. అబద్ధాలూ, బూతులూ పలికించుకుని, కొట్టించుకుని నవ్వుతారు. తప్పు.

కొందరు పిల్లలమీద నిష్కారణమైన దయ చూపుతారు. అది నిస్సహాయమైన కష్టంలో వున్నట్టూ, తాము దాన్ని కాపాడుతున్నట్టూ, అది పరిగెత్తకుండా కాళ్ళూ చేతులూ కదపకుండా, లోకాన్ని చూడకుండా కట్టేసి దానికి పనులన్నీ చేసిపెట్టి పాడుచేసుకుంటారు.

కొందరు తమ అభిప్రాయాల్ని, తమ కార్యాల్ని తమ తదనంతరం లోకంలో వ్యాపింపచెయ్యడానికి సాధనాలనుకుంటారు పిల్లల్ని. తాము

కోరి, తమ జీవితంలో దేన్ని సఫలం చేసుకోలేకపోయినారో, ఆ ఆశయాన్ని తమ కొడుకన్నా అతని జీవితంలో రియలైజ్ చేస్తే చూసి సంతోషించాలని ఆశపడతారు. కొందరు తామెటువంటివారో, అలాగే పిల్లలూ తయారు కావాలని ప్రయత్నం చేస్తారు. కొందరికి కొడుకులు ఉత్తర క్రియలు చేయడానికీ, వృద్ధాప్యంలో పోషించడానికీ కావాలి. అట్లానే తల్లులకి, కూతుళ్ళు తాము మానిన వ్రతాలు చేయడానికీ—సరదాలు తీర్చడానికీ.

కొందరికి పిల్లలంటే అసహ్యం. వారు పుట్టినందుకు కోపం, ముఖ్యంగా ఆడపిల్లలంటే అలాంటివారు పిల్లల్ని కనకూడదు. అఖ్ఖర్లేక పోతే పెంపకానికి యెవరికన్నా యివ్వాలి. అఖ్ఖర్లేని పిల్లల్ని కనడంకన్న భ్రూణహత్య నయం. పిల్లలు వారివారి స్వభావాల ప్రకారం, వారి యిష్టం వొచ్చిన స్థానం ఆక్రమించుకోవలసిన స్వతంత్రజీవులనీ, వాళ్ళని పెద్దవాళ్ళు తమ ఆశయాలకు ఉపయోగించుకో కూడదనీ తెలుసుకోవాలి.

ఈ శిక్షణావిధానం అమలులో పెట్టడానికి తండ్రు లెక్కువ సహాయపడలేరు. ఇప్పటి సంఘపద్ధతి ప్రకారం మొగవాడు బైట ఆర్జించే వాడు. కనక అతనికి వ్యవధి వుండదు. దాయీల నెప్పుడూకూడా పిల్లల్ని పెంచడానికి వుపయోగించకూడదు. బాగా మంచి విద్యావాసనగలిగి, పిల్లల శిక్షణలో తర్ఫీదై, తను పిల్లల్ని కలిగివుండి, దయా జ్ఞానమూ కల దాయీ ఎక్కడో గాని దొరకదు. అట్లాంటి వాళ్ళనైనా జాగ్రత్తగా తల్లులు పరీక్షించి కనిపెట్టే వుండాలి. ఎన్నడూ ఒక్క రోజుకూడా, తాము దగ్గిర లేకుండా పూర్తిగా పిల్లల్ని నౌకర్ల చేతుల్లో వొదలకూడదు. నౌకరికి పిల్లల పైన స్వతంత్ర మిచ్చారా—పిల్లలపాలిటి మృత్యుదేవత లైనారన్నమాట. ఈ నౌకర్లకన్న హాని చేసేవాళ్ళు — పిల్లల ప్రాణాలకి పెనుభూతాలు, ఇంట్లోవుండే ముసలి బంధువులు—తాతా, అత్తా, నాయనమ్మా, అమ్మమ్మా మొదలైన వాళ్ళు. ముఖ్యం ముసలి ఆడవాళ్ళు—వాళ్ళ గాలి సోకిందా,

వాళ్ళు యింట్లో యే మూలనన్నా వున్నారా ఇంక పిల్ల అభివృద్ధి నశించిందన్నమాటె. పాములనుంచీ, సింహాలనించీ, తప్పించినట్టె పిల్లల్ని యీ ముసలివారినించి తప్పించాలి. బిడ్డ పుట్టక పూర్వమే వీరినందరినీ, వారెంత మంచివారైనా సరే ఇంట్లోనించి తరిమెయ్యాలి. ఇంక బిడ్డ యెదుగుతున్నన్నాళ్ళూ వాళ్ళని యింట్లో కాలు పెట్టనియ్యకూడదు.

ఈ శిక్షణ నివ్వడానికి వుత్తమురాలు తల్లి. కాని యీ దేశము ఇప్పుడున్నస్థితిలో బిడ్డల గర్భశత్రువులూ, మృత్యుదేవతలూ, ఈ తల్లులు, వీళ్ళచేతుల్లో పిల్లల్ని వదలడంకన్నా, పుట్టగానే చంపడం మంచిది. ఏమీ తెలీని జడులు, తెలుసుకోడం యిష్టంలేని, అర్థంచేసుకోడం చేతకాని మొద్దులు ప్రస్తుతపు తల్లులు 'అనారోగ్యవంతుల్నీ, పశువుల్నీ, మూర్ఖుల్నీ తయారుచేసి తరతరాలనుంచి యీ ప్రజల్ని అధమ స్తితిలోనికి తోసిందీ, యింకా అనేకతరాలు యిట్లానే వుంచబొయ్యేదీ యీ తల్లులే. వీరు బాగుపడితేనే కాని ఈ మానవకోటికి గతిలేదు, మొదటి రెండుమూడేళ్లూ యీ తల్లుల చేతుల్లో గడిపిన తరువాత ఆ బిడ్డ యెంత గొప్పపాఠశాలల్లో చదివినా, ఎంత గురువులవద్ద శుశ్రూష పొందనా, ఎంత జ్ఞానాన్ని సంపాయించుకున్నా యేమీ లాభంలేదు. పురుషుడు తన కామంకోసం స్త్రీలను కుక్కలవలె కట్టేసుకున్నాడు. స్త్రీ తన పిల్లల్ని అధములుగా పెంచి కసితీర్చుకుంటోంది పురుషజాతిమీద.

ఏ విద్యావాసనా లేని పూర్వాచారపు స్త్రీలు యింకా నయం. వారికి ఇంకా 'ఇన్‌స్టింక్ట్సు' చావలేదు. బిడ్డమీద సహజమూ, ఆరోగ్యమూ ఐన ప్రేమా, బిడ్డ అవసరం గుర్తించే సమర్థతా, సహనమూ వుంటాయి.

ఈ స్త్రీల నభివృద్ధి చెయ్యడమూ—విద్యా, లోకజ్ఞానమూ, స్వేచ్ఛా యివ్వడమూ—కలలోని వార్త. పైకిబిగ్గరగా ఆ మాటలనకూడదు. మతమూ సాంప్రదాయమూ అడ్డమొస్తాయి. కనక ఈ తల్లులనించి పిల్లల్ని తప్పిం

వాలి యీ తల్లులు బాగా జ్ఞానాన్ని సంపాయించినా అందరూ పిల్లల్ని పెంచగలిగిన వోర్పునీ, వ్యవధినీ, ఆ పెంచే స్వభావాన్నీ కలిగివుండరు. కనక, అప్పుడూ, అట్లాంటివారు పిల్లల్ని తమంతట తాము పెంచరు. కొందరికి వ్యవధి వుండదు, ప్రేమ వుండదు. కొందరికి జ్ఞానముండదు. కొందరికి స్వభావముండదు. అటువంటివారు పిల్లల్ని కనకూడదు. కంటే, కొందరు తల్లుల్ని, ఆ విధమైన ఆసక్తి కలవారికి చక్కగా బాలశిక్షణ నేర్పే కాలేజీలలో తయారుచేసి వారిచేత "నర్సరీ" పాఠశాలల్ని పెట్టించి యీడాది నిండగానే పిల్లల్ని పగలంతా వాళ్ళకి పెంపకానికై ఇవ్వాలి శిక్షణకోసం.

తలితండ్రుల మీద భక్తీ, ప్రేమా పిల్లలకు కలిగేట్టు పెద్దవారు ప్రవర్తించ వలసిందేగాని వూరికే బలవంతంచేస్తే వొచ్చేవికావు అవి. చిన్నతనంలో తండ్రులమీద కొంచెం భక్తి వుంటుంది. తల్లి మీద మొదటి నుంచీవుండదు. ఆ తల్లిని ఇంట్లో తిడుతో, ఆమెచేత పెంటచాకిరీ చేయిస్తో అధమంగా చూచేవారే తల్లిని తిడుతో—ఆమెపిల్లని తాము ముద్దుచేస్తో—ఆ తల్లిమీద పిల్లని భక్తికలిగి వుండమని వుపన్యాసాలూ, పద్యాలూ చెపితే భక్తి కలుగుతుందా ? కుర్రవాళ్ళు ముందు తల్లుల్ని నీచంగా చూడడం నేర్చుకుంటారు. తరవాత తక్కిన స్త్రీలనీ, భార్యల్నీ అంత నీచంగానూ చూస్తారు. కొంచెం పెద్దవారు కాగానే తండ్రి గొప్పతనము అబద్ధమనీ, అధికారం బూటకమనీ తెలుసుకుని తండ్రిమీద భక్తిని మానుకుంటారు.

ఇది వరకంతా తనకి అంతరాత్మ వేరే లేకుండా, భర్త ఆజ్ఞే తన విధిగా భార్య యెట్లా లోబడిందో, ఆ విధంగానే పిల్లలు కూడా అంతరాత్మను వేరే లేకుండా, తండ్రి ఆజ్ఞనే పరమధర్మంగా వహించడం బోధించారు. తండ్రి ఆజ్ఞ అనే పేరుతో పిల్లలు సమస్త ఘోరకార్యాలూ, పాపాలూ, దోషాలూ, విప్లవాలూ చేసినందుకై పురాణాలు వారిని పొగిడి,

వారికి మహిమలూ, అవతారాలూ, పుణ్యలోకాలూ ప్రసాదించారు. తండ్రి ఆజ్ఞలనే మహానరకాన్నించి పిల్లల్ని తప్పించి, స్వబుద్ధిని ఉపయోగించే శక్తిని అభివృద్ధి చేస్తేగాని లోకం బాగుండదు. ఇప్పుడు జరిగేదేమి టంటే — చిన్న తనంలో తండ్రి ఆజ్ఞలమీది గౌరవంచేత స్వబుద్ధిని వికసింపచేసుకోక — ధర్మాచరణంలో, నీతి గ్రహణశక్తిలో తాతలెట్లా ఉన్నారో ఆ స్థితిలోనే వుంటున్నారు. కాని కొంచెం పెద్దవారు కాగానే, తమ స్వార్థంకోసం ప్రజలు—తండ్రులతో ధనం కోసమూ, ఆస్తికోసమూ తగూలాడి వారిని వినరాని తిట్లు తిడుతోనూ వున్నారు. కాని తండ్రుల్ని బూతులు తిట్టిన మహానుభావులే — తండ్రులకి విధేయులుగా వుండనక్కర్లే దని ఇట్లా బోధిస్తే — నేను విప్లవం బోధిస్తున్నానని నన్ను దూషిస్తారు. ఎందుకు ? తమ పిల్లలు తమని ఎదిరిస్తారని, ఇట్లాంటి తండ్రుల్ని ఎట్లానూ దూషిస్తారు పిల్లలు. నేనే వేరే బోధించాలా? వాళ్ళకి కళ్ళులేవూ?

ముఖ్యంగా తలిదండ్రులు కోరేది పిల్లల ప్రేమ. యీ ప్రేమని గురించి పురాణాలనిండా వుపన్యాసాలూ, కథలూ, బోధనలూ వున్నాయి. పిల్లలు ప్రేమ చూపటంలేదని ప్రతి కుటుంబంలోనూ యేడుపులూ వున్నాయి. పిల్లలకు ప్రేమ కలిగేటట్లు ప్రవర్తించడం పెద్దవారి విధి గాని, ప్రేమించడం పిల్లల విధికాదు. ఎందుకంటే ప్రేమ బలవంతం చేసుకుంటే వొచ్చేదికాదు. ప్రేమించగల వుదార స్వభావాన్ని మనం పిల్లలలో వృద్ధిచేయగలం. అంతే.

తామిచ్చే తిండికీ, గుడ్డకీ, జాగ్రత్తకీ, కష్టానికీ, చూపే ప్రేమకీ యెదురు జీతం—ప్రతిఫలం — పిల్లలనుంచి ప్రేమ అంటారు. కాని తలిదండ్రులు యివన్నీ తమకోసం చేస్తున్నారనే సంగతి తెలుసుకునే స్థితిలో పిల్లలు వుండరు. దయగల తల్లిదండ్రులు పిల్లలకి రోజూ తాము చేసే వుపకారాన్ని గురించి చెవుల్లో నూరిపోస్తున్నా, వారు ప్రయత్నించి ప్రేమను తెచ్చుకోరు. లేక వాళ్ళ మనసు అంత అభివృద్ధి చెందివుండదు.

తాము ప్రేమించకపోవడంవల్ల తలిదండ్రులకి కలిగేబాధని పిల్లలు గుర్తించలేరు. తాము చిన్నప్పుడు యెట్లా తలిదండ్రుల్ని ప్రేమించలేదో, వాళ్ళ కష్టాలు గుర్తించడం తమకెంత అసాధ్యమయిందో పెదవాళ్ళు జ్ఞాపకం తెచ్చుకుని, తమ పిల్లల మనసుకూడా అట్లాగేనని అర్థం చేసుకోవాలి.

అదిగాక చాలమంది తండ్రులు పిల్లల జాగ్రత్త తీసుకుంటారు. కాని వారిపైన ప్రేమ చూపరు. ప్రేమంటే రోజుకు పదిసార్లు ముద్దులాడడం కాదు. పిల్లలు కాంతినీ, ఆకాశాన్నీ యెట్లా అనుభవించి ఆనందిస్తారో, అట్లానే పెద్దవారి జాగ్రత్తనూ, దయనూ అనుభవిస్తారు. కొంచెం యెదిగి అర్థమయింతరువాత కృతజ్ఞత చూపుతారు, అంతే. పిల్లలు మాత్రం వాళ్ళతో ఆడుకుని, వాళ్ళ బాధలు తీర్చి, వాళ్ళతో పాటలుపాడి, కథలు చెప్పేవాళ్ళని ప్రేమిస్తారు. కనుక పిల్లల ప్రేమ పొందాలంటే తలిదండ్రులు వాళ్ళని సంతోషపెట్టే స్నేహితులుగా కావాలి. శిక్షణా, పిల్లల అభివృద్ధీ అని పేరుపెట్టి పిల్లల్ని కొట్టి, తిట్టి, నీతి వుపన్యాసాలిచ్చి, బాధిస్తోవుంటే యీ తల్లిదండ్రుల నెవరు ప్రేమిస్తారు ? లోపల యెంత ప్రేమవున్నా బైటికి వచ్చేవిమాత్రం దెబ్బలూ, తిట్లూ. యిష్టం వొచ్చినప్పుడు వూపిరాడని ముద్దులూ ఐతే పిల్లలనించీ ప్రేమ యెట్లావొస్తుంది?

ఇంటికి వొచ్చిన అత్తలమీద, మామలమీద, పినతండ్రులమీద చాలా ప్రేమ చూపుతారు పిల్లలు. యెందుకు ? వాళ్ళు కొత్త గనక. తలితండ్రులవలె వాళ్ళు కొట్టరు. కథలతో, పాటలతో, ఆటలతో పిల్లల్ని సంతోషపెడతారు; మిఠాయిలు కొనిస్తారు గనక. అన్నమూ బట్టలూ యిచ్చే తమపైనకంటే, వారిమీదే ప్రేమ చూపుతారే అని తలితండ్రులకు ఆశ్చర్యం బిడ్డల ప్రేమ సంపాయించాలంటే మార్గమిదే !

పెద్దవాళ్ళు యెంత దయగావున్నా, బిడ్డప్రేమ చూపకపోతే, అది వాళ లోపమనుకోకూడదు.

దాని హృదయం కఠినమూకాదు, అది దుర్మార్గురాలూకాదు. సాధారణంగా అది తల్లిదండ్రుల లోపమే. దాంచికాదు. బిడ్డదగ్గిర్నించీ ప్రేమ రాకపోతే, తలిదండ్రులు బాధపడతారు. కాని తాము తమ ధర్మం నెరవేర్చి దానితోనే సంతుష్టిపడడం నేర్చుకోవాలి. పిల్లనిమాత్రం కృతజ్ఞత లేదని నిందించకూడదు. నిర్బంధించకూడదు.

బాల్యంలో పెద్దవారియెడల ప్రేమచూపే పిల్లలు సహితం పదేళ్ళు దాటగానే తలిదండ్రులనించీ దూరమౌతారు. అది యేమీ దుర్గుణంగా తలచకూడదు. ఆ వయస్సుకది సహజమే.

పిల్లల దగ్గిర్నించీ పుత్రప్రేమ చాలదు — యీ తలిదండ్రులకి. ప్రేమకి సూచకంగా వారు చెప్పిన మాటల్లా పిల్లలు వినడం కావాలి. అదృష్టవశాత్తూ పెద్దవారి మాటలు యెదిరించి స్వబుద్ధితో ప్రవర్తించడం పిల్లల స్వభావంలోనే వుందిగాని, అందరు పిల్లలూ తలితండ్రుల ఆజ్ఞల్ని జవదాటకుండా నడుచుకుంటే అంత నరకంతో సమానమైన ప్రపంచం యింకోటి వుండదు. అభివృద్ధీ, మేధాశక్తీ అన్నీ నశించి చిన్నవాళ్ళందరూ బానిసలూ, అప్రయోజకులూ, ముసలి తొక్కులూగా తయారౌతారు. తలితండ్రులమాట వినడం సుగుణంగా పరిగణించడం పోయి, అదో దుర్గుణంగా చూసేట్టు మారాలి. లోకం బాగుపడాలంటే అదో సుగుణమని బోధించకూడదు. తమ ధర్మమేదో, న్యాయమేదో అది ఆచరించాలిగాని, తలితండ్రులేది చెపితే అది చెయ్యమనడం మూర్ఖం. పిల్లవాడికి స్వబుద్ధి అంకురించి మంచి చెడ్డ తెలియనంత వరకూ దారి చూపవలసిందే కాని, తరువాత అతని యిష్టానికతన్ని వదలాలి. తలితండ్రులమీద అతను ఆధారపడచూసినా వాళ్ళు వొప్పుకోకూడదు. స్వతంత్ర బుద్ధి పిల్లలకు చాలా విషయాల్లో ఏడో యేడుకి పూర్తి అవుతుంది.

ప్రేమవున్నా లేకపోయినా పెద్దవారియెడల పిల్లలకు మర్యాద

నేర్పాలి. మర్యాద ఒక అలవాటు. అలవాటు నేర్పడం పెద్దవారి విధి. అంతే.

బిడ్డకి తిండిపెట్టి, బట్టయిచ్చి కాపాడినందుకు పెద్దవారి మాటవిని, వారి అభిప్రాయాలనే కలిగి, వారికి సేవచెయ్యాలని పెద్దవారి అభిప్రాయం. చిన్నప్పుడు వింటే చాలదు, తాము కాపాడడం మాని, ఆ బిడ్డే పెద్దవాడై తమ్ముని కాపాడేటప్పుడు కూడా తమ మాట ప్రకారమే నడుచుకోవాలంటారు. తలితండ్రులమీద భక్తి యెన్నటికీ వదలకూడదనీ, వారే ఈ భూలోక దైవాలనీ విధించారు. ఈ భక్తి తలితండ్రుల దగ్గిర ఆగక అత్తలకూ, అన్నలకూ, తాతలకూ, సమస్తమైన పెద్దవారికి కూడా ప్రవర్తింపచేశారు. వయసులో పెద్దవాడైనంత మాత్రాన బిడ్డకు ఆజ్ఞలు పెట్టేవాడైనాడు. పెద్దలమాట యెందుకు బిడ్డ వినాలని అడిగితే, శాస్త్రాల్లోకి వెడుతుంది వాదన. అన్నా, వదినా, అత్తా ఎందుకు పూజ్యులంటే పెద్దవారు గనక. ఏనుగూ, మర్రిచెట్టుకూడా పెద్దతనాలవల్ల పూజ్యాలేనా?

ఇంక తలితండ్రుల సంగతి. ఇక్కడ కృతజ్ఞత అనే గొప్ప కారణం వొకటి చూపిస్తారు తనని కనమని బిడ్డ తలితండ్రులను బతిమాలలేదు. వారి కామం వారు ఆపుకోలేక — బిడ్డ పుడుతుందనే జ్ఞానమన్నా లేక, కని—"అమ్మా! నిన్ను కష్టపడి తొమ్మిదినెలలు మోసి బాధపడి కన్నానే! అందుకని కృతజ్ఞత కలిగి నా మాట వినవే. నీ యిష్టాన్ని చంపుకోవే"—అంటుంది తల్లి. తండ్రీ అంతే — ఆ రెండు నిమిషాల ప్రజ్ఞకీ. తొమ్మిదినెలలు మొయ్యక యెట్లా తప్పుతుంది? బిడ్డకోసం మోసిందా? "ఈ పాడు కడుపొకటి వచ్చిం"దని తిట్టుకుంటోనే వుంటుంది.

బిడ్డని కన్నతరవాత—పాలుపోస్తారు, తిండి పెడతారు, రోగాలొస్తే విసుకు రానంతవరకు సేవచేస్తారు, తిట్టుకుంటో. ఎవరికోసం చేస్తారు? బిడ్డని యీ లోకంలోకి రప్పించినవారు సేవ చెయ్యవద్దా?

తమ విధిని తాము నిర్వర్తించుకున్నందుకు కృతజ్ఞత యెందుకు? బిడ్డకు కృతజ్ఞత సహజంగా కలిగి తలితండ్రుల యెడల ప్రేమచూపితే సరే! కాని పెద్దవారు మాత్రం బిడ్డని కృతజ్ఞత చూపమనడం అన్యాయం, అనవసరం. చూపకపోతే తిట్టడం, యాదవడం మూర్ఖం.

తలితండ్రులమీది భక్తి ఏమాత్రమూ వుండకూడదు బిడ్డకు. నవజీవనానికి చిన్నమైన లోకానికి యికముందు తోడ్పడపోయే బిడ్డయెడల పెద్దవారు అతిభక్తిని చూపాలి. నూతన జ్ఞానాన్నీ, శక్తినీ సంపాయించి, బిడ్డ అభివృద్ధికి తోడ్పడేందుకు ప్రయత్నించాలి.

ఈ తలితండ్రులయెడల భక్తి అనేది పూర్వాచారంమీది భక్తికి మూలం. తలితండ్రులు పాతయుగంవారు. తాతలూ, నాయనమ్మలూ అంతకంటే. కనక వాటిని వెనక వొదిలి బిడ్డ ముందుకి చూడాలి. వాళ్ళ అభిప్రాయాలూ, అనుభవాలూ, అన్నీ పూర్వకాలానికి చెందినవి కనక ముఖ్యంగా వర్జించాలి. అట్లానే తక్కిన పెద్దవారన్నా. వారి అభిప్రాయాన్నీ, ఆజ్ఞల్నీ, అన్నిటినీ ధిక్కరించి, తన స్వంతయోచనలను బిడ్డ అభివృద్ధి చేసుకోవాలి. ఈ పెద్దలమీది భక్తివల్లనే పూర్వశాస్త్రాలన్నా, చీకిన తాటాకులన్నా, పసుపుగుడ్డలన్నా, గడ్డమున్న బైరాగి దొంగలన్నా, ప్రజలకి తెలివిలేని భక్తి కలుగుతోంది. చిన్నతననించి అన్ని పూర్వ వాసనలకీ తిరగబడడం బిడ్డకి నేర్పి, యెంత త్వరలో వీలైతే అంత త్వరలో తాము బిడ్డదోవకి అడ్డంగా నిలవక తప్పుకోవడం మంచిది.

ఇట్లా తలితండ్రులు తెలిసీ, తెలీకా మూర్ఖంగా పిల్లల్ని బాధలు పెట్టడం, గారాబాలు చెయ్యడం, లెఖ్ఖలేకండా వొదిలెయ్యడం — ఇక ముందు చెయ్యడానికి వీల్లేదు. బిడ్డల మనోశాస్త్రంలో ఉత్తీర్ణులూ, గొప్ప తల్లులూ, బిడ్డల పాఠశాలలో గొప్ప ఉపాధ్యాయినులూ కలిసి బిడ్డల్ని ఎట్లా పెంచాలో కొన్ని సామాన్య నిబంధనలను విధించాలి. వాటి ప్రకారం

నడుచుకునేట్టు ప్రతి కుటుంబాన్నీ బలవంతం చెయ్యాలి ప్రభుత్వం. ఆ విధంగా పెంచడానికి వీలులేని పరిస్థితులున్న కుటుంబాలనించి పిల్లల్ని ప్రభుత్వం తీసుకోవాలి. గర్భిణి కాగానే స్త్రీ అంతకుముందే బిడ్డని జాగ్రత్త తీసుకునే శాస్త్రంలో ఉత్తీర్ణులు కాకపోతే, వెంటనే ఆ విషయాలలో తర్ఫీదు కావాలి.

ఇదంతా నేను ఏదో దేశాలు అభ్యున్నతిపొందే ఉద్దేశ్యంతో కాదు రాస్తోంది. నాకు ముఖ్యమయింది బిడ్డ సుఖపడాలి. బిడ్డ కళ్ళనుంచి నీరు రాకూడదు.



# శరీరం

శిశువుకి అన్నిటికన్నా ముఖ్యం శరీరారోగ్యం. ఆస్తికన్న, ధనం కన్న, విద్యకన్న, నీతికన్న అన్నిటికన్న ముఖ్యంగా తలితండ్రులు బిడ్డ కియ్యవలసింది ఆరోగ్యం. దీనికోసం ముందు తాము ఆరోగ్యవంతులై వుండాలి. అనారోగ్యవంతులకి బిడ్డల్ని కనే అధికారం లేదు. లోకాన్ని అనారోగ్యవంతులైన సంతతితో నింపేకన్న దేంటోనన్నాపడి చస్తేనయం. అనారోగ్యవంతులు అధమం గర్భనివృత్తి మార్గాలనన్నా అనుసరించి తీరాలి. దైవం బిడ్డల్నిస్తున్నాడనీ, వాళ్ళకి రోగాల్ని యిస్తున్నాడనీ, కర్మవల్ల సంభవిస్తున్నాయనీ, మెట్ట వేదాంతాలు పలుకుతూంటో, తాముమాత్రం తమ రాత్రి కర్మల్ని కొనసాగిస్తో బద్ధకంగా, గుడ్డిగా, మూర్ఖంగా కీటకాలవలె పిల్లల్ని కంటారు. వాళ్ళు చస్తే యేడుస్తారు. అంతకన్నా సుఖంగా బతకమని జ్ఞానాన్ని బోధిస్తే సంఘ ప్రళయమూ, పాశ్చాత్యమూ, భౌతికమూ అని అరిచి మళ్ళీ తమ పనులు నిశ్చింతగా ప్రారంభిస్తారు. నోరు లేని బిడ్డల్ని రోగిష్టులుగా కని, దినదినమూ వారుపడే వేదనను చూసి కూడా మళ్ళీ అట్లాంటి పిల్లల్ని కనే మూర్ఖులు అనేకవేలు మనచుట్టూ.

అనారోగ్యంగా పుట్టిన బిడ్డకి ఆరోగ్యం తీసుకురావటం చాలా కష్టం. ఆరోగ్యంగా పుట్టిన బిడ్డనికూడా చాలా త్వరలో రోగిష్టినిగా చేసే మహామంత్రం వుపదేశం పొందారు యీ తల్లులు. ఎంత యీ తల్లులు ఆరోగ్యాన్ని నాశనంచేసినా, బిడ్డ ఆరోగ్యం తిరగబడి మళ్ళీ పాతుకుంటూనే వుంటుంది. ఐనా తమ గాఢ ప్రేమతో ఆరోగ్యాన్ని సమూలంగా నాశనం చేసి జయిస్తారు తలితండ్రులు.

చిన్నప్పుడు ఆరోగ్యం చెడితే యింక మళ్ళీ కుదుట బడదు. మొద టనే పూర్ణారోగ్యముంటే, తరవాత జీవితంలో యెంత అనారోగ్యాన్ని నిగ్రహిస్తుంది శరీరం. పెద్దవారు శిశు, ఆరోగ్యశాస్త్రాలు చదవాలి. వాటి ప్రకారం ఆచరించాలి. శిశు సంరక్షణ శాస్త్రవిద్యను, తల్లి పొందివుంటే గాని, శిశువును కనడానికీ, పెంచడానికీ హక్కులేదు.

శరీర విషయమైన పనులు యెంతవరకు శిశువు మనసుమీదా, స్వభావంమీదా, 'ఇన్‌ఫ్లూయన్స్' కలిగి యుంటాయో, అంతవరకే ఇక్కడ రాస్తాను. శిశువు ఆరోగ్యశాస్త్రాలు వేరే చదువుకోవాలి — తక్కిన విషయాలకోసమై,

శరీర విషయమైన ఆరోగ్యం చాలావరకు అలవాట్లమీద ఆధార పడి వుంటుంది. కనుక పుట్టినప్పటినించి, శ్రద్ధతో శిశువుకి మంచి అల వాట్లను స్థాపించాలి. ముఖ్యమైన అలవాట్ల విషయమై రాస్తాను.

# భోజనం:

పసి తనంలో బిడ్డ పుట్టిన దినంనించి కూడా సరిగా వేళకు పాలి వ్వాలి. ఎంత ఏడ్చినా వేళతప్పకూడదు. చాలాసార్లు యేడుపు. ఆకలివల్ల కాదు. ఆ యేడుపు వినలేక స్తనం నోట్లో వూపిరాడకుండా కుక్కి యేడుపు మానుపుతాయి. నిజమైన కారణానికై వెతికే వోపికలేదు. రాత్రులు శిశువు నోట్లో స్తనం వొదిలి పడుకోడం అసహ్యమూ, తల్లికీ శిశువుకీ అనారోగ్యకరమైన అభ్యాసమూ. ప్రత్యేకంగా అవసరం కలిగితే తప్ప సాధారణంగా రాత్రి పది దాటింతరువాత శిశువుకి యే ఆహారమూ యివ్వకూడదు. అవసరంలేదు. తల్లి పడుకోబోయ్యేముందు శిశువుని లేపి పాలు పడితే చాలు.

"అయ్యో! ఆకలేస్తోంది, ఏడుస్తోంది." - అనే పిచ్చి 'సెంటిమెంటు' మానెయ్యాలి.

తల్లి స్తనంలోంచి పాలు తాగడంవల్ల బిడ్డకి ఆకలి తీరడమేకాదు. గొప్ప ఆనందాన్ని కూడా ఇస్తుంది. తల్లికికూడా అంత ఆనందమూ కలుగుతుంది. కనుక తీరిగ్గా కూచుని పాలివ్వాలి. మాతా శిశువుల మధ్య జరిగే యజ్ఞంలాగు వుండాలి. తల్లి స్తనాలతో బిడ్డని కూలాసాగా ఆడుకోనివ్వాలి. ఆ పాలివ్వడం మీదనే దృష్టి నిలిపి ఆనందాన్ననుభవించాలి తల్లి. పోత పాలు పట్టేప్పుడుకూడా, ప్రేమ చూపాలి తల్లి.

తల్లిదగ్గర పాలు ఉన్నప్పుడు, తల్లిపాలే బిడ్డకు ఆరోగ్యమైన ఆహారం. తల్లిపాలమీద బిడ్డకి జన్మహక్కు వుంది. ఏ కారణం వల్లనూ ఆ హక్కు తొలగించడానికి తల్లికి అధికారం లేదు. తల్లిపాలు తాగని పిల్లలలో కొన్ని శాశ్వతమైన భావ లోపాలు ఏర్పడవొచ్చు.

స్తనంపాలు త్రాగడం బిడ్డ తొమ్మిదొ నెలలోనే తప్పించాలి. ఒకసారిగా కాక నెమ్మదిగా తప్పించాలి. పోతపాలు రుచిగా వుండాలి. బొమ్మలు, మిఠాయిలూ యిచ్చి మనసు మళ్ళించాలి. ప్రేమను అధికంగా చూపాలి. స్తనాలకి చేదు మందులు రాసి తప్పించడం చాలా హాని.

భోజనం చేసే యీడొచ్చినప్పుడు, అన్నం కలిపి తినిపించకూడదు. బిడ్డ ఆకలి ప్రకారం దానినే తిననియ్యాలి. భోజనాల మధ్య శిశువు యేమీ తినకూడదు. యెవరన్నా యేమన్నా యిచ్చినా, భోజన సమయాని కది దాచుకోవాలి. కంచం ముందు కూర్చుని తినక, తాత్సారం చేస్తో ఆడుకోనియ్యకూడదు.

పిల్ల అన్నం తినకపోతే ఆదుర్దా పడకూడదు. జబ్బువల్ల తినకపోతే, చికిత్స చెయ్యాలి. పెంకితనంవల్లనైతే మాట్లాడకుండా వూరుకోవాలి. బతిమాలకూడదు. ఆదుర్దా, జాలి చూపకూడదు. ఒకసారి వొద్దన్న తరవాత అడిగినా కూడా మళ్ళీ అన్నానికి కూచోనియకూడదు. మరీ పశ్చాత్తాప పడితే ఒకటి రెండుసార్లు వొప్పుకోవచ్చును.

# విరోచనం:

పిల్లలకి అముసం పట్టకూడదు. సృష్టే శ్రద్ధ తీసుకుంటుంది, విరోచనం చెయ్యడానికి. తల్లిపాలు తాగే బిడ్డకి ఏ జబ్బులూ రావు. ఆ విషయంలో మూడో నెలనుంచి కొంచెం టొమాటో, నారింజా, కమలా మొదలైన పళ్ళరసాలు పడితే విరోచన బద్ధకం పోతుంది. ఆరోగ్యమైన పిల్లలకు ఒకే సమయాన విరోచన మౌతుంది. సరిగా కాలానికి అలవాటు చెయ్యాలి. ఆ సమాయన బట్టలు మార్చడమో, పక్క మార్చడమో, కూర్చో పెట్టడమో ఒక మార్పు గుర్తుగా చెయ్యాలి.

కొంచెం పెద్దయిన తరువాత ఒకటోయేట నుండి పిల్లలు భోజనం దగ్గిర ఒక సమయమూ, స్థలమూ లేకుండా బైటకి వెడతారు. దానికి ఒక ప్రత్యేక స్థలము వుండాలి. ఒక కాలం వుండాలి.

కాని, కూడని స్థలాల్లో బైటకి వెడితే పిల్లని ఆదరకొట్టకూడదు. కొత్త చీరమీదగాని, విస్తరిలోగాని, ఖరీదుగల పరుపుమీదగాని ఎక్కడైనా సరే, నెమ్మదిగా వూరుకోవాలి. 'అరెరె!' అని కేకవేస్తో, అరుస్తో పిల్లని తోసేసి క్రింద పడవేసి, తిట్టి, కొట్టి కసి తీర్చుకునే మహామాతలు యీ పుణ్య దేశంనిండా కొల్లలుగా ఉన్నారు.

మలాన్ని అసహ్యంగా. సిగ్గుపడవలసిన పదార్థంగా, ఆ పనిని అసహ్యంగా, భయంగా చెయ్యకూడదు. అన్నిటివలెనే అదీ సహజంగా ఆరోగ్యంగా సంతోషంగా చేసేటట్టు నేర్పాలి. అది శరీరానికి సుఖమిచ్చే ఒక అనుభవం. భోజనమూ, దొడ్డీ, సంభోగమూ — ఈ పనుల్ని తొందరకో-చీదరలో ఏదో కూడని పనులలాగు వాటిల్లో సౌఖ్యాన్ని అనుభవించకుండా చెయ్యడం వల్లనే జనులకి ఇన్ని నరాల బాధలు.

దొడ్డికివెళ్ళే బిడ్డనిచూసి ఎవరూ, ఏ పరిస్థితులలోనూ విసుక్కోకూడదు. సిగ్గుపడకూడదు. తన లోపలినించీ ఆ పదార్థాన్ని రప్పించాననే గర్వమూ, సంతోషమూ వుంటాయి పిల్లకి. దాన్నెప్పుడూ అభ్యంతర

పరచకూడదు. దొడ్డినీ, మూత్రాన్నీ ఆపుకోవలసిన పరిస్థితిలో ఎప్పుడూ బిడ్డని ఉంచకూడదు.

కొందరు పిల్లలు పెద్దవారైనా ఇంకా రాత్రులు పక్కలో ఉచ్చ పోసుకుంటారు. దీనికి అనేక కారణాలున్నాయి. రాత్రులు భయం, తలి దండ్రుల అశ్రద్ధ-కొంత కారణం. కొందరు పిల్లలలో వారి శరీర తత్వాన్ని పట్టి అది అవసరం. కారణం కనపడితే దాన్ని తొలగించాలి. నిద్రముందు వుచ్చపోయించాలి. పిల్ల మేల్కొలిపినప్పుడు నిద్రలేవాలి పెద్దవారు. మానమని బిడ్డని ప్రోత్సహించి, ఎందుకు అట్లా జరుగుతోందో బిడ్డ చెప్పగలదేమో చూడాలి. ఈ విధాల మాన్పలేకపోతే వూరుకోవాలి. తిట్టకూడదు. వెక్కిరించకూడదు. శిక్షించకూడదు. బలవంతంగా మాన్ప డానికి ప్రయత్నించారా, బిడ్డకి శాశ్వతమైన హాని జరగవచ్చు.

## నిద్ర:

శిశువుని సరియైన కాలానికి పడుకోబెట్టాలి. వుయ్యాల ఉపయో గించకూడదు. జోల పాడకూడదు. వేరే పక్క వుండాలి పిల్లకి, పుట్టి నప్పటినుంచి. మూడో నెలనించీ వేరేగదిలో పడుకోపెట్టాలి. పరజాలన్నా అడ్డముండాలి. దీపం వుండగూడదు.

పడుకోడమూ, నిద్రా, ఒకటిగా అలవాటు యేర్పరచాలి. పక్కని చూడగానే శిశువుకి నిద్ర జ్ఞాపకం వచ్చేట్టు చెయ్యాలి. నిద్ర సమయంలో తప్ప ఆ పక్కమీద పడుకోనియ్యకూడదు.

పిల్ల నిద్రపోకపోతే యేమీ ఆదుర్దా చూపకూడదు. సరైన కాలానికి పక్కమీద శిశువును వొదిలి రావాలి___నిద్రపోనీ; పోకపోనీ.

## బట్టలు:

వీలైనంతవరకు బట్టలు వెయ్యడం మాని పిల్లల్ని మొండిమొలతో వొదిలేసి తిరగనియ్యాలి. చలిలోనూ, బైటికి వెళ్ళేప్పుడూ వెయ్యవొచ్చు. చలికికూడా క్రమంగా శరీరాన్ని అలవాటుచేసి వొదిలెయ్యాలి. బిడ్డ

చలేస్తోందన్నదాకా బట్టలు వెయ్యనక్కర్లేదు. కొంతవయసు వొచ్చేటప్పటికి పిల్లలు సిగ్గుపడి బట్టలు కావాలంటారు, వెయ్యొచ్చు. అప్పుడు గూడా ఎంత కొంచెంవేసే అంత మంచిది. సిగ్గుబిళ్ళలూ, గోచీలు తప్పు. ప్రత్యేకం ఆ అవయవాలు మాత్రం కప్పడం మంచిదికాదు. బట్టలు వేసుకున్నా, అవి సంఘ నిర్ణయ ప్రకారం వేసుకుంటున్నారేగాని, స్వభావసిద్ధమైన అవయవాలలో యేమీ తప్పువుండడంవల్ల కాదనీ—వాటిల్లో సిగ్గూ, పాపమూ లేవనీ — వాటిని దాచడం అవసరంలేదనీ — వాటిని దాచడమే దుష్టుల వుద్దేశ్యం కదనీ — పిల్లలకు చెప్పాలి. పరాయివాళ్ళ పిల్లల్ని 'మొండిమొలతో వున్నావేం ?' అని వెక్కిరించ నియ్యగూడదు. ఎవరు వెక్కిరించినా లక్ష్యం చెయ్యక పోవడం పిల్లలకి నేర్పాలి.

బట్టలు నీటుగానూ, ఉపయోగంగానూ ఉండేట్టు బుద్ధినుపయోగించి కుట్టాలి. ఫాషన్లూ, అందాలూ ముఖ్యంగా చూచుకోకూడదు. బట్టలు పిల్లలు తమంతట తామే వేసుకునేందుకే వీలుగా చూడాలి. వెనక గుండీలూ, హుక్కులూ మానాలి.

ఆడపిల్లలకీ, మొగవాళ్ళకీ ఒకే మోస్తరు బట్టలే వెయ్యాలి. జుట్టూ మొదలైనవీ ఒకేమోస్తరుగానే వుంచాలి. పిల్లలకు స్వతంత్ర బుద్ధి కలిగి తనకి తాను బట్టలవిధమూ, జుట్టు విధమూ నిర్ణయించుకోగానే, బిడ్డ యిష్ట ప్రకారమే వుంచుకోనియ్యాలి. పెద్దవారడ్డు పెట్టగూడదు. "గిరిజాలు వొద్దు నేను క్రాపు పెట్టుకుంటా"—నంటే సరేననాలి. ఆ బాధ్యతంతా బిడ్డదే. పెద్దవారు వహించగూడదు. క్రాపుకి డబ్బు కావాలంటే, వుంటే యియ్యవచ్చును. లేకపోతే — "మనం క్రాపుకి డబ్బు యిచ్చుకునేంత భాగ్యవంతులం కాదు. నీకు డబ్బు రాగానే క్రాపు చేయించుకో"—అనాలి. పట్టుచొక్కాలడిగినా అంతే. "నేను పెద్దజుట్టు పెంచుకుంటా" — నంటే "పెంచుకో. కాని ఆ జుట్టు దువ్వుకోడం, మొదలైన పనంతా నువ్వే చూచుకోవాలి" — అనాలి. అది అందవికారమైన బట్టలూ, వేషాలూ వేస్తో వుంటే దానికి అందమైన మార్గాలు చూపించాలి. కాని బలవంతం చెయ్యగూడదు. యెక్కడికన్నా వెళ్ళేప్పుడు— "అట్లాంటిది మర్యాదకాదు. కనక

నిన్ను నాతో తీసుకు వెళ్ళడానికి వీలులేదు"—అనవొచ్చు. కాని కారణం నిజమైనది ఐవుండాలి. పిల్లని ఏడిపించి పెద్దవారి వూహలకు లోబరచు కోడానికి ఆ మాట అనకూడదు.

పిల్లలకి యిష్టంలేనిది బలవంతంగా బట్టలు వెయ్యడం, నగలు పెట్టడం చాలా ఘోరం. ముఖ్యంగా—తమ కులాసా కోసం, తమ గొప్ప కోసం, పిల్లలకి బలవంతంగా అలంకారాలు చెయ్యరాదు. గొప్ప ఖరీదు గలవి వేసినా — "జాగ్రత్తగా వాడుకో" అని చెప్పవొచ్చు. కాని అతని ఆటకు అవి భంగం కాకూడదు. ఆటలాడి చింపితే శిక్షించకూడదు. అసలు నగలు పెట్టనే గూడదు. బలవంతంగా ముక్కులూ, చెవులూ కుట్టి బిడ్డని బాధపెట్టడం హింస అని తెలియని మూర్ఖులు వేసవేలు.

నగలూ, బట్టలూ వేసి పిల్లవాడికి తన అందంలో, తన బట్టల గొప్పతనంలో గర్వం కలగచెయ్యకూడదు. అట్లా చేస్తే బట్టలవల్ల గొప్ప తనం నిర్ణయించడం అలవాటు అవుతుంది. ఇంకొకరికన్న తాను బట్టల వల్ల అధికుడ ననుకోనీయకూడదు. అతని అందాన్ని పొగడకూడదు.

"టేస్టు" నేర్పాలిగాని, అందంలో అహంభావం తెప్పించగూడదు.

## శుభ్రం:

పుట్టినప్పటినించి కూడా సరైన వేళకి స్నానమూ, వొంటిని శుభ్రంగా వుంచడమూ శ్రద్ధవహించాలి.

బిడ్డ కొంచెం పెద్దదికాగానే పళ్ళు తోముకోవడంఅలవాటుచెయ్యాలి. ప్రతిరోజూ పెద్దవారితో ఆటగా పళ్ళు తోమిస్తే అదే అలవాటైపోతుంది.

తనే స్నానం చెయ్యడం త్వరలో పిల్లలకి నేర్పాలి. యే విధంగా నీళ్ళు పోసుకోవాలో నిర్ణయించుకోడం ఆమెకి స్వతంత్రముండాలి. యిష్టం లేంది తలంటుపోసి యేడిపించగూడదు. బిడ్డ అపరిశుభ్రమవుతుందని బిడ్డ ఆటల్ని అభ్యంతర పెట్టగూడదు. స్వేచ్ఛగా బురదలో, నీళ్ళలో, మన్నులో యిసకలో ఆడనివ్వాలి. జుట్టూ, బట్టలూ, అన్నీ పాడైనాసరే, యెన్నిసార్లు

యినాసరే విసుక్కోక, కోప్పడక పిల్లల్ని శుభ్రం చెయ్యాలి. వాళ్ళనే శుభ్రం చేసుకోమనాలి.

ఈ అలవాట్లన్నీ బిడ్డకి తెలియకుండానే యుక్తవయసులోనే మొదలు పెట్టి స్థిరపరిస్తే, తరవాత పోవాలన్నా పోవు. కాని యీ అలవాట్లు స్థిర పరిచేప్పుడు బిడ్డకి కష్టమే మాత్రమూ కలగనీయకూడదు.

మురికి ఐనప్పుడల్లా తనే శుభ్రపరచుకోవడమూ, వొంటిమీద అపరిశుభ్రం సహించక పోవడమూ, తన శరీరంమీదా, దాని నిర్మలత్వం మీదా గౌరవమూ—బిడ్డకి నేర్పాలి. వూరికే సూచిస్తే చాలు — బిడ్డ తెలుసు కుంటుంది. నోట్లోనూ, ముక్కులోనూ వేళ్ళు పెట్టినప్పుడు కడుక్కోడమూ, ముక్కు కారుతోవుంటే తుడుచుకోడమూ, మొదట్లోనే అలవాటు చెయ్యాలి. యీ విధమైన అలవాట్లవల్ల బిడ్డ శరీరారోగ్యానికే గాక, నైతి కారోగ్యానికి చాలా సహాయం కలుగుతుంది.

## వ్యాయామం:

మొదటినెల దాటగానే పిల్లని మంచాల్లోనూ, తొటల్లోనూ వుంచడం మాని చాపేసి కింద స్వేచ్ఛగా వుంచాలి. మన్నూ, హానికరమైన వస్తు వులూదూరంచెయ్యాలి. యెత్తుకోగూడదు. యెత్తయినవాటిమీద పడుకో పెట్ట కూడదు. రాత్రులైనాసరే, బిడ్డకి ప్రత్యేకం యెత్తు తక్కువ మంచం వేయడం విధి.

రోజూ పొద్దునా, సాయంత్రమూ-మొదటి నెలనుంచీ—బిడ్డని వూరి బైటకి షికారు తీసుకువెళ్ళడంవల్ల చాలా ఉపయోగం కలుగుతుంది. బిడ్డ స్వేచ్ఛగా పాకడానికీ, నడవడానికీ, యిల్లంతా తిరగడానికీ యేమాత్రం అభ్యంతరం వుండకూడదు. పైగా వుత్సాహంగా ఆడుకుని అల్లరిచేసేట్టు మాటలతోనూ, బొమ్మలతోనూ ప్రోత్సహించాలి పెద్దవారు. నిర్జీవంగా, బద్ధకంగా, బిడ్డ వుండనేకూడదు. నిచ్చనలూ, కర్రలూ, కొయ్యగుర్రాలు మొదలైనవి శరీరవ్యాయామానికి తోడ్పడతాయి. ఇంకొ పెద్దయిన తర వాత, బిడ్డకి తక్కిన బిడ్డని జతచేసి—రోజంతా — ఆటలతో, పాటలతో, గంతులతో, అరుపులతో, గోలతో—సంతోషంగా కాలం గడపనివ్వాలి.

# ఏడుపు

బిడ్డకి మాటలు రాకముందు యేడిస్తే యేడుపుకి కారణం తెలుసుకోవాలి. కారణం లేకుండా యేడుస్తోవుంటే అలిసి వూరుకున్నదాకా ఏడవనియ్యాలి ఎత్తుకో కూడదు. బిడ్డవేపు చూడగూడదు. మాట్లాడగూడదు. బిడ్డకి ఏదన్నా అవసరముంటే ఆ సహాయం చేసి వూరుకోవాలి.

పిల్లల్ని యెన్నడూ యెత్తుకోకూడదు. వాళ్ళల్లో కూచోపెట్టుకోకూడదు. బిడ్డనే చూస్తో, దానికేం కావాలో అని ఆదుర్దాపడుతో, దానికి పాటలు పాడుతో కనిపెట్టుకొని కూచోగూడదు. జబ్బుగా వున్నాసరే బిడ్డ స్వేచ్ఛగా, స్వతంత్రంగా, ఒంటరిగా ఆడుకోవాలి. నిద్రపోవాలి. బిడ్డతో పెద్దవాళ్ళు మాట్లాడ్డానికీ, ఆడుకోటానికీ, ప్రత్యేక వేళ వుంచుకోవాలి–పెద్దవారికి తీరుబడి అయ్యేవేళ.

తలిదండ్రులకి యింక తనే గొప్ప అనీ, యింక తను లేకపోతే వాళ్ళు బతకరనీ, తను బాధపడితే వాళ్ళూ బాధపడతారనీ, తను వాళ్ళని యేడిపించగలననీ, ఆడించగలననీ, బిడ్డకు అభిప్రాయ మేర్పడకుండా జాగ్రత్తపడాలి. పిల్లలకొరకై బాధ్యతా, కష్టమూపడాలి. కాని అట్లా అదుర్దా పడుతున్నామనే సంగతీ. వాళ్ళ సుఖం తమకి చాలా ప్రాముఖ్యమనీ పిల్లలకు తెలియనీయకూడదు. పిల్లల్ని మోసపుచ్చాలనికాదు, ఆదుర్దావున్నా కనపరచవొద్దని అభిప్రాయం.

బిడ్డ ఏడిస్తే ఆ యేడుపుతో పెద్దవాళ్ళకేమీ జోక్యం లేనట్లుండాలి. యేడుస్తో యేదన్నా అడిగితే– "అది యిచ్చే వద్దేకాని నువ్వు ఏడుస్తో అడిగావుకాదూ, అందుకని వీల్లేదు" – అనాలి. బిడ్డ యేదన్నా కోరితే

వీలైనంతవరకు కోరిక నెరవేర్చాలి. కాని వీల్లేక నిరాకరించిన తరవాత యెంత యేడ్చినా, మొత్తుకున్నా, గొంతుచించుకున్నా, నిరాకరణాన్ని మానకూడదు.

ఏడుపు విషయమై పెద్ద సెన్టిమెన్టువుంది మనుషులకి. వూరికే అడిగితే, ముందు ఇవ్వరు. ఏడుస్తో అడిగితే, ఇంకా మారాంపడితే, అప్పుడు ఇస్తారు. కొడతారు, తిడతారు, చివరికి యిస్తారు. దానితో బిడ్డ నేర్చుకుంటుంది—యేడిస్తే తప్ప తనకి కోర్కెలు సాగవని. మొదలు ఏడ్చినప్పుడే పట్టుగా కోర్కె నిరాకరించి స్థిరంగా వుంటే, ఏడుపువల్ల లాభంలేదని తెలిసేట్టు చేస్తే, బిడ్డకి ఆ అలవాటు పోతుంది.

ఏడుపుని భరించలేరు మనుషులు. దేనికై బిడ్డ ఏడుస్తోందో అది తీర్చలేకపోతే ఊరుకోమనడమో, తిట్టడమో, కొట్టడమో, యేదో చెయ్యకండా వూరికే వుండలేరు.

పసితనంలో బిడ్డ ఏడుపుకి కారణం వుంటుంది. ఆ కారణం తెలుసుకునే తెలివివుంటే తెలుసుకుని, ఆ బాధని నివృత్తిచెయ్యాలి. లేకపోతే వూరుకోవాలి. అంతేగాని అరవకూడదు. తిట్టకూడదు. ఎత్తుకోకూడదు. ఎత్తుడు మరిగి చాలాసార్లు ఏడుస్తారు. ఏడిపించి, ఏడిపించి ఎన్నడూ యెత్తుకోక ఆ ఏడుపు అలవాటు మాన్పాలి. కడుపునొప్పితో అజీర్ణంతో పొట్ట వుబ్బి ఏడుస్తూవుంటే దయగల తల్లులు పాలుపడతారు. ఆ తీపికి పాపం బిడ్డ వూరుకుంటుంది. అప్పటికి ఆ తల్లులకి తెలివిలేదు. సంఘం తెలివి నివ్వదు. తండ్రులకి పట్టదు. ఇల్లాంటి క్రూరహత్య స్వంత పిల్లలకి జరుగుతోనే వుంటుంది. ప్రతిదినమూ ఈ తండ్రిగారు మాత్రం పంజాబు హత్యలకీ, బెంగాలు వరదలకీ ధనం పోగుచేస్తూనో, శిశు ఆరోగ్యవారం మీటింగుల చేస్తూనో వుంటాడు. ఆ భార్యకిమాత్రం తెలివి తెప్పించలేడు. తన అధికారం చెలాయించలేడు. ఆ భార్యని అంత మూర్ఖంగా వుంచకపోతే లేచిపోతుందని భయం.

ఇంక కొంచెం పెద్దదయినాక పెద్దలు మనసులు కరిగించి తమ కార్యాలు గొనసాగించుకోవాలని పిల్లలు యేడుస్తారు. ఏడుపు మంత్రం పారినకొద్దీ ఇంకా ఏడుస్తారు. ఈ యేడుపే బాగా అలవాటై పెద్దవాళ్ళై, ఆడవాళ్ళు పెనిమిటి దగ్గిర ఏడుస్తారు. మగవాళ్ళుకూడా లోకంలో తమకి కావలిసిందంతా దొరకనప్పుడు అందరితోనూ మాటలతో చెప్పుకుని ఏడుస్తో లోకానికంతా దానికి బాధ్యత కలిగినట్టు అందర్నీ తిడతారు. తమతో సానుభూతిని చూపలేదని పోట్లాడేవాళ్ళూ, తగాదాలవాళ్ళూ, సణుగుళ్ళవాళ్ళూ, వీళ్ళందరూ చిన్నప్పుడు ఏడుపుకి అలవాటుపడ్డ బిడ్డలే. అంతా తమకే కావాలని, యెవరికీ పంచక దాచుకునే భాగ్యవంతులూ, తమకు లేదని యీర్ష్యతో ఏడ్చే బీదవాళ్ళూ, లేని జబ్బులతో బాధపడి వుత్త గోలలు పెట్టేవాళ్ళూ, అందరూ చిన్నప్పటి ఏడుపుగొట్లే.

ఇంట్లో ఏడుపనేది వినపడకుండా చెయ్యడం పెద్దవాళ్ళ ముఖ్యమైన విధి. ఏడుస్తోవుంటే మాట్లాడకండా వదలడమూ, బిడ్డ కొంచెం పెద్దది కాగానే ఇంట్లో యీడవనీక దొడ్లోకిపోయి ఎవరికీ వినపడకుండా ఏడ్చి రమ్మనడమూ, చెయ్యాలి. దెబ్బ తగిలినాసరే—అంతే. యేడవడం అసహ్యమైనపని అనిన్నీ—యింక తప్పనిసరి ఐనప్పుడు యితరులకి కన పడకుండా చెయ్యవలసిన పని అవన్నీ నేర్పాలి.

ఒక్కొక్కప్పుడు బిడ్డ రోషంతో పెద్ద ఏడుపు ప్రారంభించి హడా విడిచేస్తుంది—చాలా స్వల్పకారణాలకి. గోల పడకుండా, బిడ్డని స్వేచ్ఛగా ఏడ్చి చల్లారనియ్యాలి. ఏమీ మాట్లాడవద్దు. బిడ్డవంక చూడవొద్దు. కాని మీరు ఆ కోపాలు అంగీకరించినట్టు వుండవద్దు.

# అలవాట్లు

మనుష్య జీవితం అలవాట్ల సమూహం. దేహశుచీ—అశుచీ, నీతి—అవినీతీ, సర్వమూ చాలవరకు అలవాట్లే. నీతిమంతులనే వాళ్ళందరూ అలవాట్లకు దాసులే. ప్రొద్దున్నే చన్నీళ్ళస్నానం అలవాటైతే, ఆ అలవాటు లేనివారికి ఆ స్నానం చెయ్యడం ఎంత కష్టమో, ఉన్నవారికి స్నానం మానడం అంత కష్టమే. బూతుమాట అలవాటైనవారికి మానడం యెంత కష్టమో, అలవాటు లేనివారికి ప్రయత్నించినా, అవి వుచ్చరించడం అంతకన్న యెక్కువ కష్టం. అబద్ధమూ, నిజమూ కూడా ఇట్లానే అలవాట్లు, ఎంత ప్రయత్నించినా మనిషిని చంపగలరా ? దయార్ద్ర హృదయులైనా — వాళ్ళకి అలవాటు గనుక సిపాయీలూ, రాజులూ యుద్ధంలో శత్రువుల్ని చంపుతారు. కనక అలవాట్లమీద జీవితమంతా దాని గొప్పతనమూ, అల్పమూ ఆధారపడివుంది. చిన్నప్పుడయ్యే అలవాట్లింక యెన్నటికీ పోవు, మంచికీ చెడ్డకీ కూడా.

(పూర్వ జన్మనించి గుణాల్ని మనంతెచ్చుకుంటున్నామనే వేదాంతం నిజమైనా, కాకపోయినా, పిల్లల శిక్షణ విషయమై దాన్ని మరిచిపోవాలి.)

శ్రమపడి బిడ్డలకు మంచిగుణాలే అలవాటుచేసి, దుర్గుణాల్ని నివారించి, నేర్చుకునే దుర్గుణాల్ని పోగొట్టగల శక్తి తమలో వుందని పెద్దవారు నమ్మాలి. పుట్టేప్పుడే పూర్వ జన్మ కర్మప్రకారం ఏవో గుణాలతో పుడతారు. వాటిని మార్చడం ఈశ్వరుడితరంకాదనే కర్మవేదాంతం వాదించినా దాని ప్రకారం నడుచుకునే మూర్ఖుల్ని చూడబోము. అట్లానే నమ్మితే, యీ

పుస్తకం చదవనూ అఖ్ఖర్లేదు. బిడ్డల్ని బాగుచేస్తామనుకుని వారిని కొట్టే ప్పుడూ, తిట్టేప్పుడూ ఆ వేదాంతాన్ని మర్చిపోతోనే వున్నారు. కర్మ సిద్ధాంతాలలోనైనా మనిషికి జరిగే కష్టసుఖాలు శాసింపబడతాయన్నారుగాని, ఆతని గుణాలు నిర్ణయింపబడతాయనలేదు. సుఖ దుఃఖాలు పూర్వజన్మ కర్మప్రకారం కలిగినా, వాటిని అనుభవించే పద్ధతి—వాటివల్ల పాఠాల్ని నేర్చుకొని బాగుపడడమూ, వాటివల్ల నాశనము కావడమూ—మనిషి గుణాల మీదా, స్వభావంమీదా ఆధారపడి వుంటుంది. అలవాట్లద్వారా ఆ గుణాల్ని పెద్దవాళ్ళు చాలవరకు బిడ్డలో ఏర్పరచగలరు.

అదిగాక మనిషిబుద్ధి యెప్పుడూ చెడువేపే లాగుతుందనీ—యెంతో ప్రయత్నంమీదగానీ, యెన్నో దెబ్బలవల్లగానీ, బిడ్డల్ని మంచితోవకి తీసుకు రాలేమనీ, మనుష్యులు పాపంలో పుట్టారనీ, సంసారం పాపభూయిష్టమనీ, కోర్కెలు తుచ్ఛమనీ, బిడ్డ యెప్పుడూ దుర్మార్గానికే ప్రయత్నిస్తుందనీ బోధించే తుచ్ఛశాస్త్రాలను తగలవెయ్యాలి. మనుషుల స్వభావం గుర్తెర గని మూర్ఖులూ, తమ యింద్రియాన్ని నిగ్రహించుకోలేని రోగిష్టులూ, దుర్మార్గులూ రాసిన తప్పుడు రాతలవి. బిడ్డల స్వభావమెప్పుడూ సన్మార్గానికే ప్రయత్నిస్తుంది. దుర్మార్గమని తెలీక బిడ్డ పొరబాటు పడు తుంది. ఆ పొరపాటు ప్రేమితో దిద్దడం పెద్దవారి విధి. అలవాట్ల వల్లనే చెడు మార్గాలేర్పడతాయి. ఆ చెడు అలవాట్లేర్పడకుండా, పెద్దవారు సహాయం చెయ్యగలరు. చెయ్యడం వారి విధి.

బిడ్డకి మంచి అలవాట్లను కలగచేస్తే వాళ్ళకి చెడ్డపనులు చెయ్యడం కష్టమౌతుంది. చెడ్డఅలవాట్లను బిడ్డలకు రానిచ్చినా, వాళ్ళని వుపేక్ష చేసినా మంచిపనులు వారికి కష్టమౌతాయి. పిల్లల్ని పెంచడం చాతగాక, అల వాట్లని దిద్దడానికీ, అలవరచడానికీ బద్ధకపడి, ఏదో పూర్వజన్మ ప్రకారం

కాలక్రమంగా జరుగుతుందని నల్లమందు వేదాంతాన్ని నమ్మి కొత్త జ్ఞాన మంటే వులికిపడుతో లోకమట్లా పడివుంది.

బిడ్డని కవీశ్వరురాలో, శూరురాలో, ఆరోగ్యవంతురాలో, నీతి వంతురాలో చేసేశక్తి పెద్దవారిలో కొంతవరకన్నా వుంది. ఆ శక్తి వున్నా లేకపోయినా బిడ్డమాత్రం దుర్మార్గురాలూ, అవివేకీ, నిష్ప్రయో జకురాలూ ఐతే ఆ తప్పిదం చాలా వరకు తలితండ్రులది.

తప్పుడు దోవలకీడ్చే యింద్రియాల్ని మనోబలంచేత, శమ దమాలచేత కట్టేసి మంచిమార్గానికీడ్వాలనే వేదాంతం శుద్ధ అబద్ధం. రుషులు చెప్పనీ, వారి తాతలు చెప్పనీ ఇంకా అలవాట్లు యేర్పడని విషయాలలో యింద్రియాలు బుద్ధిని యీడుస్తాయి. అలవాటు యేర్పడ్డ విషయాలలో యీడవ్వు. పొద్దున్నే సిగరెట్ కాలవమని ఆ అలవాటున్న వాణ్ణి యింద్రియాలు యీడుస్తాయి. అందర్నీ యీడుస్తాయా ? అట్లానే పొద్దున్నే టెన్నిస్ ఆడడం అలవాటున్న వాణ్ణి ఆడమని యీడుస్తాయి. లేవగానే పళ్ళు తోముకోడానికి శమదమాలు వుపయోగించాలా ? కనపడ్డ మనుషుల ముక్కులు కొయ్యకుండా మనం ఏం నిగ్రహముపయో గించాలి ? ఆ అలవాటున్న వాళ్ళు వుపయోగించాలి ఆ నిగ్రహం. ప్రతి పనికీ, గుణానికీ యింద్రియాలిట్లా యీడుస్తోవుంటే యింక మనుషు లెవరికీ వేరేపని వుండదు. తమ యింద్రియ వాంఛలతో నిగ్రహాన్నీ, శమదమాల్నీ వుపయోగించి పోట్లాడంతప్ప, ప్రతి నిమిషమూ — చూసిన మిఠాయి తినాలనీ—అందర్నీ తన్నాలనీ-దొంగిలించాలనీ—స్త్రీల నెత్తుకు పోవాలనీ—తోస్తోవుంటే బతకడమెట్లా ? మంచితోవల మంచిపనులు చేసే అలవాట్లు లేనివాళ్ళని యీడుస్తాయి యింద్రియాలు. రాత్రి పదిగంటలకి నిద్ర అలవాటున్నవాడు పడుకుంటాడు. ఆ అలవాటు లేనివాడూ, ఆ అల వాటుని చెరుపుకున్నవాడూ నిద్రరాక యేంపని చెయ్యాలా అని ఆలో చిస్తాడు. చదువుకునే అలవాటున్నవాడు చదువుకుని ఆరోగ్యం చెడకొట్టు

కుంటాడు. తాగేవాడు తాగి, ఆ అలవాటు వృద్ధిచేసుకుని పాడౌతాడు. కనక మంచిపనులకంటే చెడ్డపనులు చెయ్యటం సులభమని బోధించే వేదాంతం శుద్ధ అబద్ధం. మానవ స్వభావం, ముఖ్యంగా చిన్నపిల్లల స్వభావం యెప్పుడూ సన్మార్గమువేపే ప్రయత్నిస్తూ వుంటుంది. కాని పరిస్థితులవల్ల కలిగిన చెడు అలవాట్లనించి తప్పించుకోలేక తంటాలు పడుతో వుంటుంది. చెడు అలవాట్లు కలవాడికి చెడ్డపనులు చెయ్యడం అంతే కష్టం.

అలవాట్లు లేనివాడు, యీ ప్రలోభనాలతో పోట్లాడి, తనకున్న శక్తిని వృధా చేసుకుని అలిసిపోతాడు. మంచి అలవాట్లున్నవాడికి పాడు కోర్కెలూ, ఆ విషయాలూ కలగనే కలగవు. యుద్ధమే అనవసరం.

పెద్దవారు నేర్పినా నేర్పకపోయినా పుట్టిన నిమిషాన్నించి పిల్లకి అలవాట్లేర్పడుతూనే వుంటాయి. మంచివాటిని ప్రవేశపెట్టకపోతే చెడ్డవి అలవాటవుతాయి.

ఒకటే పనిని చాలాసార్లు వరసగా చెయ్యడంవల్ల అలవాటు ఏర్పడుతుంది. కనక అవసరమైన అలవాట్లనేర్పరచడానికీ, ఆ పనుల్ని ఒకేస్థలంలో ఒకేకాలంలో, ఒకటేవేళకు, ఒకటేమో స్తరుగా బిడ్డచేత వరసగా చేయిస్తో వుండాలి. బిడ్డకు బుద్ధితెలియకముందే, శరీర విషయమైన అలవాట్లన్నీ ఏర్పడిపోవాలి. పళ్ళుతోముకోడం, స్నానం, బట్టలు, మాటలు, శుభ్రత, నిద్ర మొదలయినవన్నీ. బిడ్డకి బుద్ధితెలిసిం తరవాత వూరికే మాటలు చెప్పి ఊరుకుంటారు కొందరు. "ధైర్యంగా వుండు" — "నిజం చెప్పు"— అని పెద్దవారు ఊరుకుంటే, అలవాటు ఏర్పడదు. కనక లాభమేమీ లేదు. సరైన కాలానికి పెద్దవారు దగ్గిరవుండి—ఆ పని — పిల్లవాడు చేసేట్టు చూడాలి. తెలీకపోతే నేర్పాలి. పళ్ళుతోముకోడం, జుట్టు దువ్వుకోడం, భయపడకుండా వుండడం, మర్యాదగా మాట్లాడడం, సహనం—అన్నీ చేసి, చూపి, నేర్పాలి ఆ పని బాగా అలవాటైందాకా ఒకసారికూడా చేయించడం

మానకూడదు. అలవాటయిం తరవాత అప్పుడప్పుడు తమాషాకీ, అవస రాన్నిపట్టీ మాననియ్యవచ్చు. రాత్రి తొమ్మిదింటికి నిద్రపొయ్యే అలవా టేర్పడ సంతకాలమూ ఒక్కరోజూ తొమ్మిదింటికి పడుకోకుండా వుండ నియ్యకూడదు. అలవాటేర్పడ్డ తరవాత ఎప్పుడన్నా నాటకానికో, తమా షాకో, మేలుకోనియ్యవచ్చు. కాని యిట్లా చాలాసార్లు మేలుకోనిస్తే మళ్ళీ ఆ అలవాటే తప్పిపోతుంది. మంచి అలవాట్లు యేర్పరచడానికి పెద్దవాళ్ళు బిడ్డతోకలిసి శ్రమతీసుకోవాలి గాని, వుత్త ఆజ్ఞలవల్ల, నీతి బోధనలవల్ల, పురాణపఠనంవల్ల, చీవాట్లవల్ల, దెబ్బలవల్ల ఏమీ లాభం లేదు. బిడ్డకి నీతి వుపన్యాసాలిస్తే పురాణాలవలె తనూ శిష్కనీతి వచనా లను బోధించడం నేర్చుకొంటుంది; తన ప్రవర్తనమాత్రం దిద్దుకోదు. లోకం పుట్టినప్పటినుంచీ—యిప్పటివరకు, నీతులు వినడంవల్ల—పురాణాలు చదవడంవల్ల—ఒక్కరూ బాగుపడలేదు. లక్షలకొద్దీ దొంగలు తయారై నారు. చీవాట్లవల్ల, దెబ్బలవల్ల, బిడ్డ తన అలవాట్లను పెద్దవారి దగ్గిరనించి దాచుకుంటుంది. నిర్మూలం చేసుకోదు. ఈ లోకంలోవున్న భీరులు, పెద్ద వారి దెబ్బలవల్ల తయారైన పెద్దమనుష్యులే.

చెడు అలవాట్లు ఏర్పడ్డప్పుడు వాటిని ఒకటి తరవాత ఒకటి మెల్లిగా పోగొట్టాలి. తొందరపడకూడదు. అసలు జాగ్రత్తగా పెంచితే, చెడుగుణాలు అలవాటు కానేకావు. అయినప్పుడు ఊరికే—"యీ గుణం పోగొట్టుకో, ఆ గుణం పోగొట్టుకో"—అని ఆజ్ఞపెడితే లాభంలేదు. బిడ్డ బలహీనత్వాన్నీ — ఆ అలవాటు ఎందుకు యేర్పడ్డదో ఆ కారణాన్నీ— తెలుసుకుని, బిడ్డతోకలిసి, పెద్దవాళ్ళుకూడా ఆ చెడ్డ అలవాటు పోగొట్టడానికి ప్రయత్నించాలి. పోగొట్టే బాధ్యత పెద్దవారిది, బిడ్డదికాదు. సంతోషంగా, దయగా, తమాషాగా ఆటలాడుతున్నట్లు చెడ్డ అలవాట్లని తొలగించాలి. ఒక వారమో యెంతో గడువుపెట్టాలి, ఆ అలవాటు పొయ్యేందుకు. నోట్లో వేళ్ళు పెట్టుకోడం మాన్పించాలంటే — "ఇది అసహ్యం. మనం ఒక

వారంలో యీ పని మానెయ్యడం నేర్చుకోవాలి!"—అని బిడ్డతో అనాలి. వేలు పెట్టుకున్నప్పుడల్లా 'వేలు' అని జ్ఞాపకం చేస్తోవుండాలి. వారంలో పోకపోతే — "ఇంకాపోలేదు. నువ్వు మర్చిపోతున్నావు. జ్ఞాపకముంచుకునేందుకు వొక పద్ధతి కనిపెడదాం. యీసారి వేలు పెట్టుకున్నప్పుడు నేను 'వేలు' అంటాను. అప్పుడు నువ్వు గోడ నొకసారి తాకుతో వుండాలి"—అని బిడ్డతో చెప్పాలి. మూడోవారం వొక గుంజీ తియ్యాలి. అప్పుడప్పుడు ఆ గుంజీపని పెద్దవాళ్ళుకూడా చెయ్యాలి. ఎందుకంటే ఆ పనిని బిడ్డకు శిక్షలాగు కనపడనియ్యకూడదు. అప్పటికి పోకుండా వుండవు, చెడు అలవాట్లు, కావలిసే బిడ్డ చేస్తున్నట్టుంటే; అదొక జబ్బులాగు చూడాలి. తరవాత శిక్ష అవసరమౌతుంది. బిడ్డ కావలసి ఆ అలవాటును పట్టుకుని వేళ్ళాడుతోందన్నమాట.

మంచి అలవాటు కావాలంటే, ఆ పనులకి పర్యవసానంగా బిడ్డకి సుఖం కలిగించేట్టు వుండాలి — పళ్ళు తోముకోడానికి మంచి టూత్ పేస్టు; లేక పెద్దవాళ్ళు మెచ్చుకోడం; లేక పాలూ, పళ్ళూ; చెడ్డ అలవాట్లు పోగొట్టాలంటే బాధాకరమైన పర్యవసానాలు కల్పించాలి. అలవాటు ఏర్పడుతో వుండేనే, ప్రయత్నించి మంచి అలవాటును ఏర్పరుచుకుంటున్నామనే జ్ఞానమే సంతుష్టినిస్తుంది బిడ్డకి

అలవాటు పోగొట్టుకోడంలోనూ, కొత్త అలవాటు చేసుకోడంలోనూ బిడ్డలోంచి విరోధం బయలుదేరకూడదు. విరోధం బైలుదేరడం కన్న చెడు అలవాటు వుండడమే మంచిది. అలవాటు లే పోవడమే నయం. బిడ్డే ఉత్సాహం చూపాలి. బద్ధకం, అయిష్టం చూపిందా పెద్దవారు తమ ప్రయత్నమే మానుకోవాలి.

తలిదండ్రులు బిడ్డలపైన ప్రేమా, దయా కనపరుస్తోవుంటే బిడ్డ తప్పకుండా చెప్పినమాట వింటుంది. కాని సకాలంలో దురలవాటుని

గుర్తించి నిర్మూలం చెయ్యాలి. ఆలస్యంచేస్తే ముదురుతుంది. బిడ్డల చెడు అలవాట్లను పోగొట్టే ప్రయత్నం చేస్తో, పెద్దవాళ్ళు తమ చెడు అలవాట్లని అట్లానే వుంచుకుంటే—బిడ్డకి అది అన్యాయంగా కనబడుతుంది. కనక పెద్దవాళ్ళుకూడా తమ అలవాట్లని యిట్లానే పోగొట్టుకుంటో వుండాలి.

బిడ్డకి రెండున్నర సంవత్సరాలు వొచ్చినప్పుడు అలవాట్లతో వుండే సూత్రాలు వొక్కొక్కటే తెలియచేసి, ఆ సూత్రానికై ప్రయత్నించమనాలి. అన్నంముందు చేతులు కడుక్కోడం మొదలయిన అలవాట్లకు శుభ్రమనే సూత్రం చెప్పాలి. అట్లా చెప్పితే తక్కిన విషయాల్లో ఆ 'ప్రిన్సిపిల్' బిడ్డ వర్తింప చేసుకుంటుంది.

# శిక్ష

అల్లరికీ, తిరగబాటుకీ, కోపానికీ, చిరాకుకీ, అసంతుష్టికీ, వీలులేని పరిస్థితులలో పిల్లల్ని పెంచాలి. అందరూ దయగా, నవ్వుతో, ప్రేమతో వుంటే పిల్ల అల్లరిచెయ్యదు. అల్లరీ, పెంకితనమూ, ఏ కారణాలవల్ల కలుగుతాయో ఆలోచించి వాటిని తొలగించే ప్రయత్నం చేయవలసి వుంటుంది. బిడ్డ 'టెంపర్‌మెంట్' కనిపెడితేగాని శిక్షణ కష్టమవుతుంది. ఒక్కొక్కప్పుడు వొంట్లో కులాసాగలేక, బిడ్డ అల్లరిచేస్తుంది మాటల్లో ఆ సంగతి చెప్పలేకపోతుంది. అట్లాంటివి పెద్దవారు కనిపెట్టాలి.

బిడ్డతో మాట్లాడేటప్పుడు, తాము గొప్పవారైనట్టూ, అది క్షుద్రురాలైనట్టూ చూడకూడదు. ఆ బిడ్డ తమతో సమానంగా పెద్దదైనట్టే పెద్దవారితో ఎట్లా మాట్లాడతారో అట్లానే బిడ్డతోకూడా గౌరవంగా, స్నేహితులతో మాట్లాడినట్టే మాట్లాడ్డం అలవాటు చేసుకోవాలి. బిడ్డ మన స్వాధీనంలో వుందికదా అనే అభిప్రాయంతో ప్రవర్తించకూడదు. బిడ్డ చెప్పింది శ్రద్ధగా వినాలి—దాని 'ఫీలింగ్స్' ఎట్లావుంటాయో అని ఆలోచించాలి. దాని అభిప్రాయాలకూ, ఇష్టానిష్టాలకూ తగిన విలువనివ్వాలి. అది తెలియపరచలేని భావాలూ, కష్టాలూ కనిపెట్టాలి. దయా, సానుభూతీ కలిగి వుండాలి. బిడ్డ అల్లరిచేస్తే దాన్ని యెట్లానన్నా అణచి నిర్మూలం చెయ్యాలని, విరోధివలె తీకొని— "నీశక్తి ఎక్కువో, నా శక్తి ఎక్కువో చూదు నిన్ను మాన్పించలేనా? నే నెంతవాణ్ణో నీకేం తెల్సు!" — అనేట్లు ప్రవ

_త్రించకూడదు. ఏమీ చేతకానివాడు కూడా అందరిచేతా తిట్లు తినేవాడు కూడా తన భార్యమీదా, బిడ్డలమీదా; అధికారాలుచేసి, యిష్టం చెలాయించి, బలవంతాలుచేసి దెబ్బలు కొడతాడు. బిడ్డ ఎందుకు అల్లరిచేస్తుందో, దాని ఇబ్బంది ఏమో అర్థంచేసుకోవాలి. అది కావలసి అల్లరిచెయ్యదనీ, అది సదుద్దేశంతో చేసిన పని. పెద్దవారి తెలివితక్కువవల్లా, పరిస్థితులవల్లా—అల్లరిగా మారుతోందనీ—దాని అల్లరికీ పెద్దవారే బాధ్యులనీ — విశ్వసించి అల్లరి చేసినప్పుడల్లా పెద్దవారు తమ శిక్షణా విధానాన్నీ, తమ వివేకాన్నీ సహనాన్నీ, పరీక్షించుకుని లోపాల్ని కనిపెట్టడం మంచిది. కాని బిడ్డలలో లోపాలకోసం వెతకడం పొరబాటు. ఈ సమస్యలు వొచ్చినప్పుడు తమ మాట మీరిందే అనే అహంభావం మాని, వోపికపట్టి, శ్రద్ధవహిస్తే తర వాత చాలా యిబ్బందులు తప్పిపోతాయి.

అన్నిటికన్నా ముఖ్యవిషయం. పెద్దవారు బిడ్డని ఆజ్ఞలు పెట్టి చేయిస్తున్నట్టూ, బలవంతం చేస్తూన్నట్టూ వుండగూడదు. బిడ్డ తనంతట తన యిష్టప్రకారమే తనని తనే అదుపులో పెట్టుకునేటట్టు ప్రోత్సహించాలి. అందులోనే వుంది తెలివంతా—నేర్పరితనమంతా—బిడ్డ శిక్షణ అంతా ఆట లాగుండాలి. చీట్లాటలో రంగుకీ రంగు వెయ్యాలి అనే నియామక ముంటుంది. తమంతట తామే వొప్పుకుంటారు; ఆ నియమానికి ఆడేవాళ్ళు. ఆ నియామకాలకి లోబడేందుకు యెవరన్నా బలవంతం చెయ్యాలా? ఆ నియామకాలు ఆడేవాళ్ళు ఏర్పరచుకున్నవే. అవి వుంటేకాని ఆట సంతోషమేలేదు. ఇంట్లో శిక్షణా అంతే. పెద్దవాళ్ళూ, చిన్నవాళ్ళూ కలిసి కొన్ని కొన్ని నియామకాలు ఏర్పరచుకుంటారు. చిన్నవాళ్ళు నియామకాలు మరిచిపోతారు, కనక పెద్దవాళ్ళు జ్ఞాపకం చేస్తారు, అంతే.

చాలమంది అనుకోడం ఏమిటంటే—పిల్లలబుద్ధి యెప్పుడూ అల్లరి వేపూ, దుర్మార్గానికీ యీడుస్తూ వుంటుందనీ — పెద్దవాళ్ళు దెబ్బలతోనూ, చివాట్లతోనూ వాళ్ళని సరైన మార్గాన వుంచాలనీ, కాని నిజం ఆలోచించి

చూస్తే పిల్లలకి అల్లరి చెయ్యాలని వుండదు. వాళ్ళకి మంచివాళ్ళుగానే వుండి సుఖపడాలనే వుంటుంది. దెబ్బలూ, చివాట్లూ వాళ్ళకి రుచించవు. పెద్దవాళ్ళని ఏడిపిస్తే వాళ్ళకేమీ సంతోషంలేదు. కాని వాళ్ళకి ప్రవర్తించవలసిన మార్గం తెలీక-యెట్లా తమశక్తుల్ని అభివృద్ధి పరుచుకోవాలో అర్థం గాక—పెద్దవాళ్ళ ఆజ్ఞలూ యిబ్బందులూ స్పష్టంకాక—తటపట పడతారు. అదిగాక పెద్దవాళ్ళలో విశ్వాసం పోయినప్పుడూ, పెద్దవారి ప్రేమమీద సందేహం కలిగినప్పుడూ—బిడ్డకి వాళ్ళని ఏడిపించాలని కోర్కె కలుగుతుంది.

అల్లరి పనులవల్ల కలిగిన ఆనందంకన్న వున్నతమైన ఆనందమిచ్చే కార్యాలున్నాయని చూపడం పెద్దవాళ్ళ విధి. పెద్దవాళ్ళ ఆజ్ఞలకన్నా, దెబ్బలభయంకన్నా, అయిష్టంకన్నా, బలంగల అమోఘాలైన మహాశక్తులు బిడ్డల్ని అనేక కార్యాలని పురిగొల్పుతో వుంటాయి. ఆ శక్తులు మంచివి; గొప్పవి; అవసరమైనవి. కాని సరైన మార్గాల వదవకపోతే బిడ్డకీ,ఇతరులకూ క్షోభ కలిగిస్తాయి. వాళ్ళ అల్లరికంతా అదే కారణం. పెద్దవాళ్ళు యెంత వాటిని నిర్మూలం చెయ్యాలని చూసినా అవి నిర్మూలం కావు. బిడ్డే నిర్మూలమౌతాడు మధ్య. ఆ శక్తుల్ని అర్థంచేసుకుని వాటిని క్రమమైన మార్గాల ప్రవహింపచెయ్యడం పెద్దవారి విధి. పిల్లల పనులు అల్లరి కాకుండా చేసుకోడం పెద్దవారి తెలివిలో వుంది. బైట బంతు లెగరేస్తే ఆట. ఇంట్లో యెగరేస్తే అల్లరి. అంతే భేదం. బిడ్డని యేం చేసినాసరే బంతులెగరెయ్యడం మానడు. బంతు లెగరయ్యని పిల్ల పనికిమాలినది. బంతు లెగరెయ్యకుండా అదిమితే బిడ్డ పనికిమాలిన దౌతుంది. కనుక బైటనే బంతు లెగరేసేట్టుగా బిడ్డల శిక్షణలో వుంచడమే వేర్పరితనం. ఒకపనే ఒక విధంగా చేస్తే మంచిది; ఇంకొక విధంగా చేస్తే అల్లరి అవుతుంది. బిడ్డ చేసేపని అల్లరిగా పరిగణించడానికి పెద్దవారి తెలివితక్కువ ముఖ్య కారణం.

క్రమమైన శిక్షణ. ముఖ్యం సరైన అలవాట్లు. మంచి అలవాట్లని చేశారా, ఇంక అల్లరి లేదన్నమాటే. ఇంకా అలవాట్లుగా యేర్పడని కొత్తవిషయాలు బిడ్డ యెరుగుతున్నకొద్దీ సంభవిస్తోవుంటాయి. ఆ కోర్కెలన్నిటినీ బిడ్డ అణుచుకోవాలని పూర్వాభిప్రాయం. తంతామనే భయం వల్ల బిడ్డల్ని సాధిస్తారు. కాని అది సరైన మార్గంకాదు. ఆ కోర్కెలు అక్రమమైనవైతే అవి అణుచుకోవడంవల్ల ప్రస్తుతం కష్టం కలిగినా, ముందు సుఖం కలుగుతుందని బిడ్డను నేర్చుకునేట్టు చెయ్యాలి. ఆ భవిష్యత్సుఖం కోసం ఈ వర్తమాన సౌఖ్యాన్ని బిడ్డ వొదులుకోవాలి. ఎవరన్నా తినడానికి పళ్ళిస్తారు. అప్పుడే అవి తినక భోజనందాకా దాచుకోడం అలవాటు చేసివుంటే దాచిపెట్టుకుంటుంది; అప్పుడే తింటామనే అల్లరి వుండదు. ఆ అలవాటు యేర్పడి ఉండకపోతే—"భోజనంలో కలిపితింటే యింకా బాగుంటుంది. అప్పుడు చాలా తినవొచ్చు. ఇప్పుడు తింటే అజీర్ణం" — అని తెలియచేసి ఆ కోర్కెని అణుచుకోడం నేర్పాలి. అలవాటు ఐన విషయంలో పెద్దవారి జోక్యమే అక్కర్లేదు, బిడ్డే సరిగా చేస్తుంది. కనక మంచి అలవాట్లని వృద్ధిచెయ్యడమూ, చెడు అలవాట్లని తప్పించడమూ ముఖ్యమైన పని.

పుట్టిన ఆర్నెల్లలోపున బిడ్డ అల్లరి యెరగదు. కనుక ఆ వయసు లోపల శిక్షణ వుండదు. అంతకన్న చిన్నవయసులో కూడా బిడ్డల్ని కొట్టే మాతృదేవతలు లేకపోలేదు. బిడ్డ కొంచెం గుర్తించడం తొమ్మిదో నెలనించి మొదలు. అప్పుడు చెడ్డపని చేసినప్పుడు పెద్దవారి ముఖంలో అయిష్టమూ, మంచిపనికి సంతోషమూ కనపరిస్తే చాలు.

సంవత్సరం నిండితేకాని తప్పుచేసిందని బిడ్డపైన పూర్తిగా కోపం చూపకూడదు. ఒకొక్కసారి కోపం చూపి వూరుకోవాలిగాని అదే పనిగా పీడించకూడదు.

ఎప్పుడూ ప్రేమగ, సంతోషంగా, స్నేహంగా, పిల్లయడల వుంటే—కొంచెం కష్టం, కోపం, విచారం విముఖత్వం చూపితే చాలు; అంతకన్న శిక్ష అక్కర్లేదు. సాధించడం, వినిపించడం, తృణీకరించడం, వెక్కిరించడం ఇవేమీ ఏ మాత్రమూ పనికిరావు. కోపం చూపేటప్పుడు కంఠం హెచ్చించకూడదు. సాధారణమప్పటి కన్న తగ్గించాలి.

శిక్షించే పరిస్థితులూ, శిక్షించే "ఎట్మాస్ఫియర్" వుండనీయకూడదు.

బిడ్డ తప్పుచేస్తే కోపం తెచ్చుకోకూడదు. పెద్దవారు ఆ పనిని తమ యడల అపరాధంగా చూసుకోకూడదు. తమ అధికృత మరిచి పోవాలి. బిడ్డ యేంచేసినా సరే కోపం తెచ్చుకోకుండా తమని తాము శిక్షణలో పెట్టుకోవాలి. కోపం పోతేగాని శిక్ష కూడదు. ఎప్పటిప్రేమ బిడ్డ మీద కలిగిం తరువాత విచారించాలి ఆ తప్పు. అల్లరి అవస్థలో బిడ్డ పడ్డదే అని జాలీ, ప్రేమా కలగాలి — జబ్బుగావున్న బిడ్డమీద కలిగినట్టే. బిడ్డకి అధైర్యమూ, భయమూ కలగచెయ్యకూడదు. స్నేహమూ, సాను భూతీ చూపాలి. దాని స్థితిలో తామున్నట్టుగా పెద్దవారు యోచించుకుని బిడ్డ యెందుకా అల్లరిచేసి వుంటుందో యోచించాలి. ఒకవేళ తన "ఇన్ స్టింక్ట్సు" వల్ల అట్లా చేసిందేమో! బిడ్డబైట తిరిగి వొచ్చినందుకు కొట్టే వాళ్ళున్నారు. సృష్టిలో తిరగాలని కొందరూ — స్నేహితులమీద ప్రేమ చేత కొందరూ — ఇంటివద్ద పరిస్థితులు బావుండక కొందరూ — తన ఆట శక్తుల్ని వుపయోగపరుచుకునేందుకు కొందరూ— బైటకి వెడతారు పిల్లలు. ఈ సంగతి అర్ధచేసుకోక వాళ్ళని దండించడం అన్యాయం. దెబ్బలన్నా తింటారుగాని వెళ్ళడం మానరు. ఆ యిన్స్టింక్టు అంత బలమైనది. పిల్లని తనకి లోబరుచుకుని ఆడిస్తుంది. ఆకలికొన్న కుక్క యెన్ని దెబ్బలన్నా తింటుందిగాని అన్నం వెతకడం మానుతుందా ? బిడ్డ అల్లరి తన 'యిన్ స్టింక్టు' ప్రకారం చేస్తే, దాన్ని యింకో అపాయంలేని మార్గాన తిప్ప డానికి ప్రయత్నం చెయ్యాలి. బిడ్డ బైటకెడితే యెందుకు శిక్ష బిడ్డకి ?

అపాయం కలుగుతుందని. కనక అపాయం కలగకుండా యెవరినన్నా వెంట పంపాలి. లేకపోతే ఇంటిదగ్గరే బిడ్డని ఆకర్షించేందుకు ఆటలు కల్పించాలి. 'బిడ్డ యిన్‌స్టింక్టు' కారణం కాకపోయిన విషయాల్లో పిల్లని నెమ్మదిగా పిలిచి, యెందుకు చేసిందో అడగాలి. అల్లరిపని చెయ్యగానే పిలవాలి. ఆలస్యం చేయకూడదు. 'ఇంకా అల్లరి యెక్కువై యీసారి చేస్తే చూద్దాంలే'—అని వూరుకోగూడదు. ప్రేమతో అడిగితే చెప్పుతుంది. చాలాసార్లు దానికే తెలీదు. అప్పుడు కొంచెం ప్రశ్నలు వేసి దాని మనసు దానికి తెలియచెయ్యాలి; అది చేసిన పని యెందుకు తప్పో ఆబిడ్డే చెప్పేట్టు చెయ్యాలి ; కాని వాదన పెట్టుకోకూడదు.

'యిన్‌స్టింక్టు' మంచి త్రోవల మళ్ళించే మార్గం ఆలోచించాలి. కత్తెరతో పంచలు కత్తిరించాడు. 'యెందుకు కత్తిరించావు?' అని అడిగితే అతనికే తెలియకపోవచ్చు. కత్తెర ఉపయోగించాలని చేతి దురద సహజం. కనక కాయితాలిచ్చి, పిచ్చి బట్టలనిచ్చి, పంచల్ని వొదిలి,వాటిని కత్తిరించమనాలి. బిడ్డ బియ్యం పారపోశాడు, యెందుకు ? చీమలకనో, ఆటకనో అంటాడు. "అట్లా పారపొయ్యకూడదు. పెద్దవారినడిగి కొంచెంగా తీసుకు వెళ్ళవచ్చు' — అనాలి. బియ్యం విలువ తెలియచెయ్యాలి.

పెద్దవాళ్ళు చెప్పినా, తను చేసినపని యెందుకు తప్పో తెలుసుకోకపోతే, పెద్దవాళ్ళ మాటవిని తప్పని వొప్పుకుని ఆ పని చెయ్యననాలి.

ఇంకో కొత్త అల్లరిచేస్తే మళ్ళీ యింతే. కాని చెయ్యనన్న పని మళ్ళీ చేసిందనుకో. మూడే కారణాలు :

1. మరిచిపోవడం.
2. చాతగాకా, నిశ్చయశక్తి లోపంచేతా.
3. నిర్లక్ష్యంవల్లా.

యే కారణమో అడిగి తెలుసుకోవాలి. కారణం పెద్దవారు బిడ్డకి సూచించకూడదు. మరిచిపోవడమైతే యీసారి మరిచిపోకుండా జ్ఞాపకముండడానికి ఏదో ఒక మాట 'మరిచిపోను' మొదలైనవి అనడమో,

రెండు నిమిషాలు పూరికే నుంచోడమో ఈసారి చేస్తాననిపించాలి. పాఠం మరిచిపోయినట్టే, ఆ బిడ్డ తనకి వుపయోగకరమైన పని మరిచిపోయినట్టే వుండాలి. మిఠాయి తినడం మరిచిపోయినట్టే, అంతా ఆటగా ఉండాలి. శిక్షగా కనపడకూడదు. జ్ఞాపకముండడానికి యేంచేస్తుందో బిడ్డచేతే చెప్పించాలి. బలవంతం లాగుండకూడదు. బిడ్డే తనకి తాను శిక్ష విధించుకోడం చాలా ఉత్తమమైన పద్ధతి.

తక్కిన రెండు కారణాలూ బిడ్డ తను అర్థం చేసుకుని చెప్పలేదు కనక పెద్దవారే అర్థంచేసుకోవాలి.

బలహీనత్వంచేత లోబడితే దానికి కారణమాలోచించాలి. చక్కెర తింది. యిదివరకు తిననంది. మళ్ళీ తింది. ఎందుకు? తినాలనిపించింది. దానికి శిక్షలేదు. భోజనంలో మిఠాయి పెట్టాలి. యింకా తినడం మానలేదు ఇంకా చక్కెర తినాలనే వుంది. అది ఆరోగ్యం కాదు కనక నిగ్రహించుకోవాలి. కనక చక్కెర తినేబుద్ధి పుట్టినప్పుడు పెద్దవాళ్ళ దగ్గిరికి వొచ్చి చెప్పాలి. పెద్దవాళ్ళు యింక వెగటు పుట్టేట్టు బాగా తినిపించడం ఒక మార్గం. కొంచెం కొంచెం తగ్గించి పెట్టడం రెండోది. నిగ్రహించుకోవాలని చెప్పి, నిగ్రహం క్రమక్రమంగా నేర్పాలి. "నీకు ఈ పని చెయ్యకండా వుండడం చాత కావడంలేదు. కనక నేను సహాయం చేస్తాను. మనిద్దరమూ కలిసి ఈ కోర్కెని నిగ్రహించే శక్తిని తెచ్చుకోవాలి"— అనాలి. నిగ్రహించుకోవలసిన కారణం చెప్పాలి. 'చక్కెర తినడం అనారోగ్యం. కనక మితం నేర్చుకోవాలి. లేకపోతే అంత చక్కెర కొనడానికి డబ్బు లేదు. కనక నిగ్రహం నేర్చుకోవాలని బోధించాలి.

నిర్లక్ష్యంవల్ల చేస్తే భయపెట్టాలి. కొంచెం కోపం చూపడం అన్నిట్లోకి గొప్ప శిక్ష. అంతకన్న ఏ మాత్రమూ భయపెట్టకూడదు. ఆ పని మళ్ళీ చేస్తే బిడ్డ తను నిర్ణయించుకున్న శిక్షని తాననుభవించాలి. ఒకకూర మానడమో, కొంచెం ఒక మూల నుంచుని ఆలోచించడమో మొదలైనవి.

బిడ్డ చెయ్యకూడని పని చేసినప్పుడు సహజంగానే శిక్ష కలిగేట్లయితే ఆ శిక్ష కలగనియ్యాలి. పెద్దవారికి ఆయాసమే వుండదు. ముందుమాత్రం 'వారన్' చెయ్యాలి. 'ఆ బండమీద కాలు జారవొచ్చు, వెళ్ళకు' అంటారు. వినక బిడ్డ వెడతానంటే ఆపనక్కర్లేదు. వెళ్ళనియ్యాలి. పడితే పడుతుంది. అదే శిక్ష. రోడ్డుమీదవాళ్ళ నెవరినన్నా బిడ్డ తిడుతుంది. ఇతరులను తిట్టడం మంచిపని కాదని చెప్పవొచ్చు. కాని ఆ మాట వినక తిడతానంటే — 'తిడితే వాళ్ళు కొట్టవచ్చు' — అనాలి. కాని అడ్డుపెట్ట నక్ఖర్లేదు. వాళ్ళొచ్చి ఒకవేళ పెద్దవాళ్ళతో చెపితే — 'ఆ బిడ్డ మా మాట వినలేదు. మీరే శిక్షించండి'—అనాలి.

క్రమంగా పెంచిన బిడ్డ అలిపిగాని అల్లరి యెన్నడూ చెయ్యదు. చాలా పెంకెతనమూ, దూకుడూ,, తిరగబాటు, చేస్తే గదిలోకిపోయి గ్రహం వొదిలింతరవాత రమ్మనాలి. వెళ్ళకపోతే పంపాలి. అసలు భక్తి గలిగి యేమాత్రం శిక్షణలో పిల్లవున్నా వెళ్ళననదు. వెళ్ళనన్నా, కోపం కన పరచకూడదు. 'నీకీ దుర్గుణం పోవాలి. తప్పదు. ఇదే చికిత్స మందు' అనాలి. బిడ్డకేదో జబ్బుచేసినట్లూ, పెద్దవాళ్ళు దానికి ప్రేమతో మంద లిస్తున్నట్లుండాలి. బిడ్డకేదో అల్లరీ, ఆపద కలిగినట్లూ — అది యింకా ఆ ఆపదలో పడకుండా పెద్దవాళ్ళు కాపాడడానికి ప్రయత్నం చేస్తు న్నట్లూ వుండాలి. ఇట్లా చెయ్యడంవల్ల తలితండ్రులపైన బిడ్డకి విరోధం కలగదు. కురుపులేస్తే, కోసి బాధ కలిగించినట్టే.

అందరితో అన్నం తినకపోవడం యింకో శిక్ష కాని ఈ పద్ధతిని చాలా సకృతుగా వాడాలి

"ఈసారి యిట్లా చేస్తే, నిన్ను ఈ ప్రకారం శిక్షిస్తా"నంటే అట్లాగే శిక్షించితీరాలి—బెదిరించేప్పుడే ఆలోచించి తగిన శిక్షతోనే బెదిరించాలి. మాట నిర్లక్ష్యంచేసి, ఆ తప్పే చేస్తే. ఆ శిక్షని విధించి తీరాలి—పీపు బద్దలకొడతానంటే బద్దలకొట్టి తీరాలి. 'ఆ శిక్ష భయంవల్ల బిడ్డ

ఆ అల్లరి పనివి మానేస్తుంది. పెద్ద శిక్షతో వూరికే బెదిరిస్తేనేం ? అలివికాని శిక్షలతో, అన్యాయమైన శిక్షలతో బెదిరించకూడదు.

బిడ్డచేసిన అల్లరికి 'ప్రపోర్షనేట్'గా వుండాలి శిక్ష. ఆ పిల్ల చేసిన పనుల పర్యవసానాలపైన ఆధారపడకూడదు. అగ్గిపుల్లతో ఆడడం తప్పే ఐతే, ముందే ఆ ఆటని ఆపాలి, కాని ఆదేప్పుడు బద్ధకించి ఊరుకుని తీరా ఏదన్నా తగలబడితే మాత్రం అప్పుడు శిక్షించకూడదు. పిల్ల కర్రతో ఆడుతున్నంతసేపూ వూరుకుని కర్ర తగిలి అద్దం పొరపాటున బద్దలైతే, కర్రతో ఆడినందుకు శిక్షించకూడదు.

గదిలోకి పంపడంకన్నా, కొంచెం అవమానించడంకన్న, ఎక్కువ శిక్ష యెప్పుడూ ఉపయోగించకూడదు. సరిగా మొదటినించీ శిక్షణలో వుంచితే యీ శిక్ష అవసరమే వుండదు. కాని యెంతచెప్పినా, అనాదిగా వొస్తున్న శిక్షలూ, తిట్లూ, దెబ్బలూ యిప్పుడు మానెయ్యమంటే పెద్దలు మానరు. దెబ్బలు చాలా సులభమైన పద్ధతులుగా కనపడతాయి. అదిగాక కొట్టకండా పెంచేపద్ధతి కొత్తది. భూతాల్నీ, భూకంపాల్నీ చూస్తే ఎంత భయమో కొత్త పద్ధతుల్ని చూస్తే అంత భయం ప్రజలకి. యేమో ! దెబ్బలు లేక పిల్ల చెడిపోతే ? యింతేగాక తిట్టే, కొట్టే, అలవాట్లో పడతారు పెద్దవాళ్ళు కోపం రాగానే పిల్లవాడి వీపుమీద చెయ్యి జాడిస్తేనే గాని వూరుకోలేరు. లేకపోతే చెయ్యి తిమ్మిరి వొదలడమెట్లా? బూతులు తిట్టాలి. లేకపోతే నాలికదురద యెట్లా వొదులుతుంది ? బిడ్డ ఆ పనుల్నే ఆ కారణాలవల్లనే చేస్తే ఎన్ని తన్నులు ! కోపం అణుచుకోవడం ఎంత శ్రమ ! యెందుకదంతా ? యిష్టం వొచ్చినన్ని తన్నులు తినేందుకు నోరులేని, దిక్కుమాలిన పిల్లలు చేతికింద వున్నారుగా ! అదిగాక దెబ్బలెంత సులభమైన పద్ధతి ! అల్లరిచేసినకొద్దీ బాదితే యెవరికోసం వూరుకుంటుంది పిల్ల. పైగా ఈ దెబ్బలు పిల్ల వుపయోగార్ధమేననీ సంతుష్టి ఈ తలిదండ్రులకీ చాలమందికి ప్రేమ వుండదు. వుత్త 'సెంటిమెంటు,'

వున్న ప్రేమంతా తమమీదేగాని, బిడ్డలమీద ప్రేమ వున్నదనడం శుద్ధ అబద్ధం. ప్రేమలేదని వాళ్ళకే తెలీదు. ప్రేమలేదని యెవరన్నా అంటే వాళ్ళు రాక్షసులలాగు కనపడతారు.

శాస్త్రాలతోనూ, పురాణాలతోనూ, కథలతోనూ, నీతులతోనూ, బోధించి పూజించిన తలిదండ్రులకు బిడ్డలమీద వుందనే ప్రేమకన్న అబద్ధం యింకోటిలేదు. నిజమైన ప్రేమ ఎప్పుడూ ఇతరుల సౌఖ్యానికై ప్రయత్నిస్తుంది. ఆ సౌఖ్యంకోసం ఏ త్యాగాన్నైనా చెయ్యడానికి వెను తియ్యదు. నిజమైన ప్రేమవుంటే. యిన్ని వందల సంవత్సరాలనుంచి బిడ్డల్ని కొడుతూనే వుంటారా ? బిడ్డల్ని కొట్టడంవల్ల తలి దండ్రులకి బాధ కలుగుతోందా ? కొట్టడం తప్పనిసరి అయిందికదా—అని దుఃఖపడు తున్నారా ? కొట్టకండా వీలులేదా ? అని వుపాయాలు వెతుకుతున్నారా?

బిడ్డని కొట్టడంవల్ల పెద్దవారికి ఆనందం కలుగుతుంది. కొట్టాలనే వాంఛ వారి మనసుల్లో వుంది. కోపంరాగానే యితరులని కొడితే మళ్ళీ కొడతారు. దిక్కుమాలిన బిడ్డ మళ్ళీ కొట్టలేదు. కొట్టాలనే దుర్వాంఛ వల్ల బిడ్డల్ని బాదే వుపాధ్యాయు లున్నారనే సంగతి విద్యాధికారులు వొప్పుకొని, కొట్టకూడదని శాసించారు. అట్లానే కొట్టే సంతోషంకోసం తమ కోపాన్ని తీర్చుకునేందుకు, కసితీర్చుకునేందుకు సమస్తమైన విద్యాధికులు, జ్ఞాన సంపన్నులు, దయామయులు, పుణ్యాత్ములైన తండ్రు లందరూ బిడ్డల్ని బాదుతున్నారు. ఈ ఘోరకార్యంలో వుండే ఈ నీచ త్వమూ, ఈ పశుత్వమూ బయలుపడుతుందేమోనని, ఈక్రూర దండనలకి శిక్షణా—దయా—ప్రేమా—మాతృప్రేమా — అని పవిత్రమైన పేర్లుపెట్టి సమర్థించుకుంటారు. దెబ్బలు లేకపోతే చెడిపోతారని తమ మనసుల్ని తామే మోసపుచ్చుకుని సుఖిస్తారు.

బిడ్డ వచ్చిన తరవాత కాని ఆ ప్రేమ బైటపడదు. అదుర్దా, 'సెంటిమెంటూ', బిడ్డద్వారా తమ స్వలాభాన్ని తీర్చుకునే వాంఛా

వుంటాయి. వాటినే ప్రేమ అనుకుంటారు. ప్రేమవున్నవాళ్ళు బాదరు. కోపమే రాదు వాళ్ళకి. దెబ్బలుకొట్టడం పశుప్రాయం. స్వరక్షణార్థం తప్పు యెవరినన్నా సరే చెయ్యిచేసుకునేవాళ్ళు కుమ్ముకునే పశువులకన్న అధమం. అందులో దిక్కులేక అసహాయులై, సంపూర్ణ విశ్వాసంతో పెద్దవారిమీద ఆధారపడ్డ పిల్లల్ని కొట్టేవారంత పరమనీచులెవరూ వుండరు. ప్రేమవల్ల కాదు కొట్టేది, వాళ్ళ తెలీనికోపం—అహంభావం — వీటివల్ల కొడతారు. కొట్టడం వల్ల పెద్దవారిలో క్రూరత్వం వృద్ధి అవుతుంది. అదిగాక వారికి తెలీకుండానే పెద్దవారికి ఈర్ష్యవుంటుంది — మనం దెబ్బలతో పెరిగామే, దెబ్బలు లేకుండా మన పిల్లలెందుకు పెరగాలి అని।

తరతరాలనుంచీ వాస్తో తమ తండ్రినీ, తాతనీ, ముత్తాతనీ, తమనీ, వుద్ధరించిన యీ సనాతనాచారమైన దెబ్బల్ని వొదిలి, ఈ కొత్త కిరస్తానీ పద్ధతుల్లో ప్రవేశిస్తే ఏ దేవుళ్ళకి కోపమొస్తుందో, ఏ అశుభమవుతుందో, బిడ్డ చెడిపోతాడో।

పిల్లలకీ, తలిదండ్రులకీ ఏ విశ్వాసమూ, స్నేహమూ వుండడం అతిముఖ్యమో, అవి ఈ దెబ్బలతో నశిస్తాయి. అంతటితో శిక్షా విధానమంతా మట్టిలో కలుస్తుంది.

బిడ్డలో వుండే దృఢత్వమూ, ధైర్యమూ శ్రద్ధా చచ్చి "కొట్టొద్దు" "కొట్టొద్దు" అని కాళ్ళు పట్టుకొని ఏడ్చే నీచజీవిగా తయారౌతుంది. దెబ్బ కొడితేగాని చెప్పినమాట వినదు. కోమలత్వమూ, 'డెలికెసీ', దయా పోయి క్రూరజీవి అవుతుంది. పెద్దదైనా దెబ్బలనే టప్పటికి దడిచి,లొంగిపోతుంది. పిరికిదవుతుంది. తనూ యితరుల్ని కొడుతుంది. ఈ యుద్ధాలూ,హత్యలూ, అన్నీ చిన్నప్పుడు దెబ్బలు తిన్న పిల్లలవల్లనే జరుగుతున్నాయి.

కనక కొట్టడమనేదీ, తిట్టడమనేదీ శిక్షా విధానంలోంచి తీసేస్తేనే గాని లాభంలేదు. బిడ్డని కొట్టారా, మళ్ళీ బిడ్డలచేత వెంటనే దెబ్బలు తినాలి. కొట్టడం తప్పని వొప్పుకోవాలి.

# ఆట

పిల్లల ఆటలకి ఎన్నడూ యే వయసులోనూ, ఆటంకం చెయ్యకూడదు. ఒకటిన్నర సంవత్సరం వొచ్చేవరకూ పిల్లలు వాళ్ళంతట వాళ్ళే వొంటరిగా ఆడుకుంటారు. పెద్దవాళ్ళు వూరికే వాళ్ళని పూసుకుని, యెత్తుకుని, ఆడించి పాడుచెయ్యకపోతే చాలు. ఎన్నడూ బిడ్డని అనవసరంగా ఆడించడం, బాధించడం కూడదు. బిడ్డవంక చూడక, మాట్లాడక ఆడుకోనివ్వాలి.

పసితనంలో ఆడుకోడానికి సామాగ్రి యేమీ అఖ్ఖర్లేదు. కాని నాల్గు నెలలనించి బిడ్డకి బొమ్మల సరదా ఎక్కువ. ఏడాదినించి బిడ్డ వస్తువులతో అదేపనిగా వాటిని ఉపయోగిస్తూ ఆడుతుంది. బిడ్డ అడగ్గానే యియ్యడానికి వీలైన వస్తువల్లా ఇవ్వాలి. ఇవ్వడానికి వీల్లేనివైతే, ఖరీదువైతే అట్లాంటివే చవకవి చేయించీ, వంటవస్తువు లడిగితే అట్లాంటివే పిడతలిచ్చీ, కలం కాయితాలడిగితే పనికిరానివి యిచ్చీ, చాకులవంటి అపాయకరమైనవి అడిగితే అపాయం కలగకండాచేసి, యిచ్చీ, బిడ్డని సంతుష్టి పెట్టాలి. తెగని కత్తులూ, మందులేని నిప్పుపుల్లలూ ఖరీదులేని పుస్తకాలూ మొదలైనవి. బిడ్డకు ఎట్లాంటి వస్తువుల మీద అభిలాషో కనిపెట్టి అవి యివ్వాలి. నీళ్ళమీద యిష్టమైతే, ఇంట్లో నీళ్ళు పారబొయ్యవద్దని చెప్పి, వేరే కుండలో దూరంగా నీళ్ళుంచి ఆడుకోమనాలి. బురద యిష్టమైతే, అది యిచ్చి దూరంగా ఆడుకోమనాలి. అగ్గిపెట్టె యిష్టమైతే, బట్టలు తీసేసి తగలపడేవి ఏమీ లేకుండా చూసి ఆడుకోమనాలి.

పెద్దవాళ్ళ వొస్తువులు ఆటకి యివ్వకూడదు. ఇస్తే పాడుచేసినా వూరుకోవాలి. ఒక్కొక్కప్పుడు పిల్లలు వాళ్ళ ఆటలతో పెద్దవారికి యిబ్బంది కలుగజేస్తారు. అప్పుడైనా ఆ యిబ్బంది తప్పేవిధం ఆలోచించాలి. కాని పిల్లల్ని ఆట మానమనకూడదు. మధ్యాహ్నం పెద్దవాళ్ళు నిద్రపోయేప్పుడు డబ్బా కొడితే, దూరంగా కొట్టమనాలి.

బిడ్డ ఆట నెప్పుడూ అభ్యంతరపరచ కూడదు. ఏదో వొకటి తన చేతులతో చెయ్యాలనే అణచరాని గొప్ప ప్రోద్బలం బిడ్డని ఆడిస్తో వుంటుంది. ఆ వుత్సాహం ఆ మహాశక్తిని ఎట్లాగో వొకలాగు బిడ్డవుపయోగించకుండా వుండలేదు. కదలకుండా విగ్రహాల్లాగు కూచోలేరు. కనక యిట్లా వస్తువులిచ్చి ఆ శక్తిని సరియైన మార్గాల ఉపయోగించకపోతే యేదో ఒక వక్రమార్గాన అది వ్యయం చేస్తారు. పెద్దవారు వస్తువులు ఇవ్వకపోతే పెద్దవారి వస్తువులు పాడు చేస్తారు. దానికి పిల్లల్ని శిక్షించడం అన్యాయం. ఆ శిక్షలవల్ల అనేక దుర్గుణాలు కలుగుతాయి. అమూల్యమైన ఆట శక్తి చచ్చిపోతుంది. ఈ పనులు వారిచే చేయించే సహజ శక్తి ముందు ముందు మేధాశక్తిగా, ప్రయోజకశక్తిగా మారుతుంది. బలవంతంగా బిడ్డని ఆటలనించి బంధించారా—బిడ్డ ఎదిగినకొద్దీ మొద్దవుతుంది. బిడ్డ సోమరిగా పెద్దవారి పనులలో కలసకూడదు. "ఏం చెయ్యను ? ఏం తోచడంలేదు"—అనే స్థితికి రాకూడదు. పిలిచినా పలకనంత ఆసక్తితో బొద్దస్తమానం ఆడాలి.

బిడ్డకు ఆటలకై సామానులు విరివిగా యివ్వాలి. గొప్ప ఖరీదైన వస్తువులూ, బొమ్మలూ అఖ్ఖర్లేదు. వాటిని కొంటే దాచి తమాషాకి వాటి చూపాలి. అద్దాల బీరువాలో అందానికి వుంచాలి. అంతేకాని రోజూ ఆడుకునేందు కియ్యకూడదు. కొయ్యముక్కలు, పిడతలు, గిన్నెలు, యిసిక, మన్ను, నీళ్ళు, కాయితాలు, అట్టలు, గుడ్డపీలికలు, పూసలు యివ్వాలి. కొన్ని వస్తువులతో బిడ్డ యేదో చేసి ఆడుకునేట్లుండాలిగాని, ఆ బొమ్మ

ఏదో చెస్తోవుంటే, బిడ్డ పూరికే కూచుని ఆనందించేట్టు వుండకూడదు కీ యిస్తే తమాషాచేసే రైళ్ళూ బొమ్మలూ వృధా. పైగా బిడ్డ మనోవృద్ధికి చెరుపు.

కొంచెం పెద్దదికాగానే తక్కిన పిల్లలతోకలిసి తన ఆటవస్తువుల్ని బిడ్డ తనే తయారుచేసుకోవాలి. ఇళ్ళు, మంచాలు, చొక్కాలు, పరుపులు, గూళ్ళు, బుట్టలు, పడవలు మొదలైనవి. సీమసున్నమిచ్చి బల్లమీద, నేల మీద బొమ్మలుగీయించవచ్చు. మళ్ళు తవ్వించడం మొక్కలు నాటించడం నీళ్ళు పోయించడం, దూడలకీ, పావురాలకీ, కోళ్ళకీ మేత వేయించడం చెయ్యవొచ్చు. వంటలో సహాయం చేయించుకోవచ్చు. ఇదంతా ఆటగా చేసినప్పుడే ఆ పిల్లలు సంతోషంగా చేస్తారు. వాళ్ళు ఆటగా చేసేపనే, బలవంతంగా చెయ్యమనగానే వాళ్ళకి కిష్టమవుతుంది. పూరికే వస్తువు ల్నిచ్చి, ప్రోత్సాహం వాళ్ళకే కలిగేట్టు చెయ్యాలి. పెద్దవాళ్ళు చేసి చూపించి ప్రోత్సాహం కలిగించవచ్చు. ఆటల రూపాన ఇంటికి కావలసిన పనులన్నీ చేయించుకోవచ్చు. వాళ్ళతో కలిసి పెద్దవాళ్ళు అప్పుడప్పుడు ఆడాలి. కాని వాళ్ళ యిష్టాలు చూస్తో, వాళ్ళ ఆజ్ఞలకు లోబడి ప్రవర్తించాలి—ఆటల్లో పెద్దవారు.

ఇట్లా ఆడవలసిందేగాని, బిడ్డ తాను చేసుకోగలిగిన పనికాని, ఆట గాని ఒక్కటీ పెద్దవాళ్ళు చేసిపెట్టకూడదు. కంచాలు పెట్టుకోవడం అన్నం వడ్డించుకోడం, నీళ్ళు పోసుకోడం, బట్టలు వేసుకోడం మొదలైనవన్నీ వాళ్ళే చేసుకోవాలి. ఆటల్లోకూడా బిడ్డలకి కొత్త వుత్సాహం కలగడానికి వాళ్ళకి చాతకాని పనులకు మార్గంచూపి వాళ్ళని చెయ్యమనాలి. ఆ పనులు సరిగా చెయ్యలేకపోయినా బిడ్డే చెయ్యాలి. నౌకర్లూ, ముసలమ్మలూ సహాయం చేస్తో సోమరిగా పెరిగిన పిల్లలంత నిష్ప్రయోజకు లెక్కడా వుండరు.

పిల్లకి మూడేళ్ళు వచ్చేటప్పటికి తల్లితోపాటు ఇంటి పనులన్నీ చేస్తో తోడ్పడాలి. తల్లి ఇంటి పనులు చేస్తో బిడ్డని వెంట తిప్పుకుని తనతో పనులు ఆటలవలె చేయించుకోవాలి. దీనికి చాలా తెలివీ, ఓర్పూ, నేర్పూ కావలసి వుంటుంది. పెద్దవారికి సహాయం చెయ్యాలనే విధికింద గాక, ఆటలకింద అలవాటైపోవాలి. ఆటలలో వుపయోగించే ప్రోద్బలాన్నే ఈ పనులకు మళ్ళించేటట్లు చెయ్యడమే తెలివి. అన్ని పనులూ పెద్దవాళ్ళచేత చేయించుకుంటో, తాము మాత్రము సహాయం చెయ్యని బిడ్డలు చాలా దౌర్భాగ్యులు. కాని పని చెయ్యమని బిడ్డని నిర్బంధించ కూడదు.

# తక్కిన పిల్లలు

బిడ్డకి రెండేళ్ళు రాగానే స్నేహితులు కావలసివొస్తారు. నేర్పరితనమూ, పనివాడితనమూ, సంపాయించాలనీ; లోకంలో తాను అనేక పనులు చేసి, శక్తి సంపాయించాలనీ; గొప్పతనాన్ని పొందాలనీ వుంటుంది. బిడ్డకి ఈ సహజ వాంఛని సాఫల్యం పరచుకునేందుకు, అనేక మంది పిల్లలతో కలిసి ఆటలు ఆడడం ముఖ్యం. తాము రాజులైనట్లూ, వీరులైనట్లూ, రైలు యింజనులైనట్లూ, రాక్షసుల్నీ, పర్వతాల్నీ సాధించినట్లూ, ఆటలు కల్పించి ఆడుకుంటారు. పెద్దవారు కూడా ఇంకా వారికి భావనాశక్తి తోడ్పడించి, మాయ కథలను కల్పించి బిడ్డల్ని ఆడించాలి. అందరూ కలిసి ఆట వొంతెనలూ, గోతులూ, చెట్లూ, కంచెలూ కాలవలూ చెయ్యడం, చిన్న నాటకాలు, పాటలు, తమాషా యాత్రలు మొదలైనవి ఆడడం మంచిది.

ఒకటిన్నర యేడు వొచ్చినప్పటినుంచి మూడేళ్ళు వొచ్చిందాకా పిల్లలకి వాళ్ళకంటే కొంచెంగా పెద్దపిల్లలతో స్నేహం అవసరం. వాళ్ళని అనుకరించి చాలా జ్ఞానాన్ని సంపాదిస్తారు.

మూడేళ్ళనించి ఆరేళ్ళదాకా వాళ్ళకంటె చిన్నపిల్లల స్నేహం అవసరం. చిన్నవాళ్ళతో మెలగడంవల్ల కొన్నిసుగుణాలు అలవడతాయి.

చిన్నపిల్లల్ని గొప్పచేసి, వాళ్ళు పెద్దపిల్లల్ని ఏడిపించేట్లు చెయ్యకూడదు. పెద్దపిల్లల్ని కొట్టినా, వాళ్ళజోలికి పోయినా, ఆ పెద్ద పిల్లలు చిన్నపిల్లల్ని తన్నవొచ్చు. కాని కారణం లేకుండా బాధించ కూడదు. పెద్దపిల్లలచేత ఆటల్నీ, బొమ్మల్నీ చిన్నపిల్లలకోసం బల వంతంగా త్యాగం చేయించకూడదు.

నాలుగేళ్ళనించి సమాన వయస్కులు అవసరం. కనక పిల్లల్ని ఆ వయసునించి బడికి పంపాలి. చాలా బలహీనులూ, గొప్ప మేధాశక్తి వంతులూ, భయస్థులూ తప్ప, తక్కిన పిల్లలందరూ బడికి వెళ్ళి తీరాలి. పరాయిపిల్లలు యింటికి వచ్చినప్పుడు తమ పిల్లల్నీ వాళ్ళనీ సమానంగా చూడాలి. పెద్దవారు దయగా ప్రేమగా ప్రవర్తించాలి. యే పిల్లల యెడల నన్నా తాము నిర్దయగా ప్రవర్తించవలసివొస్తే, తమ పిల్లలకు ఆ నిర్ద యకు కారణం చూపాలి. పెద్దవారు తన ఆటవస్తువులూ తిండివొస్తువులూ తక్కిన పిల్లలతో విరివిగా పంచుకునేటట్టు నేర్పాలి. బలవంతంగా పెద్దవారు పంచకూడదు. పంచడం మంచిదని చెపుతోవుండాలి. పెద్దవారు తమ వాటిలో యితరుల కివ్వాలి. పిల్లలచేత ఇతరులకి బలవంతంగా యిప్పించడంకంటె స్వార్థంగా పిల్లల్ని వుండనియ్యడమే మంచిది. తమ కన్న చిన్నపిల్లలకి సహాయపడేట్టు, వాళ్ళ జాగ్రత్త తీసుకునేట్టూ, ప్రేమించేట్టూ, బాధ్యత వహించేట్టు నేర్పాలి.

వీలైనంతవరకు పిల్లల పోట్లాటలు పిల్లల్నే తీర్చుకోనివ్వాలి. ప్రయత్నపూర్వకంగా పెద్దపిల్లలు చిన్నపిల్లల్ని ఏడిపిస్తేగాని, పెద్ద వాళ్ళు జోక్యం కలిగించుకోకూడదు. క్షమార్పణ నేర్పాలి. "నన్ను కొట్టింది"—అని ఫిర్యాదుచేస్తే, "పోనీలే. వూరుకోరాదూ! దాన్నేమన్నా

చేస్తే నీకేం లాభం? నువ్వు ఊరుకుంటే అది యీసారి యేమీ చెయ్యదు"—అనాలి. క్షమించి ఊరుకోడం గౌరవం, ధర్మం అనాలి. ఆ విషయమై కథలు చెప్పవొచ్చు. కొట్టిన బిడ్డని ఆ పని తప్పని గట్టిగా ఖండించాలి. కాని దెబ్బలుతిన్న బిడ్డ ఇన్నిచెప్పినా తాను వూరుకోనంటే పెద్దవారు అడ్డుపడి వూరుకోపెట్టకూడదు. కలియపడతానంటే కలియపడ నివ్వాలి. కొట్టినబిడ్డని శిక్షించమంటే ఆ బిడ్డచేత క్షమాపణ అడిగించాలి. అది తృప్తికాకపోతే, దెబ్బలుతిన్న బిడ్డచేత అన్ని దెబ్బలూ కొట్టించాలి. ఆ కొట్టినబిడ్డ పరాయిబిడ్డ అయి చిక్కకపోతే, ఆ బిడ్డని యింటికి రానీ కూడదు. తమ బిడ్డని ఆ బిడ్డతో ఆడవొద్దని సలహా యివ్వాలి. సలహా వినక ఆడితే యీసారి ఆ బిడ్డ కొడితే పెద్దవారి బాధ్యతలేదు. కలిసి కోర్టుగాచేసి శిక్ష వేయించాలి. క్రమంగా పిల్లలు వారి పోట్లాట ఫిర్యా దుల్ని పెదవారిదగ్గిరికితేకుండా వాళ్ళే తగూలు తీర్చుకునేట్టు న్యాయమూ, అన్యాయమూ, క్షమార్పణా — ఈ ఉద్దేశాలు నేర్పాలి. పిల్లలు ఫిర్యాదు తీసుకొస్తేతప్ప వాళ్ళ పోట్లాటల్లో పెద్దవారు జోక్యం కలుగజేసుకో కూడదు. కాని పోట్లాటల్లో, కర్రలూ, రాళ్ళూ వుపయోగించడమూ, అపాయకరమైన దెబ్బలు తగిలించుకోడం యివి చెయ్యనీకూడదు. ఒక పిల్ల వోడింతరవాత యింకా కసికొద్దీ రెండోపిల్ల కొడుతోవుంటే అడ్డు పెట్టాలి. అట్లాంటిపనికి ఆ బిడ్డ సిగ్గుపడేట్టు చెయ్యాలి. కొట్టుకోడం పశుత్వమని చెపుతో పెద్దవారు తామెవరినీ కొట్టక మార్గం చూపాలి.

కొందరు పిరికి పిల్లలుంటారు. బలమున్నాసరే, యీడున్నాసరే పోట్లాడరు. తన్నులుతిని పెద్దవాళ్ళతో చెప్పుకుంటారు. అట్లాంటి వాళ్ళకి పౌరుషమెక్కించి, స్వరక్షణను నేర్పాలి. పౌరుషమెక్కిందాకా దెబ్బలు తిననియ్యాలి. "నీకు చేతనైతే కొట్టు, చాతకాకపోతే దెబ్బలు తిను" అనాలి. బాధ కలిగించి భయం పోగొట్టాలి మరీ యింకా ఒప్పుగా దెబ్బ

లకి లోబడుతోవుంటే, జోక్యం కలుగజేసుకుని ఆపాలి. కొట్టేవాళ్ళని మాత్రం నిస్సహాయుల్ని కొట్టినందుకు సిగ్గుపడేట్టు చెయ్యాల్సిందే.

కొట్టుకోడం, పోట్లాడడం పిల్లలకు అవసరం. ఆ సహజ కార్యాన్ని ఆపినట్లయితే అక్రమ మార్గాల అల్లరిచేస్తారు. కనక యిష్టం వచ్చినట్టు తగూలాడనియ్యాలి, కొట్టుకోనివ్వాలి. గట్టిగా కొట్టుకొంటున్నా అడ్డుపెట్టకూడదు. బాగా పోట్లాడే పిల్లలే ఎక్కువ స్నేహపాత్రులవుతారు, పోట్లాట పోగానే, పోట్లాట ఆపితే హృదయంలో కోపం మందుతో వుంటుంది. అది అనారోగ్యం.

పెద్దవారేమాత్రమూ పక్షపాతం చూపకూడదు. తమ పిల్లల్లోనైనా సరే, ఇతరులలోనైనాసరే. ఒక పిల్లతో చేరి మాటలని రెండోవారిని బాధ పెట్టకూడదు, అతనెంత దుర్మార్గుడైనాసరే.

పెద్దపిల్లలు చిన్నవాళ్ళను వెక్కిరించినా, కొట్టినా, యేడిపించినా కఠినంగా శిక్షించాలి. బాగా కోపం చూపాలి. పెద్దపిల్లలు, చిన్నవాళ్ళని బెదిరించి, లంచాలిచ్చి, ఏడిపించి, వాళ్ళచేత అల్లరిపనులు చేయించి, తాము తప్పుకుంటారు. పెద్దపిల్లల చెడ్డ సలహాలు వినవద్దనీ, వాళ్ళేమన్నా చేస్తే తమతో చెప్పమనీ వాళ్ళ బెదిరింపులకు దడవొద్దనీ, చిన్నవాళ్ళతో చెప్పాలి. పెద్దపిల్లల్ని శిక్షణలో పెట్టాలి.

ఒక బిడ్డ ఇంకోబిడ్డ చేసిన చెడ్డపనిని తెలుసుకుంటాడు. ఆ పని సంగతి పెద్దవారితో చెబుతానని బెదిరిస్తే, ఆ రెండో బిడ్డని తనకి బానిసని చేసుకుంటాడు. అట్లాంటివి గమనించాలి. ఆ సాడీచెప్పే బిడ్డని శిక్షించాలి. ఆ తప్పుకు రెండో బిడ్డని ఏమీ శిక్షించకూడదు.

పిల్లలు చెడ్డ సావాసాలు చేస్తే వద్దనాలి. కాని బలవంతంగా మాన్పకూడదు. ఎప్పుడూ చెడ్డగా ఆ స్నేహితుల్ని గురించి మాట్లాడుతూ వుండకూడదు. క్రమంగా ఇతరమైన పనులూ, కొత్త స్నేహితులూ కల్పించి ఆ సావాసాలు తప్పించాలి.

# పెద్దవాళ్లు

పెద్దవారి స్నేహితులూ, బంధువులూ యింటికి చూడ్డానికి వస్తూ వుంటారు. వాళ్ళలో చాలామందికి పిల్లలపైన నిజమైన సరదా వుండదు. అటువంటి వారినించి పిల్లల్ని దూరంగా వుంచాలి. ముద్దుకదా అని పిల్లల్ని వాళ్ళ నెత్తిన రుద్దకూడదు.

వాళ్ళలో కొందరు పిల్లల్ని చూస్తే సరదా లేకపోయినా, మర్యాదకి వున్నట్టు నటిస్తారు. మర్యాదకోసం పిల్లల్ని వారినించి తప్పించెయ్యాలి. పిల్లలకి వీరు శత్రువులు.

పిల్లలమీద వాస్తవమైన యిష్టమున్న వారితో పిల్లల్ని స్వేచ్ఛగా తిరగనియ్యాలి. వారితో వాళ్ళకి యిళ్లకు కొంతకాలం పిల్లల్ని పంపుతో వుండవొచ్చు. కాని యీ సహవాసంవల్ల తామిచ్చే శిక్షణకు భంగం కలగకండా విరుద్ధమైన అభిప్రాయాలు పిల్లలు నేర్చుకోకుండా జాగ్రత్త తీసుకోవాలి. మంచి అలవాట్లేర్పడ్డ తరవాత పంపవొచ్చు.

కొందరికి పిల్లల్ని యేడిపించడం, విసిగించడం సరదా. కొందరికి అతిముద్దుతో పిల్లల కిష్టం లేకపోయినా కష్టపెట్టడం సరదా. వీళ్ళు పిల్లల అభివృద్ధికి విషతుల్యులు. వారెంత గొప్ప స్నేహితులైనా, దగ్గిర బంధువులైనా వెంటనే వారినించి పిల్లల్ని తప్పించాలి. పిల్లలకి యిష్టంలేనిది ప్రశ్నలు వెయ్యనియ్యకూడదు. వాళ్ళ ఆట వస్తువులతో జోక్యము కలుగ చేసుకోనియ్యకూడదు. పిల్లలకి యిష్టమైనా, చివరికి తల్లిదండ్రులు కూడా పిల్లల్ని నడపడమూ, అతిముద్దు చెయ్యడమూ, పనికిరాదు. వారుకాని యెవరుకాని పిల్లని అందమైనదనీ, తెలివైనదనీ, భాగ్యవంతురాలనీ పొగడకూడదు.

పిల్లలకు మర్యాద నేర్పాలి. ఇంటికి వచ్చినవాళ్ళ యడల వాళ్లు మర్యాదచూపడం ఒక అలవాటు. కనుక పెద్దవారు శ్రద్ధతీసుకొని ఆ అలవాటు నేర్పాలి. ఏమి చెయ్యాలో ఎట్లా మాట్లాడాలో చూపాలి. అంతేగాని మర్యాదగా వుండమని ఆజ్ఞాపించడంవల్ల లాభంలేదు. ఆ మర్యాద కార్యాలను ఆటలరూపంగా పోగొట్టవచ్చు. ఇంటికి వొచ్చినవారినీ, స్నేహితులనూ సంతోషపెట్టాలనే ఆసక్తి బిడ్డలకి వుండాలి. కాని బానిసత్వం కూడదు. తన మర్యాదను కాపాడుకోవాలి బిడ్డ.

ఇంటికి వచ్చినవారు బిడ్డలయడల అమర్యాద చూపినా, బిడ్డ అమర్యాదగా ప్రవర్తించకూడదు. మర్యాద యితరుల కొరకు కాదు. తమ ప్రవర్తన సరిగా వుండడమే ముఖ్యోద్దేశము. తాము మాత్రము ఏ పరిస్థితుల లోనూ తమ సహజ ఔదర్యాన్ని విడనాడకూడదనీ మర్యాదను మీరకూడదనీ చెప్పాలి.

కాని పిల్లలు అమర్యాదస్తుల యెడల అమర్యాద చూపితే తలి – తండ్రులు అభ్యంతర పెట్టకూడదు. కాని మర్యాద చూపడమే ఆదర్శమనిమాత్రం తమ ప్రవర్తనవల్ల పెద్దవారు చూపాలి. పిల్లలకి నిష్కారణంగా కొందరిమీద అయిష్టం కలుగుతుంది. అటువంటి వాళ్ళతో బిడ్డ మాట్లాడనంటే, మాట్లాడమని పెద్దవాళ్ళు నిర్బంధించకూడదు. కాని మాట్లాడితే బిడ్డ మర్యాదగా మాట్లాడాలి. లేకపోతే దూరంగా వుండవచ్చు. ఆ అతిథులుకూడా యిష్టపడని పిల్లల జోలికి పోకూడదు. ఒక్కొక్కప్పుడు పిల్లలు కొందరియడల అమర్యాద చూపుతారు. తలితండ్రులు దానికి పిల్లల్ని శిక్షిస్తారు. కాని ఆ స్నేహితులు రహస్యంగా పిల్లల్ని యెప్పుడో ఏడిపిస్తో వుండడమే కారణం. కనక తలిదండ్రు లటువంటి విషయాలు కనుక్కుంటో వుండాలి. దయగా పిల్లల్ని పిలిచి అడగాలి.

అప్పుడప్పుడు యీ పిల్లలే కొత్తవాళ్ళని ఏడిపించి విసిగిస్తారు. మర్యాదవల్ల ఆ కొత్తవాళ్ళు వూరుకోవచ్చు. తలితండ్రు లది కనిపెట్టి

పిల్లల్ని ఆ క్రొత్తవారి యిష్టప్రకారం శిక్షించుకోమని వాళ్ళతోనే చెప్పాలి. వాళ్ళు శిక్షించలేనివారైతే పిల్లల్ని దూరంగా పంపాలి. క్రొత్త వాళ్ళూ, పిల్లలూ సమానంగా పోట్లాడుతోవుంటే పెద్దవారి జోక్యం అనవసరం.

పెద్దవాళ్ళు మాట్లాడేచోట పిల్లలు అల్లరిచేస్తే దూరంగా పంపాలి. క్రొత్తవాళ్లెవరన్నా రాగానే పిల్లలు గుమిగూడే అలవాటు మాన్పాలి. పిల్లల్నికూడా పెద్దవాళ్ళదగ్గరే కూచోమని బలవంతంచేసి, వాళ్ళు అల్లరి చేస్తే శిక్షించడం తప్పు.

ఇంటికి వొచ్చే ప్రతివారినీ పెద్దవాళ్ళు సమానంగా చూడాలి. స్నేహ తారతమ్యమే, గౌరవ తారతమ్యాన్ని కలిగించే ప్రధాన సూత్రంగా వుండాలి. కులమూ, లింగమూ, భాగ్యమూ మొదలైన భేదాలన్నీ యేమాత్రమూ గౌరవ విషయంలో పాటించకూడదు.

స్నేహితులూ, బంధువులూ, వారి గుణాలూ, చర్యలూ బిడ్డముందు ఖండించరాదు. మనుషుల్ని గురించి చెడ్డగా మాట్లాడడం మానాలి; ముఖ్యంగా స్కాండల్సు.

బాలుడి వేషభాషలూ, పనులూ, ఆచారాలు లోకంతోబాటుగా అందరికీ సమ్మతము యేటట్టు వుండాలి. అందరికీ వికృతంగానో, వినోదంగానో, నూతనంగానూ, విరుద్ధంగానూ కనపడకూడదు. లోకంమీద తృణీకార భావమూ, అసహనమూ నేర్పకూడదు. కాని బిడ్డ కావలసి తాను విరుద్ధంగా నడుస్తానని తెలిసి పట్టుబడితే పెద్దవారు అభ్యంతరంపెట్టకూడదు.

కాని బిడ్డ తన నడవడిని లోకాభిప్రాయంమీద ఆధారపెట్టుకోకుండా వుండడం నేర్పాలి. లోకాన్ని ప్రేమించాలిగాని, లోకం తప్పు మార్గంలో వుందని విశ్వసించినప్పుడు నిర్లక్ష్యంగా తిరగబడాలి. తన అంతరాత్మకి తోసినట్టు చేసితీరాలి. ఎవరేమన్నాసరే వచ్చే కష్టాలను

నిర్లక్ష్యంగా సంతోషంతో, ధైర్యంతో భరించాలి. కాని ముఖ్యవిషయాల్లో తిరగబడ్డా, సాధారణ విషయాల్లో లోకంతో స్నేహంగా వుండడానికే ప్రయత్నం చెయ్యాలి.

కాని లోకానికీ, స్నేహితులకీ భయపడనేకూడదు. లోకంతో కలిసి మెలిసి వారి ప్రకారం నడుచుకోవలసిందేగాని, లోకం వెక్కిరిస్తుందనీ తన నడవడినీ ఖండిస్తుందనీ భయపడి తనకి న్యాయమూ, సత్యమూ అని తోచినదానిని బిడ్డ వొదులుకోకూడదు.

# సేవా-అర్డరా?

బిడ్డకి ప్రతినెలా 'పాకెట్ మనీ' కొంతడబ్బు ఇవ్వాలి. అది యెంతో కుటుంబస్థితివల్లా, బిడ్డ వయసుతోనూ మారుతుంది. బిడ్డ అల్లరి చేసినా, పనిచెయ్యకపోయినా, వస్తువులు పాడుచేసినా ఆ డబ్బు తగ్గించ కూడదు. ఆ జీతం బిడ్డ తన యిష్టం వచ్చినట్టు ఉపయోగించుకోవచ్చు. కానీ అనారోగ్యాలు, హానికరాలూ ఐన పదార్థాలు కొనడానికి వుపయోగించ కూడదు ఆ డబ్బుని. ఆ డబ్బు వీధిలో పారేసినా, అందరికీ మూర్ఖంగా పంచిపెట్టినా వూరుకోవాలి. కాని మళ్ళీ ఎక్కువ డబ్బులు మధ్య మధ్య ఇవ్వకూడదు. దాచుకుని ఉపయోగించుకునే పద్ధతి నేర్చుకోవాలి—బిడ్డ దురుపయోగపరచి నష్టపడ్డప్పుడు ఆ విషయం మనసుకి నచ్చచెప్పాలి. "చూశావా ఆ డబ్బంతా ఒకేసారే తగలేశావు, దాచుకుంటే ఇప్పుడు పిల్లం గోవి కొనుకోవచ్చును కదా" అనాలి.

డబ్బులు బిడ్డచేతి కిచ్చెయ్యాలి. దాచిపెట్టమంటే దాచాలి. మళ్ళీ ప్రతినిమిషం అడగనియ్యకూడదు. అడిగి తీసుకునేందుకు వేళలుండాలి.

కాని వూరికే డబ్బు అయిపోతుందే అనే కాపీనంతే డబ్బు దాచు కోడం పెద్దవారు 'ఎన్కరేజ్' చెయ్యగూడదు. తెలివిగా, వుపయోగ కరంగా ఖర్చుపెట్టడం నేర్పాలి, కాని దాచుకోడం కాదు. వస్తువులు కొనియ్యాలి బిడ్డకి. కాని ప్రియంగా కొంటున్నప్పుడు బిడ్డ యెటా మోస పోతోందో చూపాలి. సరిగా సరైన ధరలకు కొనటం తెలుసుకునేట్టు చూపాలి. పెద్దవారు ధనంవిలువా,దాని సద్వినియోగమూ నేర్పడం ముఖ్యో ద్దేశం. వూరికే కూడపెట్టడమూ పనికిరాదు; బుద్ధిలేక ఖర్చుపెట్టడమూ మంచిదికాదు.

బిడ్డ యింటో పనికి సహాయం చెయ్యాలి. ఆ పని మూడు విధాలు :

1. ప్రేమతో చేసే సహాయం : మూడేళ్ళురాగానే తమ సహాయార్థం పనిచెయ్యమని బిడ్డని అడగవచ్చు. కాని బిడ్డ చెయ్యనంటే బలవంత పెట్టకూడదు. బిడ్డ ఆడుతో వుండగా 'డిస్టర్బు'చేసి పిలవకూడదు.

"నామీద ప్రేమలేదా ! పనిచెయ్యకపోతే నీమీద కోపమొస్తుంది. నీతో మాట్లాడను" అనకూడదు. బిడ్డ—పనిని ఆనందంతో, ప్రేమతో చెయ్యాలి. ఏదన్నా ఎక్కువ పని వచ్చినప్పుడు ఆ సంగతి చెప్పి బిడ్డ సహాయం అడిగితే బిడ్డ తప్పకుండా వొప్పుకుంటుంది. స్నేహితుల్ని సహాయం అడిగినట్లే, వారు సహాయం చెయ్యకపోతే బలవంతం చెయ్యగలమా ? వారికి సహాయం మనం మానేస్తాము. అట్లానే బిడ్డ పెద్దవారికి సహాయం చెయ్యకపోతే, దానికి సహాయగుణం నేర్పడానికై పెద్దవారు పిల్లకి గాలిపటాలూ, నాటకాలూ మొదలైన వారి ఆటల్లో సహాయం నిరాకరించవచ్చు. బిడ్డ భయపడి సేవచేస్తోందీ, ప్రేమతో చేస్తోందీ కనిపెట్టాలి. పెద్దవారు సోమరిగా కూచుని బిడ్డని నౌకరుకింద వుపయోగించుకోకూడదు. తమ పనిని తామే చేసుకోవాలి. బిడ్డని మంచినీళ్ళిమ్మనీ, విసరమనీ, కాళ్ళు పట్టమనీ అడిగి చేయించుకుంటారు. కాని బిడ్డ అడిగితే "నువ్వు చేసుకోలేవా ? చేతులు లేవా ?" అంటారు. అది అన్యాయం. పెద్దవారికి చిన్నవారు సేవచెయ్యాలనే ఉద్దేశం నశించాలి. అందరూ పరస్పర సహాయం చేసుకుంటో, ఒక యింటో వుండే సమాన వయస్కులైన స్నేహితు లనుకోవాలి. అవసరమైతే అన్ని విధాలా ఒకరికొకరు సమానమైన సహాయం చేసుకోవాలి. అవసరం లేకుండా ఒకరిమీద ఇంకొకరు అధికారంచేసి సేవ చేయించుకోకూడదు.

"మేము బిడ్డకి వండటంలేదా, పెంచటంలేదా" అంటారు పెద్దవారు. బిడ్డని కన్నందుకు ప్రతిఫలాపేక్ష లేకుండా పెద్దవారు చెయ్యవలసిన విధి అది. అందుకోసం బిడ్డని సేవచెయ్యమనడం తప్పు. తాము చేసుకో

గలిగినవన్నీ చేసుకుని అవసరమైనప్పుడు, బిడ్డలనించి పని తీసుకోవచ్చు.

2. విధిగా చేసేపని: యిది ఒక యింటో తనుకూడా 'మెంబరై' నందుకు అందరివలెనే తనూ విధిగా చెయ్యవలసిన పని. వయసునూ తీరికనూవట్టి దీని పరిమితీ, దీని విధమూ మారుతోవుంటాయి. అది యెట్లా చెయ్యాలో నేర్పాలి. అది చేసే సమయం నిర్ణయించాలి. ఈ పని చెయ్యకపోతే ఆ పనికి సంబంధించిన హక్కులు పోతాయి. కూరలు తరగడంపని బిడ్డదై, తరక్కపోతే కూర తినడానికి వీల్లేదు.

౩. కూలికి చేసేపని: బిడ్డకి డబ్బు కావలసినప్పుడు, పెద్దవారికి కావలసినపని చేసిపెట్టి డబ్బు సంపాయించుకునేందుకు వీలుండాలి.

# భయం

భయం పిల్లలకు సహజంకాదు. ఇతరులనించి నేర్చుకుంటారు. ముఖ్యంగా తలితండ్రులూ, దాదులూ, ముసలివాళ్ళు, అన్నలూ, అక్కలూ కారణం. ఈ చిన్నప్పటి భయాలమూలంగా జీవితమంతా పిరికివారై బాధ పడడమే కాకుండా క్రూరులౌతారు. బిడ్డలలో యింత సామాన్యంగా వుండేదీ, పాడుదీ, బిడ్డని జీవితమంతా ఇంతగా బాధపెట్టేదీ, నిర్మూలించ డానికి కఠినమైనదీ, యింకో గుణంలేదు. కనక బిడ్డ భయం నేర్చుకో కండా మొదటనే చాలా జాగ్రత్త తీసుకుని, భయం నేర్చుకున్న వెంటనే తలెత్తకండా చంపి, దాన్ని లేకండా చెయ్యాలి. ఇతరులకు సిగ్గుపడీ, భయ పడీ, బిడ్డ భయాన్ని అణుచుకునేట్టుగాక, అసలు భయమే లేకుండా వుండాలి. తన పెద్దవారిని, తలితండ్రుల్ని చూసినా భక్తి వుండాలిగాని భయం వుండకూడదు.

పిల్లలకి భయంలేకుండా వుండాలంటే ముందు పెద్దవాళ్ళు తమ భయాల్ని వదులుకోడమూ, మనసులోంచి కూడా భయాల్ని తరిమెయ్య డమూ తప్పదు. దెయ్యాలు, రైళ్ళు, దొంగలు, పోలీసులు, అధికార్లు, డాక్టర్లు, నీళ్ళు, నిప్పులు, పాపాలు, కర్మాలూ—ఈ భయాన్ని తామేకాక, యింట్లో బిడ్డలతో కలిసే మనుషులనించి వొదిలించాలి. భయం లోపల వుంచుకుని బిడ్డకి ఆ భయం వుందని తెలియకండా ప్రవర్తించడం అసాధ్యం. భయాలు వదులుకోని, ముసిలమ్మలు మొదలైనవాళ్ళని తరి మెయ్యడం తప్పనిసరి. చచ్చే ముసిలమ్మ ఎక్కువా ? నూరేళ్ళు బతక వలసిన బిడ్డ యెక్కువా ?

బూచి మొదలైన మాటలు అని బిడ్డని దడిపించకూడదు. పెద్ద వాళ్ళు బిడ్డ యేమయిందో అని భయపడి, ఆ భయం బిడ్డలో ప్రవేశ పెడ తారు. తమకి ఆ భయం కలిగించినందుకు బిడ్డని కొడతారు బిడ్డ బావి దగ్గిరగా, రైలుదగ్గిరగా వెడితే భయంకొద్దీ బిడ్డని దండిస్తారు.

దెయ్యాలు, బూచులు, నరకం, పాపం—యిలాంటివన్నీ శాస్త్రరీత్యా అర్థం చెప్పినట్టయితే భయం పోతుంది. వురుమూ, మెరుపూ, సుడిగాలీ, చీకట్లో చప్పుళ్ళూ, గ్రహణాలూ మొదలైనవి అర్థం తెలీగానే వాటి భయం పోతుంది. తెలియరాని భయమంతా అజ్ఞానంవల్ల కలిగిందేనని బిడ్డకి తెలియచెయ్యాలి.

శిక్షలతో దడిపించి బిడ్డని పెద్దవాళ్ళకు భయపడేట్టు చెయ్యకూడదు. ఇతరుల కోపానికీ, శిక్షకికూడా దడవనక్ఖర్లేదు. ఎవరిదన్నా వస్తువు బిడ్డ తాకితే "వాళ్ళు కోప్పడతారు; తాకకు" అనక, "ఇంకొకరి వస్తువులు వాళ్ళ అనుజ్ఞ లేనిది తాకడం మర్యాదకాదు. వాళ్ళకి ఇష్టం వుండక పోవచ్చు" — అనాలి. వూరికే బిడ్డలపైని కేకలు వేసేవారుంటారు."వారి కదోవిధమైన జబ్బు, దానికి దడవకూడ"దని చెప్పాలి.

దేన్నన్నా చూసి బిడ్డ భయపడుతూవుంటే ఆ భయం రూపుమాపే దాకా పెద్దవారూరుకోకూడదు. ఆ వస్తువుని బిడ్డ భయపడనంత దూరాన వుంచి క్రమ క్రమంగా దగ్గిరికి తీసికెళ్ళి మెల్లగా బిడ్డకి అలవాటు చెయ్యాలి. ఆ వస్తువును బిడ్డనించి తప్పించనూ కూడదు. బిడ్డమీద ఒక్కసారిగా వెయ్యనూకూడదు.

బిడ్డకు బిచ్చగాడి సంచి చూస్తే భయమనుకోండి. అప్పుడు బిచ్చ గాడి సంచిని విప్పిచూపి, బిడ్డచేతే దాంట్లో వస్తువులు తీయించి, బిచ్చగాడి చేత బిడ్డలతో దయగా మాట్లాడిస్తేసరి, దానికి ఆ భయం పోతుంది. ఆ భయం పూర్తిగా పోయిందాకా ఆ వస్తువును క్రమక్రమంగా చూపు తోనే వుండాలి. బిడ్డ భయపడుతోవుంటే బలవంతంగా భయం కలిగించే

వస్తువు దగ్గిరికి లాక్కెళ్ళకూడదు. ఆ వస్తువును మీద పడెయ్యకూడదు. అసలు పెద్దవాళ్ళు యెప్పుడో ఆ సంచి విషయం భయపెట్టక పోతే. బిడ్డకి భయం కలగనే కలగదు. ఈ భయాలు పోగొట్టడం చాలా ముఖ్యం. కనక పెద్దవారు చాలా శ్రద్ధ వహించాలి. ఈ చిన్న భయాలే ముందుముందు చాలా విపరీతమైన భయాలకు మూలకారణాలు. పెద్దవారు తాము భయముచూపక, దయగా నవ్వేస్తే చాలా భయాలు పోతాయి

భయపడ్డమునేదానికి బిడ్డ సిగ్గుపడాలి. కాని ఆ సిగ్గువల్ల భయం పోవాలిగాని, సిగ్గుపడి భయాన్ని దాచుకోకూడదు. బిడ్డ ధైర్యం చూపినప్పుడు పెద్దవారు 'ఎప్రిసియేషన్' చూపాలి వూరికే తన భయాలతో, బాధలతో పెద్దవాళ్ళ సానుభూతిని చూపుతో వుండాలనే ఆశని బిడ్డనించి తొలగించడం ముఖ్యం. దెబ్బతగిలి బాధపడితే, వోర్చుకోవాలని చెప్పాలి గాని బిడ్డతో కూడా పెద్దలు అబ్బో అని అధైర్యపడకూడదు. బిడ్డ బాధపడుతున్నంతసేపూ పెద్దలు వెంట బాధపడుతో, వోదారుస్తో కూచోకూడదు.వోదార్పులు పూర్తిగా అన్ని విషయాలా మానాలి. బాధపడే బిడ్డకై పెద్ద వాళ్ళ హృదయాల్లో బాధ వుంటుంది. కాని కనపరచకూడదు. బిడ్డ తనే యేడ్చుకుని, తనే మాన్పుకుని తిరగాలి. "యింతేనా ? దీనికే ఏడుస్తారా ? లే. పరిగెత్తు" అనాలి. దెబ్బకి కట్టూ అదీ కట్టవలసివస్తే, డాక్టరు కట్టినట్టు కట్టేసి, పోయి ఆడుకోమనాలి. ఆ దెబ్బ మరిచిపోయేటట్టు ఆట కల్పించవచ్చు. ఆ బాధతో బిడ్డ ఏడ్చినా, న్యూసెన్సు కాకండా వేరే యెక్కడన్నా ఏడవాలి. పెద్దవాళ్ళకి దెబ్బతగిలినా, తేలుకుట్టినా అంతే, బిడ్డని 'చూడమ్మా' నాకెంత దెబ్బతగిలిందో ! నాకెంత జబ్బు చేసిందో ! అని జాలిపొందించి ప్రేమ లాగాలని ప్రయత్నించకూడదు. బిడ్డకి జబ్బుగావున్నా అంతే. మందిచ్చి వచ్చెయ్యాలి. దగ్గిర కూచోడం, ఆదుర్దా పడడం, యెత్తుకోడం చాలా తప్పు.

భయం లేకుండా పనిచేసే అవసరంగల పనులు, భయం పోగొడ తాయి. బైస్కిలెక్కడం, పట్టాలమీద నడవడం, దూకడం చెట్లెక్కడం. యీదడం, ఎన్కరేజి చెయ్యాలి. భయం పోగొట్టడానికి బడి మంచిది; కాని పిల్లల్ని కొట్టే బడికి పంపితే భయాలెక్కువౌతాయి. మంచి బళ్ళో పిల్లల భయాన్ని తక్కిన పిల్లలు ఒక్క నిమిషంలో పోగొడతారు. ఆ పిల్లలు వెక్కిరిస్తారనన్నా భయాలు వొదిలించుకుంటారు.

ఆడపిల్లలకీ యింతే. ఆడవాళ్ళు భయపడడం సహజమనీ, అంద మనీ చెప్పి సిగ్గూ, పాతివ్రత్యమూ ఈ పేర్లతో భయాలు స్త్రీలకి నేర్పి వారిని తమ అధీనం చేసుకున్నారు మొగవాళ్ళు. మాటల్లోకూడా ఆడదాని మల్లే భయపడతావేం ?' అంటారు అవన్నీ నశింపచెయ్యాలి.

పెద్దవారియెడల, దేవుళ్ళ యడల, గురువుల యడల, నరకం యడల, భర్తయడల, పాపంయడల వున్న యిప్పటి భయమంతా భక్తిగా మారనన్నా మారాలి, పోనన్నా పోవాలి. ఈ చిన్నప్పటి భయాలే. లోకం లోని ఈ మూర్ఖానికీ, బానిసత్వానికీ క్రూరత్వానికీ కారణం. కనక భయాలను నిర్మూలం చెయ్యగలిగితే ప్రపంచం యింతకన్న చాలా ఆరోగ్యవంత మౌతుంది. ప్రజల స్వభావాలూ యింతకన్న చాలా ఔన్నత్యాన్ని పొందుతాయి.

భయం వల్లనే అనేక నీచత్వాలు జరుగుతాయి. తిట్లని, దెబ్బల్ని, దెయ్యాల్ని, ఆపదల్ని, రోగాల్ని, అధికారుల్ని, చావుని, పోలీసువాళ్ళని, నరకాన్ని, కాషాయిబట్టల్ని, పెద్ద గడ్డాల్ని, పెద్దకోట్లని, కర్రల్ని, అరుపుల్ని, తలగుడ్డల్ని-దేన్ని చూసినా భయమే. ఎన్నడూ రావి, జరగని ఆపదలు వచ్చినట్టే తలచుకుని భయాలతో వొణుకుతో, ఏడుస్తో జీవి తాంతం గడిపేవారు వేనకువేలు. కొత్తమార్పు, కొత్త అభిప్రాయం అన గానే గజగజ వణికేవాళ్ళు కోట్లకొలది. కొన్ని పిట్టల అరుపులూ, చీకటీ, పురుగులూ, గాలీ-వీటిని చూసికూడా భయమే. భయంతో తప్పు నీతినీ,

సన్మార్గాన్ని బోధించడం చాతకాని అవివేకులు తెచ్చి పెట్టిన అనర్థం యిదంతా. నరకమూ, భయంకరమైన దేవతలూ, కసితీర్చుకొనే దెయ్యాలూ, ఇదంతా వాళ్ళ జాడ్యపు మెదడులో పుట్టిన కుళ్ళే.

బిడ్డల్ని శిక్షణలో పెట్టడం చాతగాక పెద్దవారు భయాలు నేర్పుతారు. అదుగో "బూచి" అనేది ముఖ్యం. దొంగలు, టీకాలు, పోలీసులు, దెబ్బలు, బిచ్చగాళ్ళు. పిల్లి-వీటినన్నిటినీ ఉపయోగిస్తారు. పిల్లల్ని వూరుకోపెట్టేందుకు— అదిగో "బూచి" అన్న ముసలమ్మనల్లా విచారణ లేకుండా వురితియ్యాలి, యీ లోకం బాగుపడాలంటే. ప్రభుత్వం వారా పని చెయ్యకపోతే వూరివారన్నా వాళ్ళని వూళ్ళోనించి తరిమెయ్యాలి.

శిక్షణకోసం పెద్దవారు పిల్లల్ని దెబ్బలతో, కేకలతో భయపెడతారు; అది ఇంకో తప్పు. శిక్షణ ఆటవలె జరగాలి. ఆజ్ఞలతో జరగకూడదు. బిడ్డకి పెద్దవారిని చూసినా సుతరామూ భయం వుండకూడదు. పెద్దవారిమీద చిన్నప్పటి భయమే పెద్దయినా బిడ్డని బానిసగా మారుస్తోంది. ముఖ్యం దెబ్బల భయం.

ఈ భయాలు ముఖ్యంగా ఆడపిల్లలకి యెక్కువ. ఎందుకు? ప్రపంచజ్ఞానమే తక్కువ గనక. గ్రహణాలూ, తోకచుక్కలూ, చీమలూ, రైళ్ళూ అన్నీ భయాలే. ఇవన్నీ నిర్మూలమైతే గాని దిక్కూ, సౌఖ్యమూ, వుండవు ప్రజలకి.

(అదిగాక. బిడ్డల క్షేమంకోసం పెద్దవారు తమ భయాల నన్నిటినీ బిడ్డకి ప్రసాదిస్తారు. రైలొస్తూవుంటే పదిగజాల దూరానికి బిడ్డని లాగడం, కాలవనీళ్ళలో కాలు పెట్టనీకపోవడం, అగ్గిపుల్ల గీస్తే యిల్లు తగలపడ్డట్టు అరవడం, చీకటిపడితే అదుర్దాపడడం, పక్కల్లో పడుకోబెట్టుకోడం, తిండి తినకపోతే, ఏడిస్తే అదుర్దాపడడం, జ్వరం రాగానే, వేలు తెగగానే బిడ్డ చచ్చినట్టు ఏడవడం ఇవన్నీ పెద్దవారిలో దుర్గుణాలు.)

బిడ్డ ఏ వస్తువన్నా పాడుచేస్తోన్నా, ఏదన్నా అపాయంలోకి వెడుతోన్నా చప్పున పెద్దవారు అరిచి, బిడ్డని హడలకొట్టకూడదు. ముందు పెద్దవారు తమ భయాన్నీ, ఆదుర్దానీ అణుచుకుని తీరాలి.

# నీతి

బిడ్డను నీతి ప్రపంచంలో పెంచాలి. అవినీతీ, దుర్మార్గమూ, వక్రమూ దూరాన వుంచడంవల్ల నీతియుక్తమైన అలవాట్లే యేర్పడతాయి. బిడ్డకు ప్రలోభనము కలిగే పరిస్థితులూ, చెడ్డపనులూ చెయ్యవలసిన అవసరమూ సాధ్యమైనంత వరకు కలుగచెయ్యకూడదు. శిక్షిస్తారనే భయం లేకపోతే అబద్ధమాడదు. అడిగింది యిస్తే దొంగిలించదు. అట్లానే.

బిడ్డ దుర్మార్గంగా మొదట్లో ప్రవర్తించినప్పుడు యెప్పుడూ ఖండించకూడదు. ఎందువల్ల అట్లా చేస్తుందో నిదానించి చూడాలి. ఆ తప్పుపని ఏదో పొరపాటులాగు చూడాలిగాని పాపమనీ, ఘోరమనీ చూపువల్లా మాటవల్లా తెలియచెయ్యకూడదు. తలితండ్రుల్ని పడకగదిలో రాత్రులు చూసి, అది తామకూడా ఆడేవాళ్ళున్నారు పిల్లలు. అది ఘోరంగా అనుకొని దండించారా, బిడ్డకి ఆ అలవాటు తప్పకుండా యేర్పడిందన్నమాటే. దండనవల్ల యేమీ లాభంలేదు. దేవుడికి కోపమనీ నరకమనీ బెదిరించి బిడ్డ ఏ పని చేసినా, బిడ్డనే బెదరకొట్టకూడదు.

“ఇట్లా చేశావేం ? ఛా ? అట్లా కాదు” అనాలి. ఎట్లానో చెప్పాలి. చూపాలి. అంతే. “ఇంత ఘోరం చేశావే !” అని పెద్దవారన్నారా, నేనే కదా యింత ఘోరం చెయ్యగలిగాను ! చాలా గొప్పదాన్ని. మళ్ళీ గొప్పతనం వహిద్దా మనుకుంటుంది బిడ్డ. నరకం, పాపంచెప్పి బెదరకొట్టారా వాటి సంగతే ఆలోచించుకుని భయపడి, ఆ అలవాటులోనే పడుతుంది. చెడ్డపనులనుంచి మనసు తప్పించాలి; వాటిని చేసే అవసరాన్ని తొలగించాలి.

బిడ్డకి నీతి నేర్పాలని ప్రయత్నించే పెద్దలు బిడ్డ స్వభావంలో విశ్వాసముంచడం చాల అవసరం. బిడ్డ యెప్పుడూ మంచిగా వుండడానికే ప్రయత్నిస్తుంది. దుర్నీతి అనగా, అల్లరనగా, నీతీ మంచితనమూ లేని లోపమని గ్రహించాలి పెద్దవారు. చెడ్డతనమూ, మాయాఅశాశ్వతము. బిడ్డ తన శక్తిలో తాను విశ్వసించాలి. అందుకోసం పిల్లలతో మంచి గుణాల సంగతే మాట్లాడాలి.

"నువ్వు చెడ్డవాడివి, అల్లరివాడివి, దొంగవు" అనకూడదు. "అది మంచివాడు చేసేపని కాదు. నువ్వు మంచివాడివి" అనాలి. "సీ ఖర్మం. నీ గుణమే అట్లాంటిది" అని అధైర్యపెట్టకూడదు. ఎన్నిసార్లు తప్పు పని చేసినా, బిడ్డ ఆ పనికన్న అతీతుడని తెలుసుకొని "ఈసారి ప్రయత్నించు. తప్పదు. నువ్వు సన్మార్గానికి రాగలవు" అనే ధైర్యమూ, విశ్వాసమూ ఇవ్వాలి. తప్పుపని చేస్తే పెద్దవారు ఆశ్చర్యపడి "ఇదేమిటి యింత పొరపాటు చేశావు? నీవంటిది చేసేపని కాదే!" అనాలి.

బిడ్డలను సన్మార్గంలో వుంచాలని, యితరులతో పోల్చి 'చూడు, సోమనాథం ఎంత మంచివాడో' అనకూడదు. 'ఇట్లా చేస్తే అందరూ నవ్వరూ? అందరూ ఏమనుకుంటారో, అని బిడ్డ ప్రవర్తన ఇతరుల అభిప్రాయాలమీద ఆధారపరుచుకోవడం. నేర్పడం చాలా తప్పు. ఈ అలవాటు వల్లనే యీ కాలపు ప్రజలు స్వంత అభిప్రాయ లనేవే లేక, నీతికి దుర్నీతికీ విచక్షణను ఎరుగనే ఎరుగక, తక్కినవారు మంచిదనేదాన్ని తాము అనుసరిస్తో, అంతరాత్మల్ని చంపుకుని తిరుగుతున్నారు. బిడ్డ అట్లాంటి అవస్థలో పడకండా కాపాడడం తలితండ్రుల విధి. తనకు మంచిదని తోచడంచేతనే, తన స్వబుద్ధిని వుపయోగించి తన నడవడిని నిర్ధారణ చేసుకోవాలి బిడ్డ.

చివరికి 'నాన్నకి కోపమొస్తుందమ్మా' అని కూడా అనకూడదు. ఆ పనిమీద విశ్వాసంచేతనే చెయ్యడం నేర్పాలి బిడకి. సత్పురుషులనూ,

సదాశయాలనూ, సత్కథలనూ, సన్మార్గాలనూ చెప్పి చూపాలి. కాని వాటి ప్రకార మాచరించాలని బలవంత పరచకూడదు.

ఉదాహరణ — ఇతరుల తప్పుల్ని క్షమించడం వుత్తమ గుణమని చెప్పాలిసిందే. ఇంకొక పిల్ల కొట్టినప్పుడు క్షమించమని చెప్పాలి. కాని క్షమించి తీరాలని బలవంతం చెయ్యకూడదు. బలవంతంగా సన్మార్గంలోకి తిప్పడంకంటే దుర్మార్గంలో వుండనిస్తే మంచిది. సన్మార్గాన్ని బిడ్డకి అన్ కాన్షస్‌గా అలవాటు చెయ్యాలి. కాని బిడ్డ స్వభావం దుర్మార్గానికి యీడ్చి నప్పుడు పెద్దవారు సన్మార్గంలోకి బలవంతపరచకూడదు. బిడ్డకి దుర్మార్గానికి స్వేచ్ఛనిచ్చి. అది మనస్ఫూర్తిగా సన్మార్గాన్ని ప్రేమించి, అదే యిష్టపడి ధర్మ మాచరించేట్టు చెయ్యాలి.

వూరికే వుత్త ధర్మాలను బోధించి వుపన్యాసా లియ్యకూడదు. ఆటల మూలకంగా అలవాట్లు నేర్పరచి, దురలవాట్లను తొలగించి కొంచెం పెద్దది కాగానే ఆ అలవాట్లలో వుండే ధర్మాలను తెలియచెయ్యాలి. తప్పు చేసినప్పుడు అదెట్లా తప్పో చూపాలిగాని, వుత్తప్పుడు తప్పుల సంగతి బోధిస్తూ కూచోకూడదు. తప్పుచేస్తే ఆ తప్పు సంగతే మాట్లాడాలిగాని, అదే సమయమని సమస్తధర్మాలూ, బిడ్డ యెప్పుడో చేసి మరిచిన దుర్మార్గాలూ యేకరు పెట్టకూడదు.

పెద్దవారు బిడ్డకి బోధించేదానికి వ్యతిరిక్తంగా తామే నడుచుకున్నారా యీ నీతి శిక్షణ అంతా సంపూర్ణంగా వృధా. బిడ్డని వ్యయం చెయ్యవద్దని పెద్దవారు డబ్బు వ్యయంచేస్తే, అబద్ధ మాడవద్దని బిడ్డని శిక్షించి తామే అబద్ధమాడితే(బిడ్డతోనైనా సరే యితరులతోనైనాసరే) అసలు బిడ్డకి నీతి శిక్షనివ్వడం వొదులుకోడం మంచిది. బిడ్డ పెద్దవారిని అప్పుడు కపటులని అన్నా అనుకోదు. తనకో నీతిచట్టమూ, పెద్దవారికో నీతిచట్టమూ యేర్పరచుకున్నారనే కోపమన్నా కలిగివుండదు. పెద్దవారు చేసే పనులన్నీ పిల్ల తప్పకుండా కనిపెట్టగలదు. దానికి తెలీదనుకోడం గొప్ప పొరపాటు.

దుర్నీతిపరురాలేగాక, ఒకటి బోధించి ఒకటిచేసే కృత్రిమురాలుగా తయా రవుతుంది. ఇంక తప్పనిసరైనప్పుడు "నేను అబద్ధాలాడతాను. చెడ్డవాణ్ణే; లోకంలో విధిలేక పచ్చింది; అంతకన్న నాకు చాతకాలేదు. కాని అది మంచిపని కాదు. నువ్వు నాకన్న మంచిదానివి కావాలి"—అని పెద్దవాళ్ళు అనడం కొంతవరకు పనిచెయ్యొచ్చు.

ఒకవేళ బిడ్డ లౌకికురాలు కావాలనీ, ప్రపంచంతోబాటు అబద్ధాలూ, దొంగతనాలూ, మోసాలూ, ఇవన్నీ వీలైనప్పుడల్లా యితరులు పట్టుకో కండా చెయ్యొచ్చుననీ పెద్దవారి అభిప్రాయమైతే అట్లానే బోధించాలి గాని, అలివిగాని ఆదర్శాలను బోధించకూడదు.

వీలైనంత గొప్ప ఆదర్శాలను తమ ప్రవర్తనవల్ల పిల్ల దృక్ప థంలో వుంచాలి. పెద్దవారు వాటి ననుష్ఠించడానికి ప్రయత్నించాలి. అప జయం పొందితే అపజయం వొప్పుకొంటో వుండాలి.

లోకంలో ఆచరణలో వున్నవాటికన్న వున్నతాదర్శాలను బోధిస్తే పిల్ల వ్యర్థురాలు కావొచ్చు: కాని లోకంలోని సాధారణ శుష్క-జీవనుల వలె నిరర్థకంగా బతికి డబ్బు సంపాయించి, కీర్తి పొందడంతో సంతుష్టి పడడంకంటే ఈ గొప్ప ఆదర్శాలతో అపజయం పొందడమే వుత్తమం.

# వ్యక్తిత్వం

ఇతరుల పొగడ్తలకుగాని, హాస్యానికిగాని, నిందలకుగాని లక్ష్యంచెయ్యక, పిల్లతనకు మంచిదనితోచిన పనులనే చెయ్యడం నేర్వాలి. మరీ చిన్నతనంలో ఏ విషయంలోనూ బిడ్డకు స్వతంత్రాభిప్రాయాలు వుండవు. అప్పుడు పెద్దవారి అభిప్రాయాల ప్రకారమేబిడ్డని వుంచవొచ్చు. కాని రెండోయేడు వొచ్చేటప్పటికే బిడ్డకి స్వతంత్రాభిప్రాయాలు బైలు దేరుతాయి. అప్పుడు వీలైనంతవరకు బిడ్డ తన స్వంత అభిప్రాయాల ప్రకారమే నడుచుకునేట్టు చెయ్యాలి. అవి తప్పూ, హానికరమూ ఐనాసరే. పెద్దవారు తమ అభిప్రాయాలనూ, అనుభవాలనూ పిల్లలతో చెప్పాలి. కాని అది వాటిప్రకారం వుండడానికి వొప్పుకోకపోతే వూరుకోవాలి. దాన్ని బలవంతం చెయ్యకూడదు, లోకం అభిప్రాయాలుకూడా లక్ష్యపెట్ట వద్దని సలహా యివ్వాలి. బిడ్డ చీమల్ని చంపుతోంది. పెద్దవారు అభి ప్రాయం ప్రకారం చంపడం మంచిదికాదని చెప్పవచ్చు. "పాపం. వాటికి యెంతనొప్పి !" అని అనవొచ్చు "యెందుకు చంపుతావు? చంపితే నీకేం లాభం?" అని అడగవొచ్చు. పెద్దవారు తమ అభిప్రాయాలకు కారణాలు చెప్పవచ్చు. బిడ్డతో 'అగ్ఘ్యా చెయ్యాలి అని చంపవద్దని ఆజ్ఞాపించకూడదు. మాట వినకపోతే శిక్షించకూడదు. తన అభిప్రాయం మార్చుకునే సంగతి బిడ్డకే వొదలాలి. అభిప్రాయం మారితేనేగాని, యితరుల కొరకు గాని, తలిదండ్రులకొరకు గాని ఆచరణ మార్చుకోవద్దని సలహా యివ్వాలి. బిడ్డ చీమల్ని చంపుతోవుంటే, యితరులు "తప్పుతప్పు" అంటారు. కాని వాళ్ళ మాటల్ని నిర్లక్ష్యంచేసి చంపమని చెప్పాలి. యితరులు బిడ్డజోలికి

వస్తే పెద్దవారడ్డుపడాలి. ఈ లోపల చీమలు వస్తున్నాయే అంటే, చీమల ప్రాణాలమీద యీ పెద్దవారిని యెవరన్నా కాపలిపెట్టారా? ఇంకో స్నేహితులు చంపుతోవుంటే ఏంచేస్తారు? మతవిషయమైనా, నీతి విషయమైనా కూడా యింతే. వినాయక పూజ చెయ్యనని పిల్లవాడంటే, లేక మసీదుకు వెడతానంటే వద్దనడానికి పెద్దవారికి అధికారం లేదు. ఇతరుల మాటల ప్రోద్బలంచేత చేస్తున్నా, పెద్దవారు తమవేపు ప్రోత్సహించవలసిందే గాని, అడ్డుపెట్టకూడదు.

(చేసిన కార్యంవల్ల వొచ్చే ఫలితాన్ని అనుభవించడమే బిడ్డకి శిక్ష. యింట్లోకి వొచ్చిన స్నేహితుల్ని అల్లరిచేస్తాడు. వారు పెద్దవారి అతిధులుగనక పిల్లవాణ్ణి తలిదండ్రులు లాటంక పెట్టవొచ్చు. వీధిలో మనుషులతో తగూలాడతారు. వాళ్ళే తంతారు. సరిపోతుంది. వాళ్ళువొచ్చి పెద్దవారితో చెపుతారు. పిల్ల యేదో తెలియక చేశానంటే, సర్దివెయ్యవచ్చు. కావలసి అది సరైన కార్యమనుకుని చేశానంటే, "సరే మీ యిష్టం దాన్నేమన్నా చెయ్యండి" అని ఆ కొత్తవాళ్ళతో అనాలి. కాని కొన్ని విషయాల్లో యిట్లా ఆగి ఆలస్యం చెయ్యడానికి వీలుండదు. విషంత్రాగి చూస్తానంటాడు. యితరుల తల బద్దలుకొట్టడమో, యిల్లుకి నిప్పంటించడమో చేస్తూవుంటే అడ్డుపెట్టి తీరాలి, కాని వీలైనంత వరకు అతనికి స్వేచ్ఛ నివ్వవలసిందే.) ?

బిడ్డ తండ్రిమాట వినక యేదన్నా పనిచేస్తే, నీ పట్టు గెలుస్తుందో నా పట్టు గెలుస్తుందో చూద్దాం—అనేట్టు చేసి, అతని నిశ్చయశక్తిని ధ్వంసం చెయ్య చూడకూడదు. అప్పటికాపని చెయ్యనిచ్చి, ఆ పని అలవాటు కాకుండా. దానిని మాన్పడానికి వేరే మార్గా లాలోచించాలి. వేరే పనులు కల్పించాలి.

బిడ్డవాస్తవ్యలూ, అతని అవసరాలూ, అతని పనులూ-అన్ని దాన్నే నిర్ణయించుకోనియ్యాలి. ఏ విషయమన్నా "యేం చెయ్యాలి ?" అని పెద్ద వారి ననడిగితే 'నువ్వే యోచించుకో' అనాలి.

తనకి స్వతంత్రముందికదా అని బిడ్డ యితరుల స్వతంత్రాని కడ్డం రాకూడదు. వొచ్చాడా బిడ్డ స్వాతంత్రం ఆ నిమిషానికి తీసెయ్య వొచ్చు.

పెద్దవారి కాలమూ, సౌఖ్యమూ, వారి పనులూ — వీటిలో జోక్యం కలగజేసుకుని, వారిని యిబ్బంది పెద్దడానికి బిడ్డకేమాత్రమూ అధికారం లేదు. బుద్ధి తెలిసినప్పటినుంచీ, బిడ్డ తనొక వ్యక్తినని, తనకు యింట్లో తక్కినవారిమల్లేనే రైట్సు వున్నాయనీ, కాని యితరుల స్వేచ్ఛని ఆటంకపరచడానికి తనకి 'రైట్స్' లేదనిన్నీ తెలుసుకోవాలి. ఇప్పుదేమి టంటే, పురుషుడికి సర్వాధికారమూ, తరవాత యెదిగిన కుర్రవాళ్ళకీ, తరవాత తల్లికీ, చివరికి కూతుళ్ళకీ యీ ప్రకారం తారతమ్యం వుంటోంది. ఇట్లాంటి ఆధీనతనించిస్త్రీలూ, పిల్లలూ తిరగబడాలి. ఇప్పుడు స్త్రీలకూ, పిల్లలకూ, అన్యాయం జరుగుతోందా ? అనే ప్రశ్న అఖ్ఖర్లేదు. ఇట్లాంటి భేదాలు అనారోగ్యం. ఇల్లు ఒక కో — ఆపరేషన్, అందరికీ సమానమైన రైట్సువుండి అందరూ కలిసివుండే సహకార సంఘంలా గుండాలి.

ఇప్పుడు సాధారణంగా అన్ని యిళ్ళల్లోనూ, కొంతకాలం బిడ్డ చాలా ఘనంగా చూడబడి పెద్దవారిమీద సర్వహక్కులనూ చలాయించ డమో, లేక పెద్దవారి కారణమూ అర్థమూలేని ఆజ్ఞలకి లోబడి, తుచ్ఛ జీవనం గడపడమో సంభవిస్తోంది.

పిల్లలకు అర్థహీనమైన గుడ్డి విధేయత నేర్పకూడదు. పిల్లలకి పెట్టే ఆజ్ఞలు ఎందుకు అవసరములో ఎప్పటికప్పుడు వారికి తెలియచేస్తో వుండాలి. యెవరి ఆజ్ఞను ప్రశ్నించడానికి వీల్లేదో అట్లాంటి అధికారిపలె

గాక ఒక ఆటలా అధికారాన్ని తక్కినవారు అనుజ్ఞచేత పొందిన నాయకుడివలె వుండాలి. తల్లిగాని, తండ్రిగాని అందరూ కలిసి కుటుంబ నిర్వాహకం చెయ్యాలి గనుకనూ, ఒకరు నాయకత్వం వహించకపోతే యీ సంచారలీల జరగదు గనుకనూ, అనుభవశాలియైన జనని నాయకురాలై నట్టుండాలి. ఇంటి నియమాలు పిల్లలేగాక పెద్దవారూ పాటించాలి. బిడ్డ టోపీ కొనిపెట్టమంటే అనవసరమని చెప్పి తండ్రి తను అనవసరంగా సిగరెట్లు కాల్చకూడదు.

పొద్దస్తమానం 'అది చెయ్యకు, చప్పుడు చెయ్యకు. ఆ బల్ల ముట్టుకోకు, అట్టాకూచో', అనే ఆజ్ఞలతో బిడ్డ ప్రాణాలు తియ్యకూడదు. బిడ్డ చేస్తోన్న అక్రమమైన పనులు చూసి, జ్ఞాపకముంచుకుని సరైన అలవాట్లద్వారా దానికి తెలీకండానే, దానితో చెప్పకండానే వాటిని కుదర్చాలి. బిడ్డ చీమిడి వొంటికి రాసుకుంటోవుంటే అట్లా రాసుకోవద్దని చెప్పి ప్రయోజనం లేదు. చేతిరుమాలిచ్చి దాంతో తుడుచుకునే అలవాటు సభివృద్ధి చెయ్యాలి.

తప్పు ఆజ్ఞ పెట్టినప్పుడు బిడ్డని క్షమాపణ వేడుకోవాలి. "చలిగా వుంది. బైటకి వెళ్ళకు" అని బిడ్డనన్న తరవాత చలిగా లేదని తెలిస్తే తన పొరపాటుని వొప్పుకోవాలి తల్లి.

ఇట్లా బిడ్డకి నీతిని నేర్పడం సులభమైన పనికాదు. సదా సాధ్యం కాదు. అప్పుడప్పుడు కఠినంగా అడ్డపెట్ట వలసి వస్తుంది. కాని సాధ్యమైనంత వరకు యీ పద్ధతుల్ని అవలంబించాలి.

# స్వార్థం

స్వార్థం ఒక బలీయమైన "యిన్‌స్టింక్టు." అది జీవితానికి చాలా అవసరం కూడాను. అది మితిమీరనూ కూడదు, నశించనూ కూడదు బొమ్మలూ, ఫలహారాలూ, సౌఖ్యాలూ అన్నీ తనకే కావాలని అనుకోడం బిడ్డకి సహజం. పెద్దవాళ్ళు తన సంగతే చూడాలనీ, తననే ప్రేమించాలనీ అంటుంది. తనకి అన్నీ కావాలనుకోడం తప్పుకాదు. కాని యితరులకి కూడా వుంటే వోర్వలేకపోవడం, యితరులవీ-తనవీ, అన్నీ తనకే కావాలనుకోడం, ఇతరులతో పంచుకోలేక పోవడం-యివి తప్పు. తా ననుభవించడంకోసం బిడ్డ సౌఖ్యమూ, వస్తువులూ కోరడం యే మాత్రమూ తప్పుకాదు. తనను నిరాకరించుకునే, తృణీకరించుకునే వేదాంతం ఆత్మనాశనానికి హేతువు. తను అనుభవించాలి, ఆనందించాలి కాని యితరుల అనుభవం, ఆనందం, ఆ స్తి తనకి కావాలనీ, వారికి వుండకూడదనీ కోరకూడదు.

బిడ్డలోవున్న స్వార్థాన్ని చంపకూడదు. అది సహజం. వుపయోగకరం. అసలు అది చావదు. దాన్ని చంపాలని బిడ్డని శిక్షిస్తే, అది యెక్కువవుతుంది. స్వార్థం జీవనశక్తి; అది నశిస్తే మనుష్యశక్తి నశించిందన్నమాటే. స్వప్రేమని — సంకుచితంగా వున్నదాని — యితరుల యెడల విస్తీర్ణత పొందేట్లు చెయ్యాలి. ముందు యితరుల యెడల బిడ్డ జరపవలసిన న్యాయమూ, వారి అభిప్రాయాలకూ, పనులకూ స్వాతంత్ర మివ్వడమూ నేర్పాలి. ఎంత వారిలోకూడా స్వప్రేమ చావదు. ఆ ప్రేమ యెంత అధికంగా వుంటే అంత గొప్పవారవుతారు. క్రమంగా ఆ

స్వ(ప్రేమలో యితరుల్ని చేర్చుకోవాలి. వారివారి స్వభావాన్నీ, శిక్షణనూ పట్టి లోకంలో కొంతకొంత భాగాన్ని ఆ (ప్రేమ విశాలత్వంలోకి చేర్చు కుంటారు. కొందరు తమ కుటుంబాన్ని మా(త్రమే, కొందరు తమ వూరి వాళ్ళనే, కొందరు తమ (ప్రాంతాన్నే, కొందరు తమ దేశాన్నే యీ విధంగా (ప్రేమిస్తారు. కనక ఆ (ప్రేమను ఎక్కువచేసి విస్తీర్ణ మయ్యేట్టు చెయ్యాలి.

ముందు తనను (ప్రేమించుకోనివాడు లోకంలో యెవరినీ (ప్రేమించ లేడు. ఈ స్వార్థాన్ని చంపాలని పెద్దవారు (ప్రయత్నించడంవల్లనే చివరికి బిడ్డ తన సౌఖ్యాన్ని కూడా కోరుకోడం, అనుభవించడం చాతగాక, యే డబ్బునో, మర్యాదనో, యితరుల అభి(ప్రాయాన్నో తన దృష్టిలో నిలిపి ఆ క్షు(ద్రపదార్థంకోసం. తన ఆనందాన్నంతా ధ్వంసం చేసు కుంటుంది. సౌఖ్యపడే వాడెవ్వడూ ఇతరులను ద్వేషించడు. ఇతరుల మీద యీర్ష్యపడడు. అన్ని సౌఖ్యాలూ వుండి అనుభవించడం చాతకాక, లేనిదానికోసం యేడ్చేవాళ్ళనీ, తమకు లేనిదాన్ని దేనినో కలిగివున్న వాళ్ళని చూచి యేడ్చేవాళ్ళనీ చూస్తోవుంటాము, అనేక మందిని. వూరికే సంపాయిస్తో, కష్టపడుతో, చీదరించుకుంటో, తిట్టుకుంటో, చివరిదాకా సంపాయించి, అనుభవించడం తెలీక, అట్లానేచచ్చేవాళ్ళని చూస్తున్నాము.

కనక ముందు తనకి వున్నదానిని తన ఆనందంకోసం వుపయో గించుకోటం నేర్పాలి. బిడ్డదికాని దొంగ ఆదర్శం బిడ్డముందు పెట్టడం వల్లనే ఇన్ని అనర్థాలు సంభవిస్తాయి.

జీవితానికి మూలసూ(త్రం ఆత్మానందం. ఆ ఆనందాన్ని సంపాయించుకోడం నేర్పాలి. ఇతరులకి కష్టం కలిగించకుండా, తనకి అనారోగ్యం కాకుండా ఆనందం సంపాయించే నేర్పుని నేర్పాలి. తరవాత (క్రమంగా తన సంగతి మరిచిపోయి ఆటలలో, పాటలలో, సంస్థలలో కలిసి సంపాయించగల ఆనందాన్నీ: యితరులకి ఆనందం కలి

గించీ, కష్టం తొలగించీ తెచ్చుకునే ఆనందాన్నీ: తన ఆనందాన్ని త్యజించడంవల్ల కలిగే ఆనందాన్నీ బిడ్డకు రుచి చూపవొచ్చు. కాని కొందరు బిడ్డలు ఎన్నడూ అట్లాంటి ఔన్నత్యాన్ని నేర్చుకోరు; చాలామంది పెద్దలకీ నేర్పడమూ చాతకాదు. ముందు ఈ పెద్దలకి అర్థమైతేగా! అట్లాంటప్పుడు ఆ బిడ్డకి సుఖంగా తను అనుభవించడం నేర్పడం మంచిది. కాని తమకీ, బిడ్డకీకూడా చాతకాని ఆదర్శం ప్రయత్నించి బోర్లపడడం అనర్థడం. అట్లాంటి ప్రయత్నంవల్లనే తమకి చేతకాని ధర్మాలను అందుకోవాలనీ, ఆదర్శాలన్నీ తనలో వున్నట్టుగా నటించాలనే ప్రయత్నం వల్లనే ప్రజలు యితరులకి ఆనంద మివ్వటంలేదు సరికదా, తామూ అనుభవించే శక్తిని పోగొట్టుకున్నారు.

చుట్టూ, ప్రతిచోటా ఆనందం వుంది. అనుభవించడమే చేత కాదు ప్రజలకి.

ముందు బిడ్డకు యివ్వవలసిన హక్కులు పెద్దవారివ్వాలి. వారు స్వార్థం త్యజించాలి. ముఖ్యంగా బిడ్డ విషయమై, తన హక్కుల్ని అనవసరంగా త్యజించకుండా బిడ్డకి అనుభవించడం నేర్పాలి. పెద్దవారు పిల్లల్నందర్నీ, తమవారినీ, యితరుల్నీ సమానంగా చూడాలి. ఒక ఆటవస్తువుగాని, వుయ్యాలగాని, తినే వస్తువుగాని వుంటే అందర్నీ వరసప్రకారం ఆడించి యితరులతో ఆనందం సమానంగా బిడ్డ పంచుకోడం నేర్పాలి. తమ హృదయంలోంచికూడా పెద్దవారు భేదబుద్ధిని తరిమెయ్యాలి.

అవసరమైనప్పుడైనా త్యాగం చెయ్యమని బిడ్డని బలవంతం చెయ్యకూడదు. త్యాగం చెయ్యమని బిడ్డకు బోధించనుకూడా కూడదు. త్యాగం మంచిదే కాని నేర్పడంవల్ల వొచ్చేది కాదు. అది సహజంగా నిర్వ్యాజంగా వొస్తుంది. నేర్పితే వొచ్చేది కృతక బలవంత త్యాగం. నిజమైన త్యాగం యేమిటంటే, క్షుద్ర సౌఖ్యాన్ని—ఉన్నతసౌఖ్యం కోసం త్యజించడం; తమ బొమ్మతో ఆడుకుంటే వొచ్చే ఆనందాన్ని

యితరులు బొమ్మతో ఆడుకుంటే తనకుకలిగే ఆనందంకోసం త్యజించడం. కనక ఆ ఉన్నతానందాన్ని ప్రేమించే శక్తి నియ్యాలి; ఆ అలవాటుని కలగచెయ్యాలి. జాలి, సానుభూతి, ప్రేమ, నిష్పక్షపాతం-యివి నేర్పాలి. అప్పుడు యితరులకోసం బిడ్డ త్యజిస్తాడు.

కాని బలవంతంగా వెయ్యిసార్లు తనంటే త్యజించేట్టు చేసినా, త్యాగం అలవాటుకాదు. పైగా యెవరికైనా త్యాగం చేసిందో బిడ్డ వారి మీదా, త్యాగం చేయించిన వారిమీదా క్రోధం అభివృద్ధి అవుతుంది. బల వంతంచేసి చందా లాక్కుపోతే-ఆ చందా తీసుకున్న వాళ్ళమీదా, చందా పోగుచేసిన వాళ్ళమీదా యెంత కోపం వొస్తుంది! ప్రాణాలు తీసే బిచ్చ గాడిమీది యెంత ద్వేషం ప్రజలకి!

అనవసరంగా బాధపడమని ప్రోత్సహించడం, దేహాన్నిగాని, మనస్సునిగాని, శుష్కశ్రమలో, డిసిప్లినులో పెట్టడం తప్పు. ఏ గొప్ప భావానికో, ఆదర్శానికో, శ్రమా, బాధా, నిగ్రహమూ ఉపయోగించి సౌఖ్యాన్ని త్యాగంచెయ్యడం మంచిదే. కాని వాటిమీద వాస్తవమైన ప్రేమ వల్ల బిడ్డకా త్యాగం సహజంగా రావాలి. కనక నేర్పవలసింది ప్రేమ. శుభ్రంగా లోకంలోని సౌఖ్యాలన్నీ అనుభవించడం, నిర్జీవ వైరాగ్యం ఆరోగ్యకరం గాదు. ఉన్నతాదర్శం కోసం కాక, అర్థవిహీనంగా దేన్నీ త్యజించ నక్కర్లేదు. అనేక విధాలైన వుత్సాహాలు, భక్తులు, ఆనందాలు, అభినివేశాలు, ఆదర్శాలు కల్పించి, వాటితో బిడ్డని ఐక్యంచేసి, తన స్వలా భాన్ని మరిచిపోయి ఆ సంస్థలలో, 'మూవ్‌మెంట్సు' లో, తన బడికోసం స్నేహితులకోసం, ఆటలకోసం, దేశంకోసం, సంఘంకోసం సేవవించి ఆనందాన్ని పొందేట్టు చెయ్యాలి. లోకాన్ని దానితోవన చావనిమ్మని ముక్కు మూసుకుని తన ఆత్మముక్తిని కోరేవాడికన్న స్వార్థపరుడెవ్వడూ లేడు.

ప్రతి మనిషికీ, ప్రతి కార్యానికీ, ఉద్దేశ్యం తనకి ఆనందం కలక చేసుకోడం. ఎంత బోధించినా, యెంత బాధించినా, ఆ వుద్దేశ్యాన్నించి యెవరూ తప్పించుకోలేరు. దుష్టకార్యాలు చేసేవారూ, తమ సౌఖ్యాన్ని ధ్వంసం చేసేవారూ, తమని తామే బాధపెట్టుకునే వారూ, అందరూ ఆనందం కోసమే వెతుకుతున్నారు. కాని ఆ ఆనందాన్ని పొందే విధం తెలీక, మూర్ఖంవల్ల యీ బాధలలో పడతారు. ముఖ్యమైన తప్పులు రెండు. ఆ నిమిషాన కలిగే ఆనందానికి లోబడి ముందు గొప్ప బాధలను తెచ్చుకోడం. తనకి జబ్బు చేస్తుందని తెలిసికూడా తిని, చాల రోజులు బాధపడడం. రెండో తప్పు— తనకు నిజమైన ఆనందం కలిగించుకోడం వదులుకుని, తను ఆనందంగా వున్నట్టు ఇతరులకు అభిప్రాయం కలిగించ డానికి సకల బాధలూ పడడం. ఉదాహరణం — మర్యాదకోసం, బేషజం కోసం ప్రజలు పడే బాధలు. ఈ రెండు తప్పులు చెయ్యకండావుంటే, ప్రపంచం చాలా బాగుపడుతుంది.

బిడ్డకి తాత్కాలికమైన సౌఖ్యాలనూ, నీచమైన సౌఖ్యాలనూ త్యజించి వున్నతానందాన్ని పొందే మార్గం చూపాలి. దీనికి ఒకటే విధం; ఉన్నతా నందాన్ని పొందగల శక్తినివ్వడమే. అంతవరకు బిడ్డ తన చేతిలోని ఆనందాన్ని త్యజించదు. సృష్టిలోని సౌందర్యాన్నీ, గొప్ప భావాల ఔన్న త్యాన్నీ, ఇతరులమీది ప్రేమను, వీటిలోవి ఆనందాన్ని అనుభవించే శక్తి కలగ చేసినప్పుడే బిడ్డ తాను ఇతరులను బాధపెడితే కలిగే ఆనందాన్నీ, యీర్ష్యవల్లా, అన్యాయంవల్లా, స్కాండల్సు మాట్లాడటంవల్లా, యింద్రియ లోలత్వంవల్ల కలిగే ఆనందాన్నీ త్యజిస్తుంది. వున్నతానందం నేర్ప కండా వ్యర్థంగా త్యజించడంవల్లా; ప్రేమ లేనివారిని త్యాగం చెయ్య మనడంవల్లా; ఉద్దేశ్యం లేకండానే, అనుభవించకండా యింద్రియాల్ని కట్టుకోమనడంవల్లా; బిడ్డ జీవితం వ్యర్థమూ, శూన్యమూ, అర్థవిహీనమై

కోపమూ, ద్వేషమూ, ఈర్ష్యా యెక్కువవుతాయి. ఈ అందమైన ప్రపంచమంతా, ప్రపంచంలో వుండే పుత్సాహమూ, ధర్మమూ, ఆనందమూ, బిడ్డవిగా చెయ్యాలి. ఈ లోకానికి యువరాజై పుట్టినట్టుండాలి. ప్రజలనూ, సృష్టినీ, జీవితాన్ని ప్రేమించి అనుభవించాలి. ఇంకా గొప్పతనాన్ని పొంది లోకాన్నంతా తన ఆలింగనంలోకి తీసుకోవాలనే ఆశ ఉన్నతం కావాలి. అంతేగాని ఇదంతా మాయ అనీ, తనకేమీ సంబంధం లేదనీ, త్వరగా వొదులుకోవాలనీ, సంకుచిత స్వార్థంగా, తన దోవన తను బతికే పందికొక్కుగా వుంచకూడదు బిడ్డని. బడీ, పిల్లలతో ఆటలూ ప్రయాణాలూ, మీటింగులూ, ప్రజా సేవా; దేశసేవా యివన్నీ యీ పద్ధతికి సహాయభూతాలు. ప్రస్తుతం వూరికే పుస్తకాలు చదివించడమూ, స్కూల్లో పడేసి నూరడమూ చేస్తో, తన పొట్టకి తాను సంపాయించుకోడమనేది ఒకటే ఆదర్శంగా వుంచడమూ, లేకపోతే త్వరలో పెళ్ళిచేసి కుటుంబాన్ని పోషించమనడమూ అన్యాయం.

# అబద్ధం

మొదట బిడ్డకి నిజానికీ—అబద్ధానికీ భేదం తెలీదు. కనక తనకి తోచిందల్లా మాట్లాడుతుంది. అట్లాంటప్పుడు వూరుకోవాలి. దాని మాటల్లో అబద్ధాలు యెత్తి చూపనూకూడదు; 'ఎన్కరేజ్' చెయ్యనూకూడదు. చాలాసార్లు బిడ్డ తన భావనాశక్తి నుపయోగించి కథలలాగు జరగనివన్నీ జరిగినట్టే మాట్లాడుతుంది. అప్పుడూ వూరుకోవాలి. ఇట్లాంటి మాటలు మరీ యెక్కువై, అయిదారేళ్ళు వచ్చినా మాట్లాడుతో, నిజం మాట్లాడవలసినప్పుడు కూడా ఆ మాటల్లో బిడ్డ తప్పించుకొంటూవుంటే, పెద్దవారు 'కాజువల్'గా మామూలుగా "అట్టా ఐతే యిట్లా అంటావేం? నువ్వు సరిగ్గా చూడలేదు. సరిగ్గా చెప్పటంలేదు" అనాలి. బిడ్డ కావలసి ఆ అబద్ధం చెప్పినట్లున్నప్పుడు కూడా— మొదట్లో "అట్లా అనాలని యిట్లా అన్నావా? సరిగ్గా మాట్లాడకపోతే నాకెట్లా తెలుస్తుంది? జ్ఞాపకం లేదా? యీసారి జ్ఞాపకముంచుకో?" అనాలి. అబద్ధం చెప్పిందని అనకూడదు, వీలైనంత వరకు.

బిడ్డ అబద్ధాలాడడం కలిగించే పరిస్థితులన్నీ తప్పించాలి; అబద్ధాలాడవలసిన అవసరం కలిగించకూడదు. శిక్షిస్తారనే భయమే అబద్ధాలకు ముఖ్యకారణం. ప్రేమవల్ల పాలించేచోట నిజం చెప్పడానికి భయముండదు. అబద్ధాలకి శిక్షిస్తే యింకోసారి పెద్దవారు కనుక్కోడానికి వీలులేకండా అబద్ధాలాడడం నేర్చుకుంటుంది. అబద్ధాలాడే పరిస్థితులను కలిగించిన తప్పు పెద్దవారు వారిదిగా తీసికొని, శిక్షణాపద్ధతుల్ని సవరించుకోవాలి.

ఎప్పుడైనా సరే పూర్తిగా బిడ్డమాట నమ్మాలి. అనుమానపడకూడదు. 'అబద్ధం. నాకు తెలుసు. నేను చూశాను—' అని గదమాయించ

కూడదు సంపూర్ణంగా బిడ్డ తప్పు తెలిస్తేగాని, బిడ్డని అబద్ధమాడావన కూడదు. యెంతవరకూ బిడ్డమాట నమ్మతోనే వుండాలి.

అన్నిటికన్న ముఖ్యం పెద్దవా రబద్ధాలాడ కూడదు; ముఖ్యంగా బిడ్డతో. అది దేన్ని గురించి అడిగినా, స్పష్టంగా, సరిగా వున్నదున్నట్టు నిజం చెప్పెయ్యాలి. బిడ్డకక్కర్లేని విషయమైే "నేను చెప్పను" అనాలి. ఆతనికి కర్థం కానిదైనా బిడ్డ ప్రశ్నిస్తే చెప్పాలి. కాని వూరికే జోక్యంలేని విషయాలు బిడ్డని ప్రశ్నలు వెయ్యనియ్యకూడదు. కాని పెద్దవారు స్వలాభంకోసం, బిడ్డకు సంగతులు చెప్పకండా దాచడంకాని, అబద్ధాలు చెప్పడం కాని కూడదు. బిడ్డ తను యెట్లా పుటిందో లేక తను జంతువుల్లో చూసిన విషయాలు అడిగినా పెద్దవారు యేమీ తడుముకోకుండా నిజం చెప్పాలి. మతమూ, దేవుడూ, దెయ్యాలూ, స్వర్గమూ, చావూ, పాపమూ వీటిని గురించి అడిగినా, పెద్దవారు యెట్లా నమ్ముతున్నారో అట్లా స్పష్టంగా బిడ్డతో చెప్పాలి. ముందు పెద్దవారు తమ అభిప్రాయా లెటువంటివో నిశ్చయించుకోవాలి. చాలామందికి వాళ్ళ అభిప్రాయాలు నిశ్చయంగా వాళ్ళకే తెలీవు.

బిడ్డతో మాట్లాడేప్పుడు భద్రంగా మాటలు విలువ తెలుసుకుని మాట్లాడాలి. 'చీకట్లో తిరిగితే తేళ్ళు కుడతాయి' అనకూడదు. 'కుట్టవచ్చు' అనాలి. "బహు", "మహా" యిట్లాంటివి జాగ్రత్తగా వుపయోగించాలి. నిజంగా అట్లా ఆకలేస్తే తప్ప నాకు చచ్చేటంత ఆకలేస్తోంది అని అవ కూడదు. బిడ్డని అననీకూడదు, యేదన్నా బిడ్డకు యిస్తానానక ముందు, చేస్తానవక ముందు బాగా ఆలోచించుకుని అనాలి. అన్నారా, మాట నిలబెట్టుకోవాలి. నిలబెట్టుకోలేకపోతే, కారణం బిడ్డకి తెలియచెప్పాలి. బిడ్డని శిక్షిస్తానని బెదిరిస్తే శిక్షించి తీరాలి. బిడ్డ పడ్డప్పుడు నేలని కొడతాలే, అని నేలకి దెబ్బతగులుతుందనే అబద్ధాలు కల్పించి మోసపుచ్చకూడదు.

# సానుభూతి

బిడ్డ స్వతస్సిద్ధంగా తన దగ్గిరివారిని ప్రేమిస్తుంది. కాని సహజంగా ప్రేమించని వారిమీదికి కూడా బిడ్డ ప్రేమని విస్తరింప చెయ్యడానికి ప్రయత్నించాలి. అనాథలు, బిచ్చగాళ్ళు, ఇంటికి వచ్చిన కొత్తవారు, వీరందరితోను బిడ్డకి స్నేహంచేసి, వారికి సంతోషం కలగజేసే ప్రయత్నం చేయించడం మంచిది. ఇతర జాతుల, ప్రజలు, ఇతరకులాలు, బీదలు, వారి వేషభాషలు, కష్టాలు వీటిని గురించి కథలు చెప్పాలి. వాళ్ళ వేషాలు వేయించి బిడ్డచేత ఆడించాలి. ఎప్పుడూ గొప్పవాళ్ళు, రాజుల సంగతేగాక, అధములూ, దురదృష్టవంతులూ అనుకునే వారి సంగతి కూడా విస్తారంగా మాట్లాడడం ఉత్తమం. తన ధనాన్ని, సౌఖ్యాన్ని, ఆటవస్తువులను లేనివాళ్ళకి యిచ్చి, వారి ఆనందంవల్లా, తాను ఆనందపడే విధం నేర్పాలి. ఇతరుల దుఃఖాన్నీ, బాధనీ తొలగించడం కర్తవ్యమనీ, తను ఎవరికీ, దేనికీ బాధను కలిగించకూడదనీ, బిడ్డకి పెద్దవారు తమ ప్రవర్తన వల్లనే చూపగలరు. కథలూ, నాటకాలూ ఒకే సాధనం. అంతేగాని వుపన్యాసాలు వ్యర్థం

ఇతర ప్రాణులమీద గౌరవం కలిగేట్టుకూడా చెయ్యవచ్చు. వాటి జీవనం, వాటి ఆనందం వాటి ఆహారవాంఛ—యివన్నీ కథలలో నాటకాలలో బిడ్డకి తెలియచేసి, పావురాలు, పిల్లులు, కుక్కలు, చేపలు మొదలైన వాటిని పెంచడానికిచ్చి, వాటిమీద ప్రేమ నభివృద్ధి చెయ్యవచ్చు. కాని ఏ జంతువుల్నీ బంధించకూడదు. బాధించకూడదు. అనవసరంగా చంపవలసి వచ్చినప్పుడు (నల్లులు, తేళ్ళు, మొదలైన వాటిని) బిడ్డకి కారణం చెప్పాలి. మృగాల్లో, కీటకాల్లో, తల్లులు బిడ్డకోసం యెంత పాటుపడతాయో, ఒక చిన్న పువ్వుకోసం, గడ్డిపరకకోసం సృష్టి యెంత ప్రయత్నిస్తుందో, జాగ్రత్త తీసుకుంటుందో చూపాలి.

# విద్య

బాల్యంలో పాఠశాలకు వెళ్ళకముందూ, వెళ్ళేప్పుడూ కూడా ఉపాధ్యాయుడుకన్న కూడా, తల్లిదండ్రులు బిడ్డకు జ్ఞానాభివృద్ధి చెయ్యగలరు. విద్య అనగా చదవడమూ, వ్రాయడమూ అనీ, పరీక్షలు పాసు కావడమనీ ఉద్యోగాలు చెయ్యడము అనే అభిప్రాయాలు పెద్దలకూ బిడ్డలకూ పోవాలి.

బిడ్డ ప్రతి వస్తువునీ పరిశీలించేందుకు వీళ్ళు కలుగ చెయ్యాలి. పరిశీలించాలనే కుతూహలం స్వతసిద్ధంగానే వుంటుంది బిడ్డకి. దాన్ని చంపకుండా వుంచేవాలు. షికార్లు—రైళ్ళమీదా, బళ్ళమీదా, పడవలమీదా, ప్రయాణాలూ; ఫ్యాక్టరీలూ, మ్యూజియంలూ, పట్టణాలూ చూడడమూ; యివన్నీ చాలా మంచిది. మృగాల్ని, మొక్కల్ని పెంచేట్టు చెయ్యాలి. యేది చూడాలని పిల్ల అభిలాషపడ్డా, వీలు కలుగజేసి, యింకా ప్రోత్సహించి బిడ్డ కెటువంటి వస్తువులలో, ప్రదేశాల్లో, ఇష్టమో కనిపెట్టి అటువంటివన్నీ చూపాలి.

సంగతుల్ని బిడ్డంతట బిడ్డనే తెలుసుకోనియ్యాలి; పెద్దవారు చెప్ప కూడదు. బిడ్డ అడిగితే, వీలైన సంగతులన్నీ "నువ్వే చూడు. తెలుసుకో" అనాలి. యింక బిడ్డ తెలుసుకోలేనిపైతే, బిడ్డ ప్రయత్నించి తెలుసుకోలేకపోతే చెప్పాలి. బిడ్డ జ్ఞానంకోసం అపాయకరమైన పనులైనా చెయ్యనియ్యాలి. బాధకలిగేవైతే, బాధ కలుగుతుందని ముందు చెప్పడం విధి. అప్పుడూ తనే చూస్తానంటే, చూడనియ్యాలి. వేడిదీపం తాకుతానంటే కాలుతుందనిచెప్పి, అయినా తాకుతానంటే తాకనిచ్చి తీరవలసిందే.

ప్రకృతిశాస్త్రం (సైన్సు)లో బిడ్డకు విశ్వాసం కుదర్చాలి. ప్రతిదీ మనుషులు తెలుసుకోగలరనీ, ప్రత్యక్షంగా ఎక్స్పెరిమెంటు వల్లగాక మూర్ఖంగా నమ్మాలనే సంగతుల్లో చాలా అబద్ధాలుంటాయనీ బిడ్డకి తెలియచెప్పడం మంచిది. శాస్త్రిలూ, మనుష్యులూ, చెప్పడంవల్లగాక, తనంతట తానుచూచి, స్వబుద్ధితో విచారించి తెలుసుకునే అభ్యాసాన్ని కలగచెయ్యాలి. పెద్దవారు ఏదో సంగతిచెప్పి, తాము చెపుతున్నారు గనక, నమ్మమని బిడ్డననగూడదు. తలిదండ్రులు చెప్పినా నమ్మక, తానే స్వబుద్ధి నుపయోగించే అలవాటు వీలైనంతవరకు కెక్కువ చెయ్యాలి.

బిడ్డ ప్రశ్నలు వేస్తుంది. ఒకటే అడగడం. కాని విసుక్కో కూడదు. పనిగావుంటే ఇప్పుడు చెప్పననాలి. చెప్పను పొమ్మనకూడదు. పెద్దవాళ్ళకెట్లా సరైన జవాబు పెద్దవాళ్ళు చెపుతారో అట్లానే చెప్పాలి బిడ్డలకికూడా. తమకి తెలీకపోతే పెద్దవాళ్ళు తెలుసుకొని చెప్పాలి. కాని బిడ్డ తనంతట తాను తెలుసుకోగల విధంవుంటే, పెద్దవారు చెప్పకూడదు. మార్గంచూపి వదలాలి. పెద్దవాళ్ళకి తెలీకపోతే తెలీదనాలి. కాని అబద్ధం జవాబు చెప్పకూడదు. బిడ్డ పనిలేకుండా, ఆసక్తిలేకుండా వేసే సోమరి ప్రశ్నలు 'ఎన్కరేజ్' చెయ్యకూడదు. 'నువ్వేచెప్పు జవాబు' అనాలి.

లోకంలోని దారిద్ర్యమూ, మూర్ఖమూ, మోసమూ, కఠినత్వమూ అన్నీ బిడ్డకు తెలిసేట్టు పెద్దవాళ్ళు చూపనక్ఖర్లేదు. బిడ్డ అడిగితే మాత్రం వాటి సంగతి తెలిసేట్టు చెప్పాలి. ఆ చెడుగు, ఈవిల్ శాశ్వతం కాదనీ, దాన్ని తొలగించడానికి వీలుందనీ, ఈశ్వరుడో, మాయో, కర్మమో దానికి కారణమైనా కాకపోయినా, మనుషులు ప్రయత్నించి, పోరాడి దాన్ని నిర్మూలం చెయ్యగలరనీ, అట్లా చెయ్యడం ప్రతివారి ధర్మమనీ విశ్వసింపచెయ్యాలి. చెడ్డవాళ్ళపైన కోపమూ, అసహ్యమూ, లోకువా కలిగించకూడదు. వారు చాతకాక జీవితాన్ని పాడుచేసుకున్న మనుష్యు లని నిరూపించాలి.

మృగాలవలె, చెట్లవలె, కథల్లో మనుషులవలె అనుకుని పిల్లలతో పెద్దవారు కలిసి ఆడించడంవల్లా, చిన్న నాటకాలచేతా పిల్లలు భావనాశక్తి అభివృద్ధి చెయ్యవచ్చు.

పనిలేకండానే మాట్లాడించడంవల్లా, కథలూ, అనుభవాలూ చెప్పడంవల్లా భాష నభివృద్ధి చెయ్యవచ్చు. గొప్ప కవుల పద్యాలు వప్పచెప్పేట్టు చెయ్యటం మంచిది. వాళ్ళనే కూచుని చదివి వప్పచెప్పమంటే వప్పచెప్పరుగాని పెద్దవారు ముద్దుగా దగ్గిర కూచోపెట్టుకుని పద్యం వొచ్చిందాకా నోటితో చెపితే సంతోషంగా నేర్చుకుంటారు

దేశాన్ని గురించి, దేశౌన్నత్యాన్ని గురించి సంకుచిత అభిప్రాయాల్ని నేర్చుకొననీగూడదు. దేశంమీదకంటె లోకంమీద ప్రేమ నెక్కువ చెయ్యాలి.

తనవారిదే, తనవూరుదే, తన దేశందే గొప్పతనమనీ, వారి ఆచారాలన్నీ ఉత్తమాలనీ, ఇతరులని పనికిరానివనీ బిడ్డ అనుకోగూడదు. నిష్పక్షపాతంగా తననిగాని, తనవారివిగాని, దేశానివిగాని తప్పుల్ని వొప్పుకోవాలి.

చాపలల్లడం, నూలువడకడం, తవ్వడం, తోటపనులు, మట్టి పనులు, కాయితపు పనులు, వడ్రంగం, సీమసున్నంతో బొమ్మలు గియ్యడం సాధన చేయించాలి.

## బడి:

పిల్లని బళ్ళో వెయ్యడంతోటే తమ బాధ్యత సర్వవిధములా తీరిందనుకుంటారు. భోజనమూ, బట్టా యివ్వడమూ, రోగం రాకండా చూడ్డము, ఇంతే పెద్దవారు విచారించేది. బడికిపోయి, యేడాదిచివర పై

తరగతిలోకి పోతేచాలు. ఈ లోపున బిడ్డ యేం చేస్తున్నదీ, యేం నేర్చు కుంటున్నదీ పరిశీలించరు. ఎట్లాగన్నా, బిడ్డ వొకటి యింటో వున్నదని మరిచిపోవటానికే పెద్దల ప్రయత్నం.

బిడ్డని బలవంతపరచి పాఠశాలకు యెన్నడూ పంపకూడదు. ఏడుస్తో బడికిపోయి పండితురాలు కావడంకన్న, చదువులేకుండా మూర్ఖ రాలుగా వుండడం వుత్తమం. కొందరు పిల్లల స్వభావం బళ్ళో శాశ్వ తంగా గాయపడుతుంది. చాలా బళ్ళు వున్న తెలివిని చంపే విషశాలలూ, పిల్లల్ని బాధపెట్టే కటిక స్థలాలూ, అనారోగ్యాన్ని అభివృద్ధిచేసే నరక కూపాలై వున్నాయి.

బళ్ళో బిడ్డని ప్రవేశపెట్టిన తరవాత తలిదండ్రులు చాలాసార్లు ఆ బడికివెళ్ళి చూడాలి. అక్కడ యేం చెప్పేదీ, ఎట్లా చెప్పేదీ, బిడ్డల్ని బాధ పెట్టేదీ, యివన్నీ జాగ్రత్తగా పరిశీలించాలి. తమ సలహాలను ఉపాధ్యా యుడు వినేట్టు చెయ్యాలి.

బిడ్డని అయిదేళ్ళురాగానే బడికి పంపాలి. ఎందుకు పంపాలంటే—

1. తక్కిన పిల్లలతో స్నేహం చేసుకోడం, ఆడుకోడం చెయ్య వలసిన వయసుగనక. అట్లా కలవడంవల్ల చాలా గొప్పవికాసం కలగు తుంది బిడ్డకి అన్నివిధాలా.

2. అక్షరజ్ఞానం కోసం. అది చాలా అవసరం జీవితానికి.

3. బిడ్డకి తోచడానికి ఏం పనిలేకపోతే ఇంటిదగ్గిర బిడ్డ 'న్యూసెన్సు' అవుతుంది.

4. ముందు జీవితంలో సంపాయించుకుని పోషించుకునే సాధనం నేర్చుకోడానికి.

కాని ప్రస్తుతపు విద్య బాగాలేదు. బడులు ఘోరంగా వున్నాయి. చాలాకాలం ఈ బడులలో చదివితే బిడ్డకి కలిగే లాభాలకన్న నష్టాలు ఎక్కువ కలుగుతాయి. ఆరోగ్యం నశిస్తోంది, మెదడు మందగిస్తోంది.

ఏది నమ్ముతున్నదో బిడ్డకే తెలియదు. జీవశక్తి, నిశ్చయశక్తి, ఆనందించే శక్తి నశిస్తున్నాయి. మనుషులతో, కుటుంబంతో చక్కగా మెలిగి సౌఖ్య పడే తెలివి అసలు లేకుండాపోతోంది. జీవితంలో ముఖ్యమైన ఆనందం శరీరం ఎముకలకోంచి వస్తోంది. ముఖ్యమైన భోజనం, చక్కని స్నేహం, మనసులో శాంతి, స్త్రీని గొప్పగా అనుభవించడం. ఆరోగ్యం – ఇవే ముఖ్యం. ఇట్లాంటి శాంతినిచ్చేవే సరైన విలువలు. ఈ విలువలు పోయి ధనార్జనా, అధికారం, వలుకుబడి – ఆస్తి, కీర్తి, దర్జా, ఈ విధమైన విలువలు మనసులో స్థిరపడి, వాటి ప్రయత్నంలో ఏ సౌఖ్యమూ లేని అనాథలౌతున్నారు; యీ విద్యావంతులు. ఈ కొత్త విలువలు మనసు పైపైన పనిచేస్తాయిగాని లోపల ఏమీ సుఖాన్నివ్వవు. అందుకనే అంత అశాంతిగా మిజరబుల్‌గా కనపడతారు యీ చదువుకున్న మనుషులు. బళ్ళోకూడా పరీక్షలనే భూతాలు. ఏమీ ఆటలకీ, విశ్రాంతికీ. స్నేహానికీ, అభిరుచులకీ వ్యవధినివ్వక, మనిషిని శరీరమూ, మనసూ, హృదయమూపిండి పిప్పి చేస్తున్నాయి. విద్య అనే పేరుతో ఎందుకూ కొరగాని జ్ఞానాన్ని మనసుల్లో ఎక్కిస్తున్నారు. చాలవరకు అది విషప్రాయ మవుతోంది.

ఆరోగ్యమైన శరీరం ఆహారాన్ని ఎంత సహజంగా మధురంగా కోరుతుందో, ఆరోగ్యమైన మనసు అంత ఆతృతతోనూ జ్ఞానాన్ని కోరుతుంది. భోజనశాలకు వెళ్ళడం ఎంత ప్రియమో, అంతకన్న ఎన్నోరెట్లు సహజం, సుందరం, కావాలి బడికివెళ్ళడమనేది. బడీ, పంతులూ, అంటే ఇంత ఘోరమైపోవడం–బిడ్డతప్పు ఏ మాత్రమూ లేదు. ఎప్పుడు బడికి వెడతానా, అనే ఆత్రుత బిడ్డ కనపరచకపోతే, ఆ బడి విషమన్నమాట ఆ బిడ్డకి.

సాధారణమైన బిడ్డకి, ప్రతి బిడ్డకూ అవసరమయినది, తెలుగు పత్రికలు చదవగల జ్ఞానము, ఉత్తరాలు వ్రాయగలగడమూ, చిన్న భాగా రాలు, హెచ్చవేతలు చెయ్యగలగడమూ, ఇవి నేర్పితీరాలి, లోకవ్యవహారం

కోసం. అవసరమైతే టీకాలు వేయించినట్లే బలవంతంగానన్నా నేర్పాలి. తక్కినజ్ఞానం అనవసరం. ఇది సులభంగా తల్లి చెప్పవొచ్చు. ఇంటి దగ్గిర తోచకండా ఉండకండా అతనికి ఏ కర్మాగారానికో పంపి జీతం లేకుండా, సరదా ఉన్నంత సేపు పనిచేసేట్టు; ఏర్పాటుచెయ్యవొచ్చు. పొలానికి తోటపనికి పంపవొచ్చు. అన్నిటికన్నా సరదా ఆవుల్నో, గొర్రెల్నో కాయమనటం, వాటి జాగ్రత్త తీసుకోడం. తక్కిన పిల్లలతో స్నేహాలూ అవుతాయి, బైటతిరిగే పిల్లలకి.

ఇక ముందు జీవితమంటారా, ఈ ధనమూ, ఆస్తీ, అధికారమూ సంపాయించేందుకు, పదవులకు పాకులాడే మనుషులు ఎంత సౌఖ్యాన్ని బలి ఇచ్చుకుంటారో తెలిస్తే, తమ పిల్లల్ని ఆ విధంగా ఎన్నడూ ప్రోత్సహించరు, చాలా స్వల్పమైన ధనంతో, మామూలుగా బతకడం తప్పకుండా అలవాటు చెయ్యాలి.

ముఖ్యంగా అంగీకరించవలసింది— ఆనందం బిడ్డకి జన్మహక్కు అని, ఏమాత్రమైన బాధ బిడ్డకి గలగచేసినా, ఆ విద్య బిడ్డకి పడదన్న పనిమాట. ఎక్కువగా సౌఖ్యపడడం నేర్పాలి విద్య. తన భౌతిక అవసరాల్ని తగ్గించుకోడం, అంటే 'లగ్జరీస్' వొదులుకోడమూ, తక్కువగా 'లీజర్' చేసి, ఎక్కువగా తెచ్చుకుని, ఆ కాలాన్ని తన సౌఖ్యానికి ఎట్లా వుపయోగించుకోవాలో, నేర్పాలి చదువు.

ఈ పాఠశాలలు ఇప్పుడుచెప్పేతుక్కువనంతా చెప్పడంమానెయ్యాలి. టీచర్లు సానుభూతి కలవాళ్ళు, ఉత్సాహవంతులూ, సంతోషం కలవాళ్ళు, తెలివిగలవాళ్ళుగా వుండాలి. పాఠశాలలు గొప్ప మందిరాల మల్లే ఆకర్షకంగా వుండాలి. అంతవరకూ పిల్లల్ని బళ్ళకి పంపమని తలితండ్రులు నమ్మేకట్టాలి. ఇప్పుడు బళ్ళలోని చెప్పే, విషయాలుగాని, చెప్పే పద్ధతులుగాని, ఏవీ బిడ్డకి ఉపకారం చెయ్యవు. ఘోరమైన అప

కారాలు చేస్తున్నాయి. ఆరోగ్యం నశిస్తోంది. తెలివి మందగిస్తోంది. సర్వ మైన గొప్ప గుణాలూ మలినమవుతాయి.

ఈ బళ్ళలో చదవడం గొప్ప దురదృష్టం, చదువు లేకండా వుండడం గొప్ప అదృష్టం.

ఎందుకూ కొరగాని ధారాలతో, ఆచారాలతో, బానిసత్వాలతో, గుంపుని అనుకరించడంతో కుంగి దిగుసుకుపోయే జీవితంలో పడకండా స్వేచ్ఛగా నిర్భయంగా బతకడం నేర్పాలి బిడ్డకి.

ప్రస్తుతం ఏ సారమూలేని ధనం తప్ప తక్కిన విలువ లేవీ లేకండా ఐపోతోంది లోకం. అధికారం, కీర్తీ—యీ రెండు శుష్కమైన ఆ విలువకి తోడ్పడ్డాయి.

గొప్ప కావడం, పైకిపోకడం 'సక్సెస్' పొందడంకన్న 'సింపుల్' గా సుఖపడడంలో వుండే విలువను నేర్పాలి విద్య.

తెలుసుకోడమూ, జ్ఞానం పొందడమూ సుఖమివ్వాలి. ఆ సుఖం లేంది విద్య విషతుల్యం.

పనిచెయ్యడం మనిషికి సహజం. పని ఆనందమివ్వాలి. ఆనంద మివ్వని పనిని, జీవితానికి ఎంత అవసరమో అంత కొంచెం చెయ్యడమే తెలివి.

పరీక్షలు గడిచి పై తరగతిలోకి పోతున్నంత మాత్రాన బిడ్డ అభివృద్ధి చెందుతోందనుకోకూడదు. విద్య వుద్దేశ్యంకూడా పై తరగతులకి పోవడంకాదని బిడ్డా, పెద్దవారూ కూడా విశ్వసించాలి.

## కథలు :

చాలా కథలు చెప్పాలి పిల్లలకి. పెద్దవారికి రాకపోతే నేర్చుకుని చదివి చెప్పాలి. వాళ్ళ వయస్సునుపట్టి దేవతలూ, ఋషులూ,జంతువులూ— చెట్లూ తిరిగి మాట్లాడే కథలూ, మహాపురుషుల జీవిత కథలూ, యెన్నెన్నో చెప్పాలి. చెప్పిన తరవాత మళ్ళీ ఆ కథను చెప్పమని

బిడ్డను బాధపెట్టకూడదు. బిడ్డ కుతూహలపడితే పెద్దవాళ్ళు చెప్పిన కథల్నిగాని, తన సొంత కథలనుగాని చెప్పనియ్యాలి. నీతి చెప్పనూ కూడదు. కథకి నీతేమిటని బిడ్డని అడగనూకూడదు. ముఖ్యంగా దేశంలో వాడుకలోవున్న కథలు చెప్పాలి. అసహ్యమైనవీ, అమితంగా క్రోధమూ, దుఃఖమూ, భయమూ కలిగించే కథలూ చెప్పకూడదు. మంచి కథల్ని బిడ్డల చాత నాటకాలుగా ఆడిరించవొచ్చు.

పెద్దపిల్లలు చిన్న పిల్లలకి కథలు చెప్పవొచ్చు. బిడ్డకి చదవడం రాగానే చాలా కథల పుస్తకాలియ్యాలి.

## కళలు

సృష్టితో యెప్పుడూ బిడ్డకి సంబంధముండేట్లు చూడాలి. తోటలూ, గాలీ, నీళ్ళూ ఆకాశమూ వీటిలో బిడ్డకి ఆనందం కలగచెయ్యాలి. షికార్లు పంపాలి. యింటికి తోటవుంటే బిడ్డ కిష్టమున్నంతసేపు దాంటోనే వుణ్ణియ్యాలి. పెద్దవాళ్ళు అనుభవిస్తో, బిడ్డనీ సృష్టి సౌందర్యాన్నీ, సూర్యోదయాన్నీ, అస్తమయాన్నీ, వెన్నెలనీ అనుభవించి ఆనందించి అద్భుతంలో నిండేట్టు చెయ్యాలి. కాని పెద్దవారి ఆనందాన్ని బిడ్డ కపటంగా 'ఫాషన్'కి తనూ తలతిప్పే ఆపదలో పడకుండా కాపాడాలి. దానికి సృష్టి సౌందర్య మర్థంకాకపోతే వూరుకుంటే మంచిది. కాని సృష్టిని ప్రేమించని బిడ్డ వుండదు లోకంలో.

బాలుడికి ఏ కళలో యెక్కువ రుచివున్నదో కనిపెట్టి ఆ విధమైన కళావాతావరణంలో పెంచాలి. దేంటోనూ అభిరుచిలేకపోతే వదిలెయ్యాలి. కాని నేర్చుకోమని బలవంతం చెయ్యకూడదు.

మాటల్లో, చేష్టల్లో, బట్టల్లో సేస్తు అభివృద్ధి చెయ్యాలి. ఏవి అందమైనవో, యేవి పర్యాదైనవో తెలియచెయ్యాలి. కాని తన అందమే

చూచుకుని కులికేవాణ్ణిగా తయారుచెయ్యకూడదు. పెద్దవారి అభిప్రాయ లే సరైనవని అనుకుని అవే అతను 'కాపీ' చేసేటట్లు చెయ్యకూడదు. ఇతరు లెట్లా చేస్తున్నారో చూసి దాన్నికూడా బిడ్డ గుడ్డిగా అనుకరించేట్టు చెయ్య కూడదు. బిడ్డ ఉేస్టుకి స్వతంత్రముండాలి. జుట్టూ కట్టూ తీరుగా, విద్యావంతులకు, మర్యాదస్తులకు తగివుండేట్టుగా అలవరచాలి. కాని వాటిని నిర్ధారణ చేసిన తరవాత ఆ జుట్టుసంగతే. వేషంసంగతే ఆలో చించక బిడ్డ వాటినీ, తననీ మరచిపోవాలి.

బిడ్డని మంచి నాటకాలను, బయస్కోపులను, సర్కసులను చూడ నివ్వాలి. మంచి సంగీతం విననివ్వాలి. బిడ్డ తన నడవడిలోకూడా ఇది మంచిపనా, అసహ్యమైన పనా అని ఆలోచించుకోడం మంచిది.

పెద్దవారు తమ ఉేస్టులను బిడ్డ నెత్తిమీద రుద్దకూడదు. తమకు అభిలాష వుందని బిడ్డకి యిష్టం లేకపోయినా సంగీతము మొదలైనవి బిడ్డని బాధపెట్టి నేర్పేవారున్నారు.

# సృష్టిజ్ఞానం

స్త్రీ—పురుష సంబంధంవిషయమై పెద్దవారి నీతీ, ప్రవర్తనా, అభిప్రాయాలూ, చిన్నప్పుడు నేర్చుకున్న అలవాట్లమీద చాలా ఆధారపడి వుంటాయి కనక ఆలోచనలలో, పనులలో, బిడ్డకి సరైన అలవాట్లు యేర్పరచాలి. ఈ విషయమై ఎవరూ ఆలోచించరు. ఎవరికీ పట్టదు. ఈ సంగతుల్ని గురించి వ్రాయడమూ, మాట్లాడ్డమూ బూతు ఐపోయింది. ముఖ్యంగా తలిదండ్రులు బిడ్డలతో అసలు మాట్లాడరు. కాని ఈ జ్ఞానం తక్కువ కావడంవల్లా, మలినం కావడంవల్లా తమ బిడ్డలలో ఎన్ని వక్రత్వాలు, ఎంత నష్టం తటస్థిస్తోందో తెలుసుకున్నట్టయితే పెద్దవారు ఎక్కువ శ్రద్ధ తీసుకుని తీరతారు.

ముఖ్యంగా జ్ఞాపక ముంచుకోవలసింది రెండు సూత్రాలు, ఒకటి—పిల్లలు వీలైనంతవరకు తమ 'సెక్సు' జ్ఞాపకం తెచ్చుకోనవసరంలేని పరిస్థితులలో వారిని పెంచాలి. బాలుడికీ, బాలికకీ మాటిమాటికీ ఆ భేదాన్ని జ్ఞాపకం తెచ్చుకోవలసిన అవసరముండకూడదు. ఆ భేదమూ, అది ఎందువల్ల కలిగిందో, ఆ భేదంవల్ల వారి జీవితంలో భేదమేమిటో వారు ఎక్కువగా ఆలోచించకండా వుండాలి. రెండోది—కాని ఆ భేదాన్ని గురించి ఆలోచించి తెలుసుకో ప్రయత్నించారా, పెద్దవారు ఏ మాత్రమూ సంకోచింపక దాచక స్పష్టంగా చెప్పివెయ్యాలి.

సహజంగా బిడ్డకి తన శరీరంమీద ప్రేమా, గౌరవమూ, అభిమానమూ, వుంటాయి. అవి నశింపకుండా చూడడం పెద్దవారివిధి. శరీరం నీచమనీ, పాపభూయిష్టమనీ, దాని ధ్యాసే పాపమనీ, చెప్పే వేదాంతాన్ని

వదిలి సృష్టి సౌందర్యమంతా కలసిన నిలయము దేహమనీ, లోకంలోని ఆనందాన్ని అనుభవించడానికి సాధనమనీ, ఈశ్వరుడు (నమ్మకముంటే) నివసించే గృహమనీ చెప్పాలి. తన దేహాన్ని యితరులు తాకకుండా, ఉపయోగించకుండా బిడ్డ జాగ్రత్తపడడం నేర్పాలి. శరీరంలో కొన్ని అవయవాలు నీచములనిగానీ, అపరిశుభ్రములనిగానీ, పాపములనిగానీ, సిగ్గుపడవలసినవీ, దాచుకోవలసినవీ అనిగానీ నేర్పకూడదు. పెద్దవారు తమ మాటలవల్లా ప్రవర్తనవల్లా అట్లాంటి అభిప్రాయాలు కలిగించకూడదు. ఈ క్రింది విషయాలు జాగ్రత్తగా గమనించాలి.

1. బంధువులుగాని, ఇతరులుగాని, తలితండ్రులుగాని బిడ్డల్ని ముద్దుపెట్టుకోకూడదు. నలపకూడదు. బిడ్డ యిష్టపడ్డా పనికిరాదు.

2. ముసలమ్మలు మొదలైనవారు బిడ్డ సృష్టి అవయవాలతో ఆడడమూ వాటిని ముద్దుపెట్టుకోడమూ, బిడ్డ దృష్టిని వాటివేపు మరల్చడమూ చాలా హానికరమైనవి. అట్లాంటివారిని వెంటనే కర్రతో చావ కొట్టినా తప్పుకాదు.

3. బిడ్డని యెన్నడూ యెవరూ కొట్టకూడదు.

దెబ్బలు తినడానికి అలవాటుపడ్డ బిడ్డ తన వొంటిమీద అభిమానాన్ని పోగొట్టుకుంటుంది. పరాయివాళ్ళేంచేసినా లొంగిపొయ్యే అలవాటులో పడుతుంది. కనుక దెబ్బలంత హానికరమైన విషయం యింకేదీ లేదు.

4. ప్రత్యేకంగా సృష్టి అవయవాలను దాచే, సిగ్గుబిళ్ళలు, గోచీలు, యేమాత్రమూ పనికిరావు.

మొగపిల్లలకూ ఆడపిల్లలకు ఒకటే విధమైన బట్టలు వెయ్యడం అవసరం; జుట్టు ఒకటే విధంగా వుండాలి. ఆడపిల్లలకిమాత్రం ముక్కులు చెవులు కుట్టడం తప్పు. పేర్లుకూడా మొగ—ఆడ—విచక్షణలేకండా పెడితే మరీ మంచిది.

వీలైనంతవరకు బట్టలులేకండా తిరగనియ్యడమే ఆదర్శంగా వుంచుకోవాలి. చలికి తప్ప బట్టలు వెయ్యనక్కరలేదు. బైటకి బిడ్డని తీసి కెళ్ళేటప్పుడు, మర్యాదకోసం, బట్టలువెయ్యవచ్చు. బిడ్డకి సిగ్గుతోచి బట్టలు అడిగినప్పుడే బట్టలు కట్టించడం అవసరం — అప్పుడుకూడా వీలైనంత వరకు బట్టలులేకండా వుండనియ్యడం మంచిది.

బిడ్డకు తన దేహము పవిత్రమనే అభిప్రాయం స్థిరంగా వుండా లంటే, పెద్దవారుకూడా అమితమైన సిగ్గును కనపరచకూడదు. లోకాచార ప్రకారం మిస్తుల్ని ధరిస్తున్నారే గాని ప్రత్యేకంగా యేమీ దాచడానికి కాదన్నట్టుండాలి. పెద్దవారు బట్టలేకండా వున్నప్పుడు బిడ్డ చూడడం తటస్థిస్తే అమితంగా సిగ్గుపడడం, అరిచి పొమ్మనడం ఏమీ చెయ్యక సహజంగా ప్రవర్తించాలి. బిడ్డ ప్రశ్నలువేస్తే సిగ్గులేకండా వాస్తవమైన జవాబులు చెప్పాలి. డాక్టర్లు తమ విద్యార్థులకు బోధించినట్లే ఇల్లాంటి విషయాల్లో తాము సిగ్గుని వదలక, బిడ్డలపైన కేకలువెయ్యడంవల్ల పెద్దలు బిడ్డలకు అమితమైన హాని చేస్తున్నారు.

రెండోయేడు మొదలు ఎనిమిదోయేడు మధ్య చాలామంది పిల్లలు మాస్టర్‌బేట్ చేస్తారు; తొడాతొడా రాసుకోడమూ, కుర్చీలకు రాయడమూ పెద్దవారి ఒంటికి రాయడమూ మొదలైనవి. కాని సాధారణంగా యిది పెద్దవారు కనిపెట్టలేరు. కాని కనిపెట్టినట్టయితే యేమీ తెలియనట్టు తాము చూడనట్టు వూరుకోవాలి. చాతనైతే బిడ్డని వేరేపనిలో ప్రవేశపెట్టవచ్చు. బిడ్డని అందుకని కొట్టడంకాని, అట్లా చెయ్యవొద్దని చెప్పడంగాని, అది చూసి నవ్వడంగానీ, వెక్కిరించడంగాని పనికిరాదు. ఇంకెవరినీ 'నోటీస్' చెయ్యనీకూడదు. ఎందుకంటే, తానేమి చేస్తోందో బిడ్డకే తెలీదు. దానివల్ల హానీలేదు. ఆ అలవాటు దానంతట అదే పోతుంది. కాని పెద్దవారు అదరిపడ్డారా, తాము భయపడి అసహ్యపడి బిడ్డని బెదిరించారా ఇంక అది విషతుల్యమై బిడ్డ సెక్సు జీవితాన్ని నాశనంచేస్తుంది. ఈ అలవాటుకోసం

బిడ్డల్ని కొట్టేవారు, కాల్చేవారు మూర్ఖులున్నారు. చెప్తేమాత్రం వారు వింటారా? అంత ఘోరం జరుగుతోవుంటే, అది ఘోరం కాదంటే, అన్నవాడు అవినీతి బోధిస్తున్నా డంటారు. అంతే, బిడ్డని శిక్షించినకొద్దీ అలవాటు, అంతకన్న ఘోరమైన అలవాట్లూ యెక్కువవుతాయి. ఇరవై నాలుగు గంటలూ బిడ్డని కనిపెట్టి వుండలేరు. గనక శిక్షించి వ్యర్థం. కాని వినరు; ఎంత చెప్పి ఏం లాభం ? చెప్పాలనే యీ వెర్రి యెందుకో తెలీదు.

గట్టి బట్టలు, సృష్టి అవయవాలకు రాసుకునేవి వెయ్యకూడదు. బిగుతు లాగువంటివీ, గోచీలవంటివీ మంచిదికాదు.

చిన్నప్పటినించీ పిల్లలకు శుభ్రమైన అలవాట్లు నేర్పాలి. చన్నీళ్ళ స్నానమూ, గట్టి పడకలమీద నిద్రా, మంచిగాలీ, వ్యాయామమూ, దేహ వస్త్ర శుభ్రతా, సోమరిగా వుండకపోవడమూ మొదలైనవి. స్నానమప్పుడు తక్కిన శరీరంతోపాటు సృష్టి అవయవాలను కడుక్కోడము పెద్దవారు అలవాటు చెయ్యాలి.

చిన్నప్పణ్ణించికూడా బిడ్డయొక్క సృష్టి అవయవాల విషయమై మాట్లాడవలసి వొచ్చినప్పుడూ, వాటికి వైద్యము చెయ్యవలసి వొచ్చినప్పుడూ సిగ్గుగాని హేళనగాని యేమీ కనపరచక, సహజంగా, చూపులో మాటలో, పనిలో తక్కిన వస్తువులయెడల ప్రవర్తించినట్టే ప్రవర్తించాలి. సిగ్గూ, అసహ్యమూ కనపరచకూడదు. వాటిని వాటి పేర్లతో సిగ్గులేకండా సహజంగా మాట్లాడాలి. ఇప్పుడున్న పేర్లు బూతులుగా పరిణమించాయి. గనక కొత్తపేర్లు పెట్టుకుని పిల్లలూ పెద్దలూ ఆ పేర్లలో వాడుకోవాలి. పిల్లలు తమ అవయవాలతో ఆడుకుంటూవుంటే మాట్లాడకూడదు. అడ్డు పెట్టకూడదు. పరాయివాళ్ళు కూడా యేమీ అనకండా పెద్దవారు జాగ్రత్త తీసుకోవాలి. బిడ్డకి బుద్ధితెలిసిన తరవాత—అసలు యీ అవయవాలు—బూతులు అసహ్యాలూ కాకపోయినా లోకంమాత్రం ఆ విధంగా చూస్తుం

దనీ, వీటిని గురించి మాట్లాడినా చెప్పుకున్నా మర్యాద అనుకోదనీ చెప్పవచ్చు. వాటినిగురించి యింట్లో స్వేచ్ఛగా మాట్లాడుకున్నా ఇతరులతో మాట్లాడకూడదనీ, యితరులు వున్నప్పుడు వటి విషయం మాట్లాడ్డం మర్యాదకాదనీ చెప్పాలి.

మూడు నాలుగేళ్ళ లోపునే బిడ్డ తనెట్లా పుట్టిందో, కనుక్కోవాలని ప్రయత్నిస్తుంది. తమ లోకంలో మృగాలలో చూసిన విషయమై ప్రశ్నిస్తుంది.

చిన్నప్పణ్ణించీ పిల్లలతో సఖ్యంగావుండి వాళ్ళ ప్రశ్నలకు తడుము కోకండా జవాబుచెప్పే అలవాటులో వుంటే ఆ ప్రశ్న బిడ్డ తలిదండ్రుల్నే అడుగుతుంది. అప్పుడు సందేహించకండా సిగ్గుపడకండా తడుముకోకండా తక్కిన ప్రశ్నలకు జవాబు చెప్పినట్టే దీనికీ చెప్పాలి. ఎన్నడూ యే మాత్రమూ అబద్ధం చెప్పకూడదు. ఏమడిగినాసరే జవాబు చెప్పాలి. అమ్మ యెందుకు దూరంగా వున్నదన్నా, అత్త యెందుకు నెప్పులు పడు తోంది అన్నా, తమ్ముడు యెట్లా వొచ్చాడు అని అడిగినా; నిజంగా సంగతేమిటో అదే చెప్పాలి. రహస్యమూ, అబద్ధమూ బిడ్డలు తెలుసుకో కూడదనే వాతావరణం యింట్లోంచి తొలగించాలి. అంతా సహజమూ, నిర్మలమూ, ఆరోగ్యవంతము, జ్ఞానప్రదంగా వుండాలి.

ఈ విధమైన జ్ఞానం తలిదండ్రుల దగ్గిర్నించి బిడ్డ సంపాయించడం చాలా వుత్తమం. తలిదండ్రులూ తక్కిన పెద్దవారూ, యీ విషయమై మాట్టాడరనీ తను మాట్టాడితే తిడతారనీ, నిజంచెప్పరనీ ఎప్పుడు బిడ్డకి తోస్తుందో అప్పుడు తన స్నేహితుల్నీ వీధిలో పిల్లల్నీ అడుగుతుంది. తలిదండ్రులు ఒక్కటి గ్రహించాలి. కాని గ్రహించే ధైర్యం చాలామందికి లేదు. తాము చెప్పకపోయినంత మాత్రాన బిడ్డ అంధకారంలో వుండదు. సందేహం కలిగిందా తీర్చుకునేదాకా బిడ్డ నిద్రపోదు— అందులో ముఖ్యంగా ఏదో రహస్యమూ, గూఢమూ వుంది అనుకుందా,

అసలు వూరుకోదు. ఎవరినో సగం తెలిసీ తెలీని, బూతుగానూ, వక్రం గానూ చెప్పేవాళ్ళని అడుగుతుంది. వాళ్ళు చెప్పిందే నమ్మి, యోచించి తనకు తెలుసునని పెద్దవారిదగ్గర్నించి దాస్తో అనారోగ్యం వృద్ధి చేసు కుంటుంది. బిడ్డ కీ సంగతులు తెలుసునని పెద్దవారికి తెలుసు. తనకి తెలుసునని పెద్దవారికి తెలుసునని బిడ్డకీ తెలుసు. కాని యెవరికివారు తెలీ నట్లే ప్రవర్తించడం మర్యాద అయింది. పిల్లలయెదట పిల్లలతో బూతులు మాట్లాడే తలిదండ్రులకికూడా ఆరోగ్యంగా యీ విషయాలు మాట్లాడడం సిగ్గు.

కొందరు బిడ్డలు యీ విషయమై తెలుసుకోవాలనే ఆసక్తిని కలిగి వుండకపోవచ్చు. వాళ్ళకి కూడా యెనిమిదేళ్ళు రాకపూర్వమే సృష్టి జరిగే విధం తెలీడం ముఖ్యం. క్రమంగా పువ్వులు కాయలయ్యే విధమూ, జంతువులు బిడ్డల్ని కనే విధమూ చూసి జ్ఞాపకంచేసి మనుష్య సృష్టికూడా ఆ విధంగానేనని చెప్పాలి. ఈ సృష్టి ఆనందాన్ని బిడ్డ అర్థంచేసుకునేట్టు చెయ్యాలి.

సహజమైన యీ విషయాలు, భోజనంవలెనే బిడ్డ త్వరలో నేర్చు కోవలసిన జ్ఞానము. ఇవి మలినమనీ, నిర్మలమైన బిడ్డ నేర్చుకోకూడనివనీ, పెద్దవారి అభిప్రాయం. కాని ఎంత దాచినా బిడ్డదగ్గిర్నించీ దాగని సృష్టే బిడ్డకి బోధపరుస్తుందనీ, ఆ జ్ఞానవాంఛ బిడ్డలో స్వభావసిద్ధంగా వున్నదనీ తెలుసుకోరు. ఆ మూర్ఖంవల్ల బిడ్డలో యెక్కడెక్కడ ఆ కోర్కె, ఆ జ్ఞానం సంపాయించాలని ఆశ, చిన్హాలు కనపడ్డా, నిర్మూలం చెయ్యాలని ప్రయత్నిస్తారు. సహజమైన సృష్టి వాంఛమీదనే పెద్ద అనుమానం ఏర్ప డ్డది. అది అసహ్యమూ,రోతా అయింది. దానికి సంబంధించిన మాట లన్నీ బూతుమాటలుగా మారాయి. పెద్దవాళ్ళ దెబ్బలూ, తిట్లూ బిడ్డని వక్ర మార్గాలకు తిప్పుతాయి. ఏ కోర్కెని నిర్మూలం చెయ్యాలనుకుంటారో, అదే పెద్దవారి మూర్ఖంవల్ల, క్రౌర్యంవల్ల అసహజమూ, మలినమూ ఐన

మార్గాల పట్టిస్తుంది. స్వభావానికి వదలక, పెద్దవారు జోక్యం కలగజేసుకొన్న కొద్దీ బిడ్డకి హాని జరుగుతుంది.

పెద్దవారు చూపే కోపమే, అనుమానమే, సిగ్గే, అసహ్యామే బిడ్డ స్వభావానికి విషతుల్య మవుతుంది

ఈ జ్ఞానం బిడ్డలకి లేకపోవడంవల్ల, రజస్వలలై హడలి పోయిన వాళ్ళూ, మతిపోయినవాళ్ళూ, ఆడపిల్లలు వున్నారు. గర్భదానపు గదిలో భయపడి, చాల సంవత్సరాలు బాధపడ్డ వాళ్ళున్నారు. యవ్వనచిహ్నాలు అర్థం చేసుకోని బాలురు వున్నారు. వీరు సక్రుతే కావొచ్చు. కాని వొక్కరు ఆ ప్రకారం బాధపడి, స్వభావాన్ని వికృతం చేసుకున్న వాళ్ళున్నా దానికి తలిదండ్రులూ, సంఘమూ బాధ్యులవునా కదా ?

తలిదండ్రులకూ బిడ్డలకూ నిర్మలమైన విశ్వాస సంబంధం లేక పోవడంవల్ల వారితో చెప్పుకోడానికి వెరిచి లోపలలోపల కృశించే పిల్లలు ఎక్కడచూచినా ప్రతియింట్లో వున్నారు. పెద్దవారు పసిపిల్లలమీద జరుపుతున్న రహస్య విషయమైన అక్రమాలు బైటికి రానేరావు. పాప మా బిడ్డ తన తల్లితో కూడా చెప్పుకోదు. ఎందుకు? సిగ్గు. ఇతరులు కొడితే తిడితే చెప్పుకోవచ్చు. ఈ విషయమై తనకు కలిగే బాధలు బైటికి అనడం అభిమానం. ఎందుకు ? బిడ్డలతో యీ విషయమై పెద్దవారు మాట్లాడరు గనుక ! పైపెచ్చు బిడ్డదే తప్పుగా దండిస్తారు గనుక ; బిడ్డతో స్పష్టంగా చెప్పాలి—వారిమీద అక్రమం జరపజూచే దుష్టులు వుంటారని. అట్లాంటి పరిస్థితులను బిడ్డనించి తొలగించాలి. బిడ్డ గ్రహించేట్టూ, తమతో చెప్పేట్టూ నేర్పాలి. అంటే ఈ విషయమై అవయవాల ఆరోగ్యం మొదలైనవి స్వేచ్ఛగా సిగ్గుపడకండా మాట్లాడి, బిడ్డని శిక్షించరనే విశ్వాసం కలగ

చేస్తే అంతా సులభమౌతుంది. ఈ రహస్య వ్యవహారంవల్ల ప్రజలలో అనేక దుర్గుణాలు ఏర్పడుతున్నాయి. కనక యింత ప్రాముఖ్యమిచ్చి చెపుతున్నాను. బిడ్డలు పడే బాధలు పైకిరావటం లేదు.

పిల్లల్ని యే పనులకన్నా (ముఖ్యంగా యీ విషయాల్లో) కోప్పడ్డా, శిక్షించినా, సహజంగా పెద్దవారితో యీ విషయాలు మాటాడ్డం మానేస్తారు. పిల్లలు పెద్దవారితో చెప్పుకుంటే సానుభూతి తప్ప యిబ్బం దేమీ రాదని నిశ్చయంగా వాళ్ళకి తెలిస్తేతప్ప వాళ్ళ సంగతులు దాస్తారు. బిడ్డ ఎంత తప్పుపనీ, అసహ్యమైనపనీ చేసినా, పెద్దవాళ్ళు పూరుకుని బిడ్డ ఇంక మళ్ళీ ఆ పని చెయ్యకుండా తప్పించుకోడానికి సలహానివ్వాలి; సహాయం చెయ్యాలి. పెద్దవాళ్ళ మాటల్లో బిడ్డలకు సంపూర్ణ విశ్వాసం కలగచెయ్యాలి.

తనేం చేసినా పెద్దవారు సహాయం చేస్తారుగాని, కోపం తెచ్చుకో రని బిడ్డకి స్పష్టంగా తెలియాలి. ముఖ్యంగా ఈ విషయాల్లో శిక్షయెప్పుడూ అన్యాయమూ, అనారోగ్యమూ, యీ విషయంలో విషమవుతుంది.

చిన్నప్పటినుంచీ కూడా బిడ్డలకి వివాహాన్ని గురించీ, ప్రేమ గురించీ చక్కని నిజమైన అభిప్రాయాలను యివ్వాలి. ఆడపిల్ల పెళ్ళి కోసమే పుట్టినట్టూ, ఎవరికో పెళ్ళాంగా పుట్టినట్టూ మాట్లాడకూడదు. ఆమె జీవితం ఎప్పుడూ పరాధీనమేననీ, పురుషులకు సేవచెయ్యడం ఆమె విధి అనీ అన్నలకూ, తమ్ముళ్ళకూ చాకిరీ చేయించరాదు. మాటాడితే 'ఆడపిల్ల వని జ్ఞాపకముంచుకో' అనకూడదు. స్త్రీ దగ్గర్నించి విధేయతా, చాకిరీ తీసుకోడమూ బాలుడి హక్కులైనట్టు నేర్పకూడదు. బాల్యంనించికూడా ప్రచారంలోవుండే ఈ నీచాభిప్రాయాల్ని—స్త్రీ, పురుషునికి సంతోషమివ్వ డానికే పుట్టిందనీ, పురుషుడు స్త్రీల శీలాన్ని వినాశంచేసే పెనుభూతమనే ఈ అభిప్రాయాల్ని ఖండించాలి. పిల్లలకు వారి దేహంమీద శీలంమీద

అమితమైన గౌరవం వుండాలి. ప్రేమ—ఇతరులని ప్రేమించడం అనే అనుభవం—అతి అద్భుతంగానూ, వున్నతంగానూ కనపడాలి. వారికి సంపూర్ణంగా ప్రేమిస్తేనేగాని, తను మనసునంతా అర్పిస్తేనేగాని దేహాన్ని స్వాధీనంచేయడం అతి నీచమని తెలియాలి. స్త్రీ—పురుషులకు వుండే ఈ అసహజ వైరమూ, అనుమానమూ బాల్యంనించి తొలగించే ప్రయత్నంచేసి తీరవలసిందే, బుద్ధివున్న మనుష్యులందరూ.

పెద్దవారు ఈ సంగతుల్ని గమనించాలి. 10 మొదలు 18 యేళ్ళ వరకు—

1. బిడ్డ ఆరోగ్యకరమూ, సహజమూ ఐన జీవితాన్ని గడపాలి మంచి వ్యాయామమూ, చన్నీళ్ళ స్నానమూ ముఖ్యమైనవి.

2. ఈ విషయమై బిడ్డ స్నేహితు లెటువంటివారో గమనిస్తో వుండాలి.

3. లోకంలో నీతి అనేదానికీ—నిజమైన నీతికీ భేదం చూపాలి.

4. బిడ్డల్ని అనేక అభిరుచులతో, అభినివేశాలతో కాలమంతా తీరికలేకండా గడిపేటట్టు చెయ్యాలి.

# పసిపిల్ల

లోకంలోని అన్ని ఉద్యోగాలకన్నా పిల్లల్ని ఆరోగ్యంగా కని, ఆరోగ్యంగా పెంచడమనేది గొప్ప వుద్యోగం. ఈ వుద్యోగానికి ఎవరూ జీతమివ్వరు. ప్రజ భర్తద్వారా స్త్రీని పోషిస్తోంది. గర్భం ధరించడం, పిల్లని పెంచడం—వీటిమీద భర్తలకీ ప్రజలకీ మునిపటి గౌరవం పోతోంది. స్త్రీకే తన గొప్ప అనుభవంమీద తనకే గౌరవం పోయింది.

బిడ్డ కడుపులో పడ్డది మొదలు బిడ్డకి ఏడాది వచ్చేవరకూ తల్లిని సుఖంగా వుంచడం ప్రభుత్వ బాధ్యత. ప్రతి గర్భంధరించిన స్త్రీ విషయం తెలుసుకుని పరిస్థితులు సరిగా లేనిచోట, అవసరమైతే ఆమెని బాధ్యత తెలీని భర్తనించి, బంధువులనించి, అధికార్లనించి, ఎదిగిన పిల్లల నించి తప్పించి సరైన సంరక్షణ నివ్వడం ప్రభుత్వం తన ధర్మంగా చూచుకోవాలి.

లోకంలో పిల్లలు లేనివాళ్ళు చాలామంది. ఈ దేశంలో పుట్టిన పిల్లల్ని చేతులారా చంపుకునేవాళ్ళు అనేకమంది. ఎట్లాగో భరించాలక బ్రతికిన పిల్లల్ని చంపుకుతినేవాళ్ళు అందరూను.

మనుషులకి ముఖ్యంగా స్త్రీలకి, పిల్లలు పుట్టాలనే కోర్కె చాలా సహజం. ఆ కోర్కె అణచరానిది. పిల్లలు లేకపోతే జీవితం శూన్యంగా కనబడడం చాలా న్యాయం. పిల్లలులేని స్త్రీ జీవితానికి అర్థం కనపడదు చాలమందికి. ఎమోషనల్‌గా స్త్రీ చాలా బాధపడుతుంది. పిల్లలు లేక పోతే కొంతవరకు పురుషుడిలోపం. కనక స్త్రీ—తనకి పిల్లలు కలగాలంటే తన పురుషుణ్ణి డాక్టరుచేత పరీక్ష చేయించాలి. అంటే స్పెషలిస్టుచేత —

ఈ మామూలు డాక్టర్లకి ఈ విషయాలు ఏమీ తెలీవు. తెలిసినట్టుగా దొంగకబుర్లూ వేదాంతాలూ మాట్లాడరారు. నమ్మకండి. ఈ డాక్టర్లకి—చెవి పోట్లకీ, జ్వరానికీ తప్ప ఇంక వేటికీ మందులు తెలీవు. అవీ మామూలు వాటికి మాత్రమే తెలుసు. మాటలు మాత్రం అన్నీ తెలిసినట్టు మాటాడ తారు. నమ్మకండి.

సంభోగశక్తి సరిగా వున్న పురుషులకి కూడా, బిడ్డని పుట్టించే శక్తి కొందరికి వుండదు. సంభోగశక్తి చాలా తక్కువగా వున్నవాళ్ళలో కొంత మందికి బిడ్డల్ని కలిగించగల శక్తి సంపూర్ణంగా వుంటుంది. కాని పిల్లల్ని పుట్టించే శక్తిలేని పురుషులకి చికిత్స చేయగల డాక్టర్లు చాలా తక్కువ. చాలామంది పురుషులకీ ఆ లోపం కుదరనూ కుదరదు.

అదిగాక ఏ కారణం వల్లనో ఒక్కొక్క జత పిల్లల్ని కనలేరు. ఆ భర్తే ఇంకో స్త్రీకీ, ఆ భార్యే ఇంకో పురుషుడికీ పిల్లల్ని కంటారు. కనక తనకి తప్పకుండా బిడ్డలు కావాలంటే స్త్రీ, పురుషుణ్ణి మార్చుకో వాలి. వీలైతే భర్త అనుజ్ఞ తీసుకుని, వీలులేకపోతే అనుజ్ఞ లేకండానే

బిడ్డలు లేకపోవడానికి స్త్రీ లోపంకూడా వుంటుంది. అది డాక్టరు వల్ల నయం చేయించుకోవాలి.

స్త్రీ పిల్లల్ని కనితీరాలంటే దేవుని ఆజ్ఞ నెరవేర్చడానికీ కాదు. లోకం సాగడానికీ కాదు. ప్రపంచాన్ని ప్రజలతో నింపే వేరే పద్ధతుల్ని దేవుడే ఆలోచించుకుంటాడు. లోకం సాగకండా ఆగిపోతే, ఏమీ నష్టం లేదు. ఈ బాధలూ, రోగాలూ, యుద్ధాలూ, తక్కిన జీవుల్ని బాధించ డాలూ ఆగిపోతాయి.

ఎంతో అవసరం కనబడితేనేకాని, స్త్రీ బిడ్డల్ని కనకండా వుండ కూడదు. ఏ సీలీ, ఏ కర్మ, ఏ భర్తా ఆమెని గొడ్రాలుగా వుంచడానికి అధికారంలేదు. ఆమె జన్మహక్కు కోసం ఆమె యుద్ధం చెయ్యాలి. ఆమె

జీవితానికి సాఫల్యం, అన్ని గొప్ప అనుభవాల్లోకీ, గొప్ప అదృష్టమైన ఆనందమయిన అనుభవం బిడ్డని కనడం—పెంచడం.

బిడ్డలు అక్కర్లేనప్పుడు గర్భనిరోధక సాధనాలు వుపయోగించడం న్యాయం. కాని గర్భం కలుగుతుందేమోననే భయంతో బతకడం ఘోరం. దివ్యగానంవలె గడపవలసిన సంభోగజీవితం విషతుల్యమౌతుంది. నరాలలో గొప్ప అశాంతీ, జాడ్యం బైలుదేరుతాయి. అట్లాంటి భయంలో స్త్రీని వుంచే పరిస్థితిని తీసుకురావడం, ఆ స్థితిలో స్త్రీని వుంచడం, ధీరుడైన ఏ పురుషుడూ చెయ్యతగిన పనికాదు.

స్త్రీ అందం పోతుందనీ, తనకి అమర్యాద కలుగుతుందనీ స్త్రీలని ఇట్లా అభ్యంతరాలకొప్పెట్టి గర్భస్రావాలు చేయించుకోమని బలవంతాలూ భయాలూ పెట్టే స్వార్థం పురుషులలో ఎక్కువవుతోంది.

పెళ్ళికాకండా బిడ్డని కనడంవల్ల ప్రస్తుతం స్త్రీలకి కలుగుతున్న సాంఘిక న్యాయచట్ట సంబంధ ఆస్తి ఇబ్బందులన్నీ తొలగి పోయ్యే వరకూ స్త్రీలు ఆందోళన చెయ్యాలి.

గర్భం కలిగింది మొదలు దాన్ని నిలబెట్టుకోవాలి. దానికి తగిన జాగ్రత్త తీసుకోవాలి. కనాలి. బిడ్డని తెలివితక్కువవల్ల చంపుకోకుండా కాపాడుకోవాలి. ఈ విషయంలో కూడా జాతకాలూ వేదాంతం అడ్డం తగులుతాయి. బిడ్డల్ని దేవుడిస్తాడు, బిడ్డల్ని దేవుడే చంపుతాడని నమ్మకం వుంటే, ఈ పుస్తకం వృథా శ్రమపడి చదవకండి. కాని ఆ దేవుడే, ఆ జాతకమే, ఆ ఖర్మే నాచేత ఈ పుస్తకం వ్రాయిస్తోంది, మీచేత చదివిస్తోంది, డాక్టరు రూపాన కుదురుస్తోంది. మీచేత సరైన జాగ్రత్త తీసుకునేట్టు చేస్తుంది. తీసుకోకపోతే మీ బిడ్డని జబ్బు పడేస్తుంది. మీకు శోకం తీసుకొస్తుంది—అంతా ఆ ఖర్మే.

గర్భం జాగ్రత్త తీసుకోవడంవల్లా, తగినజ్ఞానాన్ని పొందడంవల్లా పశ్చిమదేశాల్లో శిశువుల మరణసంఖ్య తగ్గింది. విజ్ఞానం జాతకాలని

మారుస్తోంది. ఈ దేశంలో పిల్లల్ని పొలాలకీ, ఎరువుకు, వుపయోగ పడేందుకు కంటున్నారు—వాళ్ళని చంపి పాతిపెట్టి మంచి ఎరువుమన్ను తయారుచేసి.

పిల్లలు ఈ దేశంలో ఎదగకండా చచ్చిపోతున్నారంటే చాలా సంతోషించవలసిన విషయం. పుట్టిన నిమిషంనించి చచ్చేవరకు ప్రస్తుతం ఈ దేశంలో జీవితం దుఃఖమయం, బాధామయం. కనక ఆ జీవులు ఎంతత్వరలో ఈ దేహాన్ని వొదిలిపోతే అంత అదృష్టవంతుడు. పుట్టిన నిమిషానే, మంత్రసానిపెట్టే బాధతో ప్రారంభించి, ముసలమ్మలూ, పొరిగింటివారూ పెట్టే క్షోభతో మగ్గి పిల్ల వొచ్చిన దోవనే వెళ్ళడానికే ప్రయత్నిస్తుంది. చర్మం వుడికిపోయ్యే మసిలేనీళ్ళ స్నానంతో ఆముదం పానీయంతో ప్రారంభమైన అహ్లాదకరమైన జీవితం! తల్లిపాల అజీర్ణాలూ, మందులూ, తంత్రికేకలూ, తరవాత తిట్లూ, దెబ్బలూ, బళ్ళూ, చదువులూ. ఇవన్నీ వోర్చుకుని గడిచినా, చివరికి సంఘ మూర్ఖ క్రౌర్యం వించీ, యీ దేవుళ్ళ భయాలనించి తట్టుకున్నా, ఎదిగిన యువతీ యువకుల్ని సుఖంగా బ్రతకనియ్యగల, ఆర్థికపరిస్థితిలో, తాను మనిషినే నని గర్వంగా బతకగల ఆర్థిక రాజకీయ పరిస్థితిలోలేదు దేశం. బీదరికం, నీచత్వం, స్ట్రగుల్, నిరాశ, అంధకారం, వేదాన్తం — ఇవి జీవితాన్ని పాలించే శక్తులు. కనకత్వరలో మరణించినవాళ్ళు ధన్యులు. వాళ్ళ పరలోక ప్రయాణానికి సాయంచేసే తలిదండ్రులూ, ఉపాధ్యాయులూ, డాక్టర్లూ గొప్ప ఉపకార పారీణులు.

కానీ ఈ పరిస్థితుల నన్నిటినీ మించి ఎక్కువగా తూగేది తల్లి కడుపు. గొప్ప ప్రియుణ్ణి పోగొట్టుకున్న స్త్రీ కున్న బాధతో సమానము. తన బిడ్డని పోగొట్టుకున్న తల్లి శోకాన్నీ, ఆమె కన్నీటినీ తలుచుకుంటే; పిల్లలు లోకంలో పడేబాధలూ; షికారుకిపోకుండా, ప్రేమలేఖలు వ్రాసుకోకుండా కూచుని, ఏదో ఎక్కడో నా మాటలు విశ్వసించే ఏ తల్లికో,

ఏ నోముతేని పిల్లలో సహాయపోరాయని వెర్రి ఆశతో నమ్మకంతో, ఇల్లా వ్రాసేనా నిర్భాగ్య హృదయమంటోని వేదనా—ఇటువన్నీ ఓ రేఖా— ఆమె శోకం మొత్తం అనిపిస్తుంది.

ముఖ్యంగా ప్రజలు ఎంతధీమంతులైనా గమనించవలసినది, అన్నివిధాలా గమనించవలసినది, ఏమిటంటే బిడ్డ లోకంలో సుఖపడటానికే పుట్టిందన్న సంగతి. మనుష్యుల్ని, ప్రతిమనిషినీ, తీసి సుఖపెట్టే ప్రయత్నం బుద్ధి కలిగినవాళ్ళంతా చెయ్యాలి. లోకంలో ఆ పద్ధతులమీద మార్పు చెందాలి. మార్పు చెందించాలి. మనిషిని బాధపెట్టే పరిస్థితి, సంస్థ, ధర్మం ఎంత గొప్పదైనా నిర్మూలం కావాలి. మృత్యువు తప్పదు. అకాల మరణం చాలవరకు తప్పించవొచ్చు. రోగాలు చాలా తగ్గించవొచ్చు. మానసిక బాధల్ని, అశాంతుల్ని దూరం చెయ్యవొచ్చు. మనుషులు కల్పించుకున్న బాధలూ తప్పకుండా నిర్మూలం చెయ్యవలసినవి — దరిద్రం, విద్య, వివాహం, పని—మొదటిది తప్ప తక్కినవి ఏదో ఓ రూపాన, కొంచెంగా, మనుషులకి సుఖాన్నిస్తాయి. అంతవరకే అవి నిలబడాలి. తక్కిన భాగాలు నిర్మూలం కావాలి. పెళ్ళిచేసుకోడం అంటే అర్థం బిడ్డల్ని కనడం, వాళ్ళని పెంచడం, వాళ్ళని సుఖింపచెయ్యడం, అభివృద్ధి చెయ్యడం—అనే బాధ్యత పెళ్ళిలోనూ, పెళ్ళిలేనిసంబంధంలోనూకూడా వుందని గ్రహించాలి. నిరోధమార్గాలు ఎంత జాగ్రత్తగా జరిపినా తప్పిపోవచ్చు, బిడ్డలు అక్కర్లేని వాళ్ళకి గర్భం కలిగితే, అది తగిన డాక్టర్లచేత తీయించేసుకోడం వుత్తమం. కనడంకన్న. కాని ఇది చట్టవిరుద్ధం.

ఇష్టంలేకపోతే బిడ్డని కనక్కర్లేదు. కాని పొరపాటున పుడుతుందేమో దానికి సిద్ధంగా వుండాలి. పుట్టాక యింత యావశ్శక్తిని వినియోగించి దాన్ని సుఖపెట్టాలి. బతికించాలి. తల్లికోసం, బ్రతకాలనే ఆ బిడ్డ ఆసక్తి కోసం, వైద్యం, జ్ఞానం, తెలివి మీకు సాయిపడాలి. పశ్చిమ దేశాల్లో సాయి పడ్డాయి. మరణసంఖ్యా లెఖ్ఖలూ ఎదటనున్నా, జాతకాలూ, కర్మా మాట్లాడుతారు మనుషులు.

ఈ పద్ధతుల్ని అమలులోకి తీసుకొచ్చి, స్త్రీలకు బలవంతంగానైనా సరే జ్ఞానాన్నీ శిక్షణనీ ఇచ్చి,కాకపోతే ప్రభుత్వమే ఈ తల్లి రాక్షసులనించీ బిడ్డని తీసేసుకుని రక్షించే ప్రయత్నంచేస్తుంది. 'సోషలిజం' అంటే ఎంత గొప్ప కృతజ్ఞత కలుగుతుంది నాకూ ! ఇంకా ఎప్పుడు వొస్తుందా అని ఎంత తొందర నాలో! తక్కిన విలువలు ఎంత ధ్వంసం కానీ, ఈమాత్రం ఏ ప్రభుత్వమన్నా 'చెయ్యగలిగితే, బలవంతం తప్పకొని ఇతరుల్ని, ముఖ్యంగా దిక్కుమాలిన పిల్లల్ని హింసించకండా, పెద్దవార్ని ఎంత హింసించినా వొప్పుకుంటుంది నా హృదయం.

ఉత్తమ సంతానంకోసం ఏదో ముహూర్తాలు చూడడమూ, మొగ ఆడ బిడ్డల్ని నిర్ణయించుకునే పద్ధతులూ ఇవన్నీ మూర్ఖాలు. ప్రస్తుతం నాకు తెలిసినంతవరకు. గర్భచిహ్నాలు—

1. బహిష్టు కాకపోవడం.

2. రొమ్ములు పెద్దవి కావడం, నొప్పి. మొదటినెలలోనే కనబడుతుంది. క్రమంగా కొనలు ప్రాముఖ్యతనుపొంది నల్లబడతాయి.

3. వేవిళ్ళు.

4. మూడో నాలుగో నెలలో పొట్ట ఎదుగుతుంది.

5' నాలుగో నెలాఖరువించి బిడ్డ కదులుతుంది.

కడుపుతో వున్న కాలంలో — సుఖంగా ఆరోగ్యంగా వున్న స్త్రీలూ, కాయకష్టపడే మోటువాళ్ళూ ఏ జాగ్రత్తా పడనక్కర్లేదు. సృష్టి చూచుకుంటుంది.

కాని విద్యా నాగరికతా బస్తీజీవనం వ్యాపించిన కొద్దీ, శరీరంలో బలం తగ్గి, డాక్టరు అవసరం ఏర్పడుతోంది. వేవిళ్ళ రోజులనించి ప్రారంభమై, కాన్పు తరవాత ఒకనెలదాకా — ముఖ్యంగా మొదటి కాన్పుకి —

గొప్పవారి ఇళ్ళల్లో, ముసలిస్త్రీలు చుట్టూచేరి చేసే అల్లరి ఇంతా అంతా కాదు. పిల్లలున్న ఇంట్లోంచి ముసిలివాళ్ళవి తరమమన్నాను. గర్భిణీగా వున్నప్పుడే తరిమేస్తే మంచిది వాళ్ళని. తమ తల్లులూ, అవ్వలూ. సులభంగా పిల్లల్ని కన్న పద్ధతులే ఈ మనుమరాళ్ళకి కూడా పనికివస్తా యని వాళ్ళ వుద్దేశ్యం. ఏ మార్పునీ కొత్తపద్ధతుల్నీ అంగీకరించరు. అవి తప్పకుండా ఆ స్త్రీకేకాక వంశానికే, ప్రపంచానికే ఉపద్రవం కలిగిస్తా యని వాళ్ళ వుద్దేశ్యం. తమ పాతపద్ధతుల ప్రకారం గర్భం పోయినా, తల్లి చచ్చినా అప్పుడైనా ఆలోచనన్నా కలగదు. దాని ఖర్మమంటారు వాళ్ళు యీ పద్ధతుల్నే యింకో నిర్భాగ్యురాలిమీద ప్రయోగిస్తారు. ఆ గర్భం తెప్పించిన మొగవాడు గడ్డికి కంకెవేయించిన గాలి ఎంత బాధ్యత వహిస్తుందో అంతే వహిస్తాడు. భార్యనీ, పిల్లల్నీ, యీ ముసలమ్మలక్క వప్పచెప్పి తమపనీ, సంపాదనా, క్లబ్బూ, స్నేహితులూ, సినీమాలూ, చూచుకుంటూ వుంటాడు. ఇంత డబ్బు ఇంటో పడెయ్యటంతో తన బాధ్యత తీరిందనుకుంటాడు, ఇంటో తగాదా పెట్టాడా, ముసిలమ్మలతో, వాళ్ళు వదులుకుంటే కాపరం బాధ్యతకూడా తన నెత్తిమీద పడుతుందనీ, తన సుఖాలు వదులుకోవలసి వొస్తుందనీ బెంగ. అందుకనే దిక్కులేని భార్యనీ, పిల్లల్నీ, ఈ రాక్షసులకి వొదులుతారు. ఈ ముసిలివాళ్ళని నరక వలసిందేగాని, జ్ఞానంతెప్పిస్తామనుకోడమంత తెలివితక్కువ ఎక్కడాలేదు.

ఆరోగ్యమూ, బలమూ, లేని స్త్రీలు గర్భం మూడో నెలలోపల డాక్టరుకి చూపించుకోవాలి. చివరి నెలలో ప్రతి వారమూ డాక్టరుచేత పరీక్ష చేయించుకోవాలి.

1. సుఖరోగాలు.

2. నెత్తురు తక్కువ.

3. మూత్రంలో అల్బుమిన్.

4. అవయవాలలో లోపాలు.

5. జాడ్యాలు.

ఇట్లాంటివి తల్లి ప్రాణానికీ, బిడ్డ ప్రాణానికీ, ఆరోగ్యానికీ, భంగంచేస్తాయి ముందే జాగ్రత్తపడకపోతే నమ్మకమైన డాక్టరు దగ్గిరికి వెళ్ళి ఆమె చెప్పినట్టు అవసరమైతే చికిత్సను పొందాలి.

# గర్భం నెలలలో

1. ఎక్కువ శ్రమఐన పని చేయకూడదు — పెద్దబరువు లెత్తడం మొదలయినవి.
2. సోమరిగా కూచోకూడదు. మామూలుపని చేసుకోవాలి. ఏ పనీ చెయ్యని స్త్రీలు ఇప్పుడు తమ శరీరం సులభంగా భరించే టంత పనివి ప్రారంభించాలి. శుభ్రమైన గాలిలో తిరగాలి.
3. సంతోషంగా వుండాలి.
4. మంచి పుస్తకాలు చదవడం—మంచి ఆలోచనలు చెయ్యడం—పుట్టబోయ్యే శిశువుకి సహాయంచేస్తాయి — అనడం చాలవరకు మూర్ఖంగా తోస్తుంది. ఎక్కడో ఏదో పోలిక కలిగిందని ప్రతి వాళ్ళకీ అది బోధిస్తే సాధ్యమయ్యేదీకాదు, ఉపయోగమూ లేదు.
5. గర్భంమీద దెబ్బ తగలనియ్యకూడదు.
6. వీలైనంతవరకు సంభోగం మానాలి.
7. పెద్ద ధ్వనులూ, భయాలూ కలిగే పరిస్థితులకు దూరంగా వుండాలి.

8. ఎవరన్నా కొనుపులూ, ఆ కష్టాలూ మాట్లాడుతోవుంటే, విన కూడదు. ధైర్యముంటే ఆ మాట్లాడే వాళ్ళ నెత్తిమీద పెద్దరాయి విసిరి వెయ్యాలి.

9. భూతాలూ, చచ్చిన బంధువులూ, గ్రహణాలూ, ఈ పిచ్చి నంతా మనసుకి దూరంగా వుంచాలి.

ముఖ్యంగా ముసిలమ్మలూ, పొరిగింటి స్త్రీలూ, కష్టమైన కాన్పులూ, కనలేక చావడాలూ, ఘోరాలూ వర్ణించి చెపుతో వుంటారు. స్త్రీ నెప్పులు పడుతో వుంటే, పనిలేక కూచుని స్త్రీలు ఘోరమైన చావుల్ని వర్ణించు కుంటో వుంటారు. ముసలివాళ్ళని ఇంటో వుణ్ణియ్యవద్దు. పొరుగు స్త్రీలు ఈ సంగతులు మాట్లాడితే అక్కణ్ణించి లేచిపోవాలి-తరిమెయ్యాలి తన్ని.

10. బలమైన ఆహారం తినాలి. నారింజపండ్లూ, పాలూ, ఆకు కూరలూ ముఖ్యం.

ఆఖర్న బైటవున్న చివరి రోజునించి దాదాపు 280 రోజులకి కాన్పు వొస్తుంది.

ఆరో నెలనించి రొమ్ములమీద శ్రద్ధ తీసుకోవాలి. పొద్దున్నా, రాత్రీ సబ్బుతో, వేడినీళ్ళతో కొనలు కడగాలి. కొంచెంగా ఆ కొనల్ని ముందుకులాగి, వేళ్ళసందుల నలపాలి. ఇది ఎవరికివారే చూచుకోవాలి.

వేవిళ్ళూ, గుండెలో మంటా, నడుంలో నెప్పి, కాళ్ళు తీపులూ, నరాలు లాగడం, కడుపునరాలు బిగపట్టడం — ఈ బాధలకి డాక్టరునించి చికిత్స పొందాలి.

ఏ నెలలోనన్నా నెప్పులుగానీ, రక్తంగానీ కనపడితే, గర్భ స్రావం కలుగుతోందన్నమాట. కదలకండా పడుకుని డాక్టరుకి కబురు పంపాలి.

## కాన్పు :

ఇదివరకు ఎందుకన్నా ముసలమ్మల్ని వెళ్ళగొట్టకండా వుంచే నెప్పులు ప్రారంభం కాగానే వెళ్ళకొట్టండి. గదిలోపెట్టి తాళం వెయ్యండి.

పాతపద్ధతులూ — పూతపొగ — చీకటిగదులు — మూలుగులు — రామ నామాలు—అన్నీ ఏం చేసినా చెయ్యకపోయినా, కనే స్త్రీని నరకబాధ పెట్టి స్తాయి. తన బతుకుమీదా, భర్తమీదా, పుట్టిన బిడ్డమీదా రోతనీ, భయాన్నీ, ద్వేషాన్ని కలిగిస్తాయి.

మొదటి నెప్పులు కనబడగానే కొత్తపద్ధతుల్లో తర్ఫీదై, అనుభవం గలదీ, మంచిదీ, సంతోషంగా వుండేదీ ఐన మంత్రసానిని పిలిపించాలి. ఆమె అవసరమంటే డాక్టర్ని పిలిపించాలి.

బిడ్డ పుట్టగానే—గోరువెచ్చ నీళ్ళ స్నానం చేయించాలి. మసిలే నీళ్ళు పొయ్యకూడదు. బిడ్డకి ఏమీ తాగించకూడదు. ఆముదం అసలు తాగించకూడదు. వొంటికీ తలకీ రాయవొచ్చు. సిల్వర్ నైట్రేట్ సొల్యూషన్‌తో కళ్ళు తుడవాలి.

## తల్లి :

కన్న తరవాత వుపవాసా లుండడం మూర్ఖాచారం. జావ, కాఫీ, టీ, రొట్టె — తీసుకోవచ్చు. కదలకండా పడుకోవాలి. ఆరుగంటల తర వాత బిడ్డకి తన స్తన్యాన్నివ్వ వచ్చును. పురిటింటి కిటికీలను ముయ్య కూడదు—మరీ ఎండాకాలంలో, మరీ చలికాలంలో తప్ప. మోటు మనుషులు కాన్పు ఐన వెంటనే లేచి పనులు చేసుకుంటారు. నాగరికులు 14 దినాలు కన్న ఎక్కువకాలం పడుకుని ఉండనక్కర్లేదు.

'పుట్టినప్పటినించీ బిడ్డ జాగ్రత తీసుకోవాలని'— ఎన్నివేల సార్లో వ్రాయాలనిపిస్తోంది. ధ్వజ స్తంభాలమీదకెక్కి— అరవనా — కనపడ్డ ప్రతి స్త్రీతోనూ వెర్రిగా అననా—ఎట్లా ఎట్లాఅని వూరికే పెనుగులాడుతుంది మనసు.

అంత కష్టపడి మీరు కనుకున్న బిడ్డకి మీరు తప్పించలేని బాధలు, లోకం పెట్టేవి, ఆ బిడ్డే తెచ్చుకునేవి, ఎవరివల్లాకాక వాటంతట అవే కలిగేవి ఎన్నో లక్షలున్నాయి. కన్న నిమిషాన కడుపులోనుంచి తెరలుగా పైకి వొచ్చిన ప్రేమని మరిచిపోకండి. బిడ్డని పారెయ్యండి, చంపండి, కాని బాధపెట్టకండి. అందులో ప్రేమపేర, తల్లి ధర్మకింద గొప్ప పేర్లతో బాధించకండి.

లోకంలోకి రాగానే బిడ్డ మాంసం వుడికేట్టు నీళ్ళు, నోట్లో మధురమైన ఆముదంతో ఆహ్వానించకండి.

ఈ పుస్తకమంతా అందుకే బిడ్డల్ని హింసించకుండా వాళ్ళచేత మీరు హింసపడకండా వుండే మార్గం చూపడానికే వ్రాశాను.

అసహాయులు. పిచ్చిగా మీ వంక సంపూర్ణ విశ్వాసంతో గుడ్లు పైకెత్తి చూచేవాళ్ళు. మీరు ప్రేమతో రక్షిస్తారని నమ్మి మీ యింటికి వచ్చిన అతిథులు—నోరులేని పసిబిడ్డలు— వాళ్ళని బాధించకండి. మీ పిల్ల కోసం అవసరమైతే యీ సంసారాన్నీ, భర్తనీ, ప్రియుల్నీ, బంధువుల్నీ, అన్నిటినీ త్యజించండి. మీత్యాగంవల్ల మీ బిడ్డనించి మీకేమీ రాకపోవచ్చు. కాని మీ ప్రేమ, మీ దయ, మీ జ్ఞానం మీ బిడ్డ జన్మహక్కు. బిడ్డకన్నా ఇతరమైన, బిడ్డకన్న శ్రేష్టమైన, అవసరాలూ విలువలూవుంటే, బిడ్డని కనకండి.

ఇతరమైన ఆశయాలకి లొంగి మర్యాదలకీ, మీ సౌఖ్యాలకీ బిడ్డ సౌకర్యాన్ని వదులుకోవలసివస్తే బిడ్డను కనకండి. గర్భస్రావం శిశుహత్య — శిశువుని బాధించడంకన్న నయం. వంట తొందరగా కావాలనీ, భర్త కామం తీర్చాలనీ, పెద్దలు గౌరవాలు విలపాలనీ, సినిమాలకి వెళ్ళాలనీ, పేరంటాలూ, మీటింగులు జరపాలనీ, బిడ్డల్ని వాళ్ళ బాధకి వాళ్ళని వొదిలే మహాతల్లుల్ని చూస్తున్నాను.

ఈ తల్లులు తమ బిడ్డల్ని చూసుకున్నంత నిర్లక్ష్యంతో స్నేహి తుల్నీ, బంధువుల్నీ చూస్తే వాళ్ళు ఆగ్రహపడి మళ్ళీ గడపతొక్కరు. నోరూ కాళ్ళూలేని దిక్కుమాలిన పిల్ల ఏం చేసినా అట్లా పేళ్ళాడుతుంది. ఇంట్లో—చావు విముక్తినిచ్చిందాకా! అప్పుడు అంత గొప్పగొప్ప అరుపులు, సోకాలు, రాగాలు, కవిత్వాలు, చెప్పుకోడాలు, నలుగురూ గొప్ప చెయ్య డాలు, పిల్లమీది వర్ణనలు; గొప్ప సింపతీలు!

'ఎంత క్రూరుడూ, బుద్ధిహీనుడా దేవుడు. ఈ తల్లులచేతికి పిల్లల నిచ్చేందుకు' అనుకుంటాను. ఎంత కసి మానవజాతి మీద! ముఖ్యం పసి పిల్లలమీద ఆ దయాసముద్రుడికి! పైగా నోరులేని వాళ్ళని నిస్సహాయుల్ని చెయ్యడం! ఎంత కరుణ!

పిల్లలి సౌఖ్యం: పిల్లలి హక్కులు — అనేటప్పటికి వెర్రిగా "వీడికా పిచ్చి? మాకా పిచ్చి?" అన్నట్టు చూస్తారు మనుషులు.

"ఏవో వాళ్ళని దయగా చూస్తాం. అంతకన్న ఏం చెయ్యాలి?" అన్నారు లీలగారు, నాలోనించి నా నరాలలో స్పందనాలు వినగలిగిన లీలగారు.

గుండె ఆగింది. ఇంక లోకంలో ఎవరిని నమ్మించగలను? నేను పడే యీ బాధ, యీ కరుణ, యీ పెనుగులాట! అంత అబద్ధమా? నాలోనేనా? పిల్లలు బాధపడరా?

ఏ విషయాన్నీ జాగ్రత్తగా చూచి, హద్దు లేర్పరచి, లోకము తెలుసుకునే లీలగారు.

బిడ్డ సౌఖ్యంముందు ఏ ధర్మమూ తృణప్రాయమన్న నా మాట లట్లా చేశాయా?

అవును. స్త్రీబాధా. పిల్లలబాధ అనేటప్పటికి లోకపు విలువలు తారుమారౌతాయి నా కళ్ళముందు.

తల్లిప్రేమ, విద్య, వివాహం అనే మూడు భూతాలనించి తప్పించు కుంటేనేగాని విముక్తి కనపడదు, పిల్లల జీవితంలో నాకు.

అందువల్లనే ఈ కాపరాలన్నా, యీ పాఠశాలలన్నా నా కింత కోపం !

ఇదంతా మరీ వెర్రి అనుకున్నా మీరు, మీకు నచ్చినవన్నా అంత వరకన్నా అనుష్టించండి. నన్ను తిట్టండి, తరమండి, కాని మీ పిల్లల్ని బాధల్నించి రక్షించండి—ముఖ్యం మీరు వాళ్ళనిపెట్టే బాధల్నించి ఎప్పటి కన్నా, ఏ జాతులన్నా, ఏ జీవులన్నా తిరగబడి తప్పించుకోగలరు. జ్ఞాపకం తెచ్చుకోండి—పంచముల సౌఖ్యం, హక్కులూ అంటే, బానిసప్రజల దేశ స్వతంత్రపు హక్కు అంటే. స్త్రీల హక్కులంటే, సమానత్వ మంటే అర్థంగాక తాగివచ్చారని చూసినరోజూవు. కాని ఏనాటికో ఏ ఉద్బోధవల్లనో, ఏ సిగ్గూ, బాధా భరించలేకనో, వాళ్ళు ఏనాటికో, మీ నెత్తిమీదకొట్టి, మీ కళ్ళు తెరవక మానరు. జంతువులు కూడా తమని తాము కాపాడుకుంటాయేమో ! ఏ నాటికో తెలివితెచ్చుకుని, జింకలూ, చిలకలూ, మీకు చిక్కకండా ఉపాయాన్ని కనిపెడతాయేమో. ఆవులూ గేదెలూ మీ దొంగ స్తోత్రాలనించీ, పాలు పితకడాలనించీ, దూరంగాపోతా యేమో ! కాని యీ పిల్లలు ఎప్పుడూ సమ్మెకట్టలేరు. తెలివి తెచ్చుకో లేరు. ధిక్కరించలేరు. ప్రార్థించలేరు. నోరులేదు. శక్తిలేదు. మీలో అపారమైన విశ్వాసంతప్ప 'మాకు దయలేదా ! ఇట్లా వ్రాస్తాడు ?' అను కుంటున్నారు. కాని బిడ్డని మీ సౌఖ్యాలకోసం, మర్యాదలకోసం ఎంత వ్యథపెడతారో ఆలోచించుకోండి.

వూరికే ఏడుస్తారు. మీరు పెట్టే బాధలూ, శిక్షలూ, మీ స్వార్థాలూ, అన్నీ తమ బాగుకోసమే నని నమ్ముతారు. ఈ విషయం అలిగి రెండో నిమిషం మీ దయకోసం దగ్గిర చేరతారు. పాపం ఆ పిల్లలు, వాళ్ళని బాధించినా మీ భయాలతో, కోపాలతో వాళ్ళమంచికోసమే ననుకుంటారు.

"ఇదివరకంతా పెద్దలకోసం పిల్లల త్యాగం బోధిస్తే, ఇప్పుడు పిల్లలకోసం పెద్దల త్యాగం బోధిస్తున్నారు"—అన్నారు లీలగారు.

నిజమే. ఆ త్యాగమూ ఈ త్యాగమూ సహజమే. త్యాగం దేని కోసం? పిల్లల్ని సృజించిన మన బాధ్యతకోసం, పిల్లలు హింసపడకండా త్యాగం—పిల్లలు పెద్దల్ని మానుకోలేరు, పెద్దలు పిల్లల్ని తప్పించుకో లేరు. త్యాగం చెయ్యలేని వాళ్ళు కనకండి. 'మీరు ఆడుకోటానికీ మీ దాబు లకీనా పిల్లల్ని కని హింసించడం'?

సృష్టి మీలో పెట్టిన దయ సహాయపడకపోతే పిల్లలకింక దిక్కు లేదు. ఆవుని గోమాత అని పూజిస్తో, దాన్ని చంపుతున్నారని మహమ్మ దీయుల రక్తాన్ని చవిచూస్తో, ఆ ఆవు తను కన్న దూడకి పాలిచ్చుకో కండా దాని కళ్ళముందే ఆ దూడని కట్టి, ఆ దూడకి పాలు రుచిచూపి, లాగేసి, ఓ చుక్క మిగలకండా పాలు పితుక్కోడంలో సహస్రగోవుల హత్య గోచరించని మీకు, ఆ ఆవుబాధ దూడబాధ మీ మనసులకి తెలీని మీకు, నాగోల వినబడుతుందా?

ఒక్కటేవిధం. ఏ దయగల సోషలిజమో, ఏ డిక్టేటరో బిడ్డ బాధ పడుతున్నట్టు తెలిస్తే, తలితండ్రుల్ని కొరత వేయించడమో, లేకపోతే బిడ్డల్నందర్నీ ప్రభుత్వమే పెంచడమో చెయ్యాలి. అదొక్కటే మార్గం కనబడుతుంది.

## పెంచడం

1. బిడ్డకి ప్రతిపనీ ఒకటే వేళకు చెయ్యాలి.

2. బిడ్డకి ఏమీ 'నెర్వస్ ఎక్సయిట్‌మెంట్' లేకండా చూడాలి.

3. శుభ్రమైన గాలి నివ్వాలి.

4. అన్ని పనులలోకి ముందు బిడ్డపని చూడాలి. బిడ్డపనికోసం అవసరమైతే తక్కిన పనుల నన్నింటినీ వొదులుకోవాలి. కాని అవసరం లేందే బిడ్డదగ్గిర కూచోకూడదు. ఎత్తుకోకూడదు. ఆడించకూడదు. దాని టైమూ, హద్దూ వుండాలి.

పొద్దున్నే పాలు.

దొడ్డి.

బైట గాలికి పడుకోబెట్టడం — ఒక గంట ఇది. ఒకనెల ఎదిగిం తరవాత—గాజుపులూ, చలీ, వానా వున్నప్పుడు వరండాలో పడుకోబెట్టాలి.

స్నానం.

## 10 గంటలకి

పాలు, దొడ్డి, తల్లి ఆడించడం—ఓ పావుగంట నిద్ర.

2 గంటలకి మధ్యాన్నం పాలు.

నిద్ర.

సాయంత్రం బైటగాలికి పడుకోబెట్టడం.

స్నానం.

## 6 గంటలకి

సాయంత్రం పాలు

తల్లితో ఆట—

నిద్ర—చీకటి పడకముందే.

రాత్రి పదింటికి పాలు.
దొడ్డి.
నిద్ర.

## పాలు :

మొదట వారమైన తరవాత నాలుగు గంటలకోసారి పాలుపట్టాలి. రాత్రి పదింటినించి తెల్లవారిందాకా ఏ ఆహారమూ అనవసరం. రాత్రి బిడ్డ ఏడిస్తే కారణం కనుక్కోవాలిగాని వూరికే పాలుపట్టకూడదు. అవసరమనితోస్తే, దాహమేసిందనుకొంటే చక్కెరనీళ్ళు పట్టవచ్చు.

నిద్ర — నిద్రకోసం జోలపాడడం మొదలైనవి ఏమీ చెయ్యనక్కర్లేదు. ఉయ్యాలలో వూపకూడదు. చిన్నమంచమూ, జంపకానా చాలు.

బిడ్డ రాత్రులు లేవకూడదు. బిడ్డ లేస్తే బిడ్డకి ఏదో ఇబ్బంది వున్నదన్నమాట. దోమలో, వుక్కో, వొంటో అస్వస్థతో.

స్తానం—ఆరుబైట స్తానం మంచిదికాదు. చలిగాలి తగలకూడదు. గోరువెచ్చగా వుండాలి నీళ్ళు. స్తానం ఆహ్లాదకరంగా వుండాలి. బిడ్డకి సబ్బుతో కలిగితేచాలు. నూనె వదలడానికి మెత్తని సున్నిపిండి వుపయోగించవొచ్చు. ముందు తల, ముఖం తోమి, పొడిగా తుడిచెయ్యాలి. తరువాత వొళ్ళుకడిగి తుడవాలి.

ఆరునెలల తరవాత స్నానం పొద్దున్న చల్లని పీటితోనూ, యాడాది తరవాత రెండుసార్లూ చన్నీళ్ళతోనూ స్తానం చేయించాలి. ఆరునెలల తరవాత వారానికి రెండుసార్లు తలస్తానం చాలును. యాడాది తరవాత వారానికి ఒకసారి.

ఆరోనెలనుంచి బిడ్డ స్నానం సంతోషంగా ఆడుకుంటో నవ్వుతో చెయ్యాలి. యాడాదప్పుడు తనవొళ్ళు తోముకోడానికీ, తుడుచుకోడానికీ ప్రయత్నం చెయ్యాలి.

స్నానం బిడ్డకి సౌఖ్యాన్నివ్వాలి. చాతనైనంతవరకు ఇబ్బంది కలిగించకుండా చూడాలి. బిడ్డ ఏడవకుండా నీళ్ళుపోసుకోడమే ఆదర్శం. "మురికి" అనే పెద్ద చాదస్తం పెట్టుకుని బిడ్డని ఒకటే రుద్దకూడదు. "స్నానం చేయించడం తప్పదు. ఏడవనీ, ఏం చేస్తాం!" అనే విధంగా వుండకూడదు తల్లిమనసు.

## దొడ్డి:

ఉచ్చపోసేప్పుడూ, బిడ్డ దొడ్డికి వెళ్ళేటప్పుడూ, బిడ్డని కదిలించకూడదు, విసుక్కోకూడదు, తిట్టకూడదు; తల్లి పట్టుచీరమీద, అత్తనెత్తిమీదా, తండ్రి ఆఫీసు లాంకోటుమీదా, సోఫామీదనైనాసరే. బిడ్డని తటాలున లాగెయ్యకూడదు. నెమ్మదిగా, చిరునవ్వుతో ఎత్తి అవతల కూచోపెట్టాలి.

పాలు తాగగానే దొడ్డికి వెళ్ళడం నేర్పాలి. మూడో నెలనించి ఓ గిన్నెలో బిడ్డని ఎత్తి పట్టుకోవచ్చు. ఎప్పుడూ బిడ్డని అదిలించడం, కోపపడడం చెయ్యకూడదు. ఎప్పుడూ ఆ పనులు సంతోషంవల్లా ఎంకరేజ్‌మెంట్ అండ్ ప్రయిజ్‌వల్ల జరపాలి.

బిడ్డకి మూడు నెలలు నిండేదాకా గిన్నె వొళ్ళో పెట్టుకుని బిడ్డని దాంటోకి ఎత్తి పట్టుకోవాలి. బిడ్డకి సుఖంగా వుండాలిఆపద్ధతి. అది వాక అలవాటుగా ఏర్పడాలి.

## ఆట:

మూడోనెల నించి బిడ్డకి గిలకలిస్తే చాలు ఆడుకుంటుంది. బిడ్డని ఆటలకి వొదలాలి. తల్లిగాని, బంధువులుగాని, పెద్దపిల్లలుగాని, ఆ బిడ్డ దగ్గిర

కూచోడం, ఆడించడం, నవ్వించడం చెయ్యకూడదు. బిడ్డని ఎత్తుకో కూడదు. ఎత్తుకోడానికి నౌకర్లని పెట్టకూడదు. శుభ్రమైనచోట పడుకోబెట్టి వొదిలేసి ఓకన్ను అటువుంచాలి. అంతే.

## తల్లిపాలు :

బిడ్డకి తల్లిపాలు జన్మహక్కు. ఏ కారణంవల్లా తల్లి బిడ్డకి పాలు ఇవ్వకండా వుండకూడదు. పాలివ్వని తల్లులు దగ్గర్నించి బిడ్డల్ని తీసుకు రక్షించటానికి ప్రభుత్వానికి శాసనాలువుంటే మంచిది. తల్లిపాలు తాగడం వల్ల బిడ్డకి ఆకలి తీరడమేకాదు; చాలా ఆరోగ్యకరంగా, సంతుష్టికరంగా, సహజమైన ఆహారంతో ఎదగడమేకాదు; తల్లి స్తన్యంతోబాటు, గొప్ప సౌఖ్యాన్ని, తల్లిప్రేమని, ఏదో చెప్పలేని శక్తిని బిడ్డ తాగుతుంది. తల్లికి నరాలలో, హృదయంలో గొప్ప శాంతీ, సౌఖ్యం కలుగుతుంది. పాలివ్వని తల్లుల నరాలు అశాంతికి లోనుకావడం వింతకాదు. కొంతమంది తల్లులకి పిల్లలకి ఇవ్వాలన్నా పాలు లేకపోవడం సర్వసాధారణమౌతోంది. పిల్లకి ఇవ్వడానికి పాలులేని తల్లి, ఇతర విధాల ఆరోగ్యంగా కనపడ్డా ఆరోగ్యంగా లేదన్నమాట, అసహజమైన జీవితం గడుపుతోందన్నమాట.

బిడ్డకు పాలు యెట్లా పట్టాలో, యెప్పుడు పట్టాలో సహజంగానే చాతనవుతుంది. కాని సహజంగావుండే తెలివిని యీ పనులలో, అవసరాలలో, మర్యాదలలో, భర్తల ఆర్డర్లలో పోగొట్టుకుంటున్నారు తల్లులు. కనక వివేకాన్ని చెప్పించుకోవలసిన గతిపట్టింది ఈ తల్లులకి.

ప్రతిసారీ రెండు రొమ్ములూ ఇవ్వాలి పిల్లకి. 15 నిమిషాలతరవాత ఇంకా కుడుచుకోనీకూడదు. కుడుచుకుంటో బిడ్డని నిద్రపోనీకూడదు. లేపుతామనే భయంతో రొమ్ముని అట్లా వొదిలి వుండకూడదు.

పాలు యిచ్చిన ప్రతిసారీ రొమ్ముల్ని పూర్తిగా ఖాళీ చేసుకోవాలి. బిడ్డ పాలు తాగుతున్నప్పుడే రొమ్ముల్ని పైనించి క్రిందికి చాలా మృదు

వుగా నొక్కితే పిండవచ్చు. బిడ్డకి కావలసినదానికన్న పాలు యెక్కువ వుంటే బిడ్డ తాగడమైన తరవాత పైనించి కిందికి రాస్తో పిండెయ్యాలి. ఇట్లా చెయ్యడంవల్ల ఇంకా పాలు పడతాయి, పాలు తక్కువైనపుడు.

## పాలు పడకపోవడానికి కారణాలు :

1. అదుర్దా – పిల్లకి పాలు సరిపోతున్నాయో లేదో, అనే అదుర్దా ఒక కారణం—పాలు యెండిపోవడానికి. సంతుష్టిగా, సంతోషంగా వుండాలి తల్లి. చిరాకులూ, నెర్వస్ స్ట్రెయిన్ అండ్ వర్రీస్ పనికిరావు. పోట్లాటలూ, వ్యవహారాలూ, పనీ, అన్నీ చెడుగుచేస్తాయి.

2. బలహీనం, వెలుతురు, గాలి, వ్యాయామం, టానిక్కులు అవసరం.

3. చాలాపని, అలసటా.

## ఈ తల్లులు పాలివ్వకూడదు :

1. క్షయరోగమూ, హృదయరోగమూ గల తల్లులు.
2. దీర్ఘరోగం కలవారు, వెర్రివారు.
3. రొమ్ములమీద కురుపులు కలవారు.
4. పాలిస్తే జబ్బు చేసేవారు.

## పాలిచ్చే తల్లి :

1. మరీ యెక్కువ భోజనము చేయకూడదు.
2. మలబద్ధకము లేకుండా చూసుకోవాలి.
3. పళ్ళూ, ఆకుకూరలూ తినాలి యెక్కువగా. పాలూ, బలమైన ఆహారమూ తీసుకోవాలి. తల్లికి పాలు పడనప్పుడూ, పాలు తక్కువైనప్పుడూ కారణం తెలుసుకోడానికి డాక్టరుకిచూపాలి.

ఆకుకూరలు తినాలి. యెక్కువగా నీళ్ళుతాగాలి. పాలుతాగాలి. కాల్షియం మందుగా తీసుకోవాలి.

## పాలిచ్చే రొమ్ములు జాగ్రత్త :

రాత్రంతా రొమ్ముని పిల్లనోట్లోపెట్టి, వొదిలి నిద్రపొయ్యే తల్లు లంత అవివేకులూ, అసహ్యమైనవాళ్ళూ వుండబోరు. బిడ్డ ఆరోగ్యానికి గాని, తల్లి ఆరోగ్యానికిగానీ అదేమీ మంచిదికాదు. రొమ్ము అలవాటైె బిడ్డ అన్నివేళలా యేడుస్తుంది. అప్పుడు బిడ్డకి దెబ్బలు.

పగలైనా పాలివ్వడం 20 నిమిషాల్లో ఐపోవాలి. వెంటనే తల్లి తన స్తనాన్ని తీసేసుకోవాలి. వేళకానప్పుడు ఎంతఏడ్చినా రొమ్మునింక బిడ్డకి చూపకూడదు.

పాలిచ్చేముందు రొమ్ము చివర్లని నీళ్ళతో కడగాలి. పాలివ్వడం కాగానే పొడిగా తుడవాలి. చివర్లు నెప్పిగావుంటే నూనెరాయి. పగుళ్ళు కలిగితే బోరిక్ లోషనుతో కడిగి, గ్లిసరిన్ పుయ్యి.

రొమ్ముల సంగతి జాగ్రత్తపడితే పాలనెలలు ఐపోగానే, ముందు మల్లేనే రొమ్ములు అందంగా మంచి ఆకారంగా చిన్నగా అయిపోతాయి.

## దాదులు :-

తల్లిపాలు బిడ్డకు చాలక పోయినపుడే దాదినిపెట్టి ఆ వెలితి భర్తీ చేయించాలి. కాని తల్లి మాత్రం పాలివ్వడం మానకూడదు.

పాలు బాగావున్న ఆమెనూ, పిల్లలమీద దయకలిగిన ఆమెనూ — నమ్మకమైన మనిషినీ కుదర్చాలి. ఆమెనూ, ఆమె బిడ్డనూ ఇంట్లోనే

ఉంచుకుని భోజనంపెట్టడం తప్పదు. ఆమె బిడ్డకి పాలు ఇవ్వగా పాలు మిగిలితేనే, మీ బిడ్డకి — మీరెంత గొప్పవారైనా, మీ బిడ్డ మీకు యెంత ముఖ్యమైనా ఆమె బిడ్డకన్న యేమీ యెక్కువని తలుచుకోకూడదు. ఆమె పాలు ఆమె బిడ్డ హక్కు. ధనం ఆశపెట్టి ఆ పాలు మీరు తీసుకోడం దోషం. ఇట్లాంటి అక్రమానికీ, దూడ నోరుకొట్టి గొడ్లపాలు తాగే యీ శాఖాహారుల ఘోరకృత్యాలకి యే యముడూ శిక్ష విధిస్తాడని లేదు శాస్త్రిలలో.

## దాది:

1. అంటురోగాలు లేనిదీ.
2. ఆరోగ్యమైనదీ.
3. యవ్వనవతీ.
4. ఆమె శిశువుకి మీ శిశువు వయసే ఐవుండాలి.

## చనుబాల వల్ల బిడ్డకి తృప్తి కలగకుండా వుండడానికి కారణాలు:

1. రొమ్ములు కఠినంగా వుండడం.
2. చాలినన్ని పాలు లేకపోవడం.
3. కుడుచుకోడానికి బిడ్డదగ్గిర శక్తి లేకపోవడం.
4. బిడ్డనోరు పగిలివుండడం.
5. పదేపదే పాలివ్వడం.
6. రొమ్ము అడ్డమై వూపిరాడకపోవడం.

దాది కుదరకపోతే ఆవు పాలు, మేకపాలు, లేక డబ్బా పాలు హార్లిక్స్, గ్లాక్సో, కౌ & గోట్ మొదలైనవి.

పిల్ల బలంగా వుంటి జీర్ణించుకోగలిగితే, శ్రద్ధగా తయారుచేస్తే ఆవుపాలే నయం.

ఆవు ఆరోగ్యమైనదిగా వుండాలి. దానికి క్షయలేదని పశువుల డాక్టరుచేత పరీక్షచేయించి తెలుసుకోవాలి. దాని దూడ పసిదై వుండాలి. దాని దూడకి చాలా పాలు మిగలాలి. దాని దూడకు రావలసిన పాలను మీ పిల్లకి యిప్పించుకోడం అన్యాయం.

ఆవు దగ్గిర నుంచుని శుభ్రమైన మీ పాత్రలో పాలు పిండించుకోవాలి. రెండు పూటలా వేరుగా పాలు తీసుకోవాలి. అంతేగాని పొద్దున్న పిండిన పాలు రాత్రీ, రాత్రివి తెల్లవారి పట్టకూడదు. పాలు తెచ్చిన వెంటనే కాగపెట్టాలి. పైట ఒక పెద్దగిన్నెలో నీళ్ళుపోసి; చిన్నగిన్నెలో పాలుపోసి, ఆ నీళ్ళమధ్య పెట్టి ఆ పెద్ద గిన్నెని పొయ్యిమీదపెట్టి పాలు పొంగేవరకూ ఆ నీళ్ళను కాచడం వుత్తమం. పాలను వెంటనే చన్నీళ్ళలో పెట్టి చల్లార్చాలి. యెప్పుడూ పాలకి మూతవేసి వుంచాలి. గిన్నెలూ, మూతలూ, సీసాలూ, గరిటెలు — అన్నీ చాలా శుభ్రంగా ప్రతిసారీ తోముతో వుండాలి.

పాలు పిల్లలకు పట్టేముందు ఆవుపాలకి సమంకొలత బార్లీగింజలు ఉడకపెట్టి తేర్చిన నీళ్ళనుగాని, సున్నంనీటి తేటనుగాని కలపాలి. బూరా చక్కెర ఒక గరిటెడు కలపాలి.

వీలయితే మీగడను ఒక చిన్న గరిటెడూ, చక్కెర బదులు 'లాక్టోస్' ఒక చిటికెడు సోడా సిట్రేట్‌నీ కలపాలి.

బార్లీనీళ్ళు—రెండు చిన్న చెంచాల బార్లీ గింజలను (రెండు పెద్ద గ్లాసులు) ఒక పైంటు (pint) నీళ్ళలో వుడకబెట్టి మూడువొంతులు మరిగిపోనిచ్చి ఆ నీళ్ళని ఉపయోగించుకోవాలి.

## సున్నపు నీరు :—

ఒక కోడిగుడ్డంత శుభ్రమయిన సున్నం ముద్ద ఓ పెద్ద సీసాలోవేసి దానినిండా మరిగిన నీళ్ళను పొయ్యాలి. మర్నాడు పైతేటను ఉపయోగించాలి.

బిడ్డ విరోచనంలో పెరుగు గడ్డలు కనిపిస్తే బార్లీ నీటి బదులు సున్నం నీరే కలపాలి.

విరోచనం ఆకుపచ్చగావుంటే చక్కెర యెక్కువ వెయ్యాలి.

విరోచనం సరిగా కాకపోతే మీగడ చేర్చాలి.

మీగడ యెక్కువైతే, వాంతులు కలగవొచ్చు, విరోచనంలో పేరుకున్న పాలు కనపడతాయికూడాను. ఈ పాళ్ళలో యే విధమైన హెచ్చు తగ్గులు కలిగినా, వాంతులూ, విరోచనాలు, కడుపునొప్పి కలుగుతాయి. అప్పుడు డాక్టరు సలహా తీసుకుని పాలలో మార్పు కలిగించాలి.

ఆవుపాలు పడకపోతే డబ్బాపాలు రెండురకాలు—

1. పాలు పేరుకోబెట్టినవి.

2. పాలు పొడుములు.

రెండోరకం మొదటిదానికన్న మంచిది. ఒక్కొక్క రకం డబ్బాపాలు ఒక్కొక్క బిడ్డకు పడతాయి. పడినప్పుడు ఆ డబ్బాపాలు ఇంకో రకానికి మార్చాలి. అవి యెట్లా తయారుచెయ్యాలో ఆ డబ్బాలమీద, వాటి చుట్టూ పెట్టే కాయితాలమీదా వ్రాసివుంటుంది.

పుట్టినప్పటినుంచీ బిడ్డకి పోతపాలేఐతే, పాలబుడ్డీలో పట్టవొచ్చును. కొన్నాళ్ళు రొమ్ముపాలు తాగిం తరువాతనయ్యేట్టయితే, క్రమంగా ఒక్కపూట పోతపాలతో ప్రారంభించి, క్రమంగా బిడ్డకి పాలబుడ్డీ అలవాటు చెయ్యాలి.

పోతపాలు పడుతున్నా తల్లి తన సొంతపాలు యిస్తున్నట్టే బిడ్డని యెత్తుకుని పట్టాలి. పాలుయిస్తున్నా, పడుతున్నా, తల్లి యింకోపని చెయ్యకూడదు. ఇతరులతో మాట్లాడనూ కూడా మాట్లాడకూడదు. పూజ అంత భక్తితో చెయ్యాలి. ఇతరులచేత పాలు పట్టించకూడదు. అన్ని పనులకన్న యీ పని అధికంగా చూసుకోవాలి. బిడ్డని వెలికిలా పడుకోబెట్టి పాలివ్వకూడదు.

పాలు పట్టేప్పుడు తప్ప తక్కినప్పుడు పాలబుడ్డీ బిడ్డ కంటి యెదుట ఉంచకూడదు. ఇప్పటికి అవసరమైన పాలకన్న యెక్కువ తయారు చేసుకోకూడదు. మిగిలిపోతే పారపొయ్యాలి.

## పాలబుడ్డి :-

కొమ్ము చెంబులు మొదలైనవి ఉపయోగించకూడదు. గాజువి, పాల బుడ్లు కొనాలి. ప్రతిసారీ పాలుపట్టగానే ఎత్తువించి నీళ్ళుపోస్తో కడిగి, చన్నీళ్ళ గిన్నెలోపెట్టి గట్టిగా ఆ గిన్నెకి మూత పెట్టి, పొయిమీద పెట్టి పదినిమిషాలు ఉడకపెట్టాలి. ఆ గిన్నెని అట్లానే, మళ్ళీ పాలవేళ వరకు బుడ్డీతో అట్లానే వుండాలి. ఆ బుడ్లు శుభ్రం చెయ్యడం నవుకర్లకు వదల కూడదు, వెడల్పు మూతులున్న బుడ్లు మంచివి.

## పాలపీకలు :-

పీకలోంచి సరిగా పాలు వొస్తున్నాయోలేదో చూడడానికి బుడ్డీలో పాలుపోసి కిందికి వొంచు. నిమిషానికి 16 చొట్లు కిందికి పడాలి. తక్కువైతే చిల్లులు పెద్దవి చెయ్యి. ఎక్కువైతే వేరేపీక తీసుకురా. బిడ్డ గట్టిగా కుడుచుకోవాలి. కుడుచుకోడంవల్ల కలిగే పరిశ్రమ బిడ్డ నోటికి అవసరం.

పాలు పట్టగానే పీకల్ని తీసి లోపలా బైటా వుప్పుతో రుద్ది కడిగి తుడిచి శుభ్రమైనచోట పెట్టు.

పోతపాలు పోస్తే, ఈ జాగ్రత్తలన్నీ తీసుకోవాలి. ఇవి ముఖ్యం కావనుకునేది, బద్ధకించేది, పైగా పోతపాలు పిల్లలకి పడవు అనేది, యీ తంత్రులూ, తాము పెట్టే పేడలూ తద్దినాలూ మడిబట్టలూ, వాడుగులూ గొప్ప అర్థంగలవీ, డాక్టర్లు చెప్పే యీ పద్ధతులు మూఢపద్ధతులూ, అని వీరి నమ్మకం.

నియమించుకున్న గంటల మధ్య బిడ్డ యేడిస్తే ఆకలి అనుకో కూడదు. ఏదన్నా కారణం కావచ్చు. సాధారణంగా అజీర్ణంవల్ల యేడుస్తుంది. అట్లాంటప్పుడు పాలుపట్టడం విషతుల్యం. వుత్త దాహంవేసి కూడా యేడుస్తుంది. అట్లాంటప్పుడు మంచినీళ్ళు పట్టాలి.

బిడ్డ బలవాలని అదేపనిగా పాలు పట్టకూడదు. మధ్యమధ్య తాగుతో ఆగుతో కాలయాపన చెయ్యకూడదు బిడ్డ. అంతా 20 నిమిషాలలో ఆఖరు కావాలి. పాలు వొంట పడుతోవుంటే బిడ్డ ప్రతివారమూ బరువు హెచ్చాలి. హెచ్చకపోతే వొంట్లో జబ్బో, పాలు తక్కువకావడమో, వొంటికి పడక పోవడమో జరుగుతోందన్నమాట.

ఆరోగ్యమైన బిడ్డ పుట్టినప్పుడు సాధారణంగా 7 1/2 పౌన్లు బరువు వుంటుంది. నెల పూర్తిగా ఐనప్పుడు :

| | | | |
|---|---|---|---|
| | | | 8 1/2 పౌన్లు |
| 2 నెలలు | .... | .... | 10 1/4 |
| 3 | .... | .... | 12 |
| 4 | .... | .... | 13 1/2 |
| 5 | .... | .... | 14 3/4 |
| 6 | .... | .... | 15 3/4 |
| 7 | .... | .... | 16 1/2 |
| 8 | .... | .... | 17 1/4 |

| | | | |
|---|---|---|---|
| 9 | .... | .... | 18 |
| 10 | .... | .... | 19 |
| 11 | .... | .... | 20 |
| 12 | .... | .... | 21 |

బిడ్డ పుట్టినప్పటి బరువు వంశంమీదా, తల్లి ఆరోగ్యంమీదా ఆధార పడి వుంటుంది. పుట్టినప్పటి బరువు వంశం వల్ల హెచ్చుతగ్గులుంటే ఆ హెచ్చుతగ్గులు అన్ని నెలలూ కనపడుతోనే వుంటాయి. బిడ్డ పుట్టినప్పటి బరువులో హెచ్చు తగ్గులు కనపడుతోన్నప్పటికి తల్లి అనారోగ్యం వల్లనైతే, పుట్టింతరవాత బిడ్డ జాగ్రత్త సరిగా తీసుకుంటే బరువు సరి కావొచ్చు చాలామట్టుకు.

## విరోచనం :

ఏ సహాయం లేకుండానే బిడ్డకి సహజంగా విరోచనం కావాలి. మొదటినెలలో రోజుకి ఆరుసార్లు, తరువాత రోజుకీ మూడు విరోచనాలు, విరోచనం కాకపోతే ఆముదం మొదలైన మందులు వాడకూడదు. బిడ్డ తాగే పాలలోనే ఉంటుంది మలబద్ధానికి కారణం. మొదటినెల గడిచిం తరువాత నారింజరసం పట్టాలి బిడ్డకి. కమలాలూ, టమాటో పళ్ళరసం ద్రాక్షరసం వాడవచ్చు. ఒక చిన్న చెంచా రసమూ, ఒక చిన్న చంచా నీళ్ళూ, కొంచెం చక్కెరా కలిపి పట్టాలి. ఆరో నెలలో రోజుకి 4 చంచాలు ఇవ్వాలి.

## పాలు తప్పించడం :

ఆరోనెలనించి బిడ్డని పాల నుంచి క్రమంగా తప్పించి పదోనెల పూర్తి అయ్యేలోపల, మొత్తానికి రొమ్ముపాలు తాగడం మాన్పించాలి. ఆటు తరువాత రొమ్ముపాలు తాగడం తల్లికీ పిల్లకీ ఎవరికీ మంచిదికాదు.

అదీగాక ఆటు తరువాత తల్లిపాలతో మాత్రమే బతకలేదు పిల్ల. ఒక్కసారిగా పిల్లని మాన్పించకూడదు.

తల్లి రొమ్ము మాన్పడానికి చేసే వెర్రి ప్రయత్నాలన్నీ మానాలి. నాలుగుసార్లు పాలుతాగే బిడ్డకి మూడుసార్లు పాలిచ్చి, ఒకసారి వేరే ఆహారం ఇవ్వాలి. లేకపోతే ముందు వేరే ఆహారమిచ్చి తరువాత కుతి తీరకపోతే రొమ్మునివ్వాలి. క్రమంగా వోపికతో చేస్తే, పాలు తప్పించడం కష్టమైన పనికాదు.

తల్లిపాలుగాక వేరే ఆహారం ఇవ్వడం, ఆవుపాలు ఇవ్వడంతో ప్రారంభించవొచ్చు.

బిడ్డ పెరగాలనే ఆత్రుతతో ఎక్కువ ఆహారం పొయ్యకూడదు. బిడ్డ అయిష్టం చూపినపుడు ఆహారం బలవంతంగా ఇవ్వకూడదు బిడ్డ చిక్కిపోతున్నాసరే. ఎక్కువ ఆహారంవల్ల బిడ్డ అమితంగా పెరిగినా, అదొక సుగుణం కాదు. బిడ్డ పెరగడానికి కూడా హద్దులు వుండాలి. బిడ్డకి యేడాది లోపల అన్నం కూరకూడదు.

ఆవుపాల తరవాత 10 వ నెలనుంచి సగ్గుబియ్యంజావ పట్టవచ్చు, దాంటో ఏవైనా కూరగాయలు వొండి పిడిచిఇవ్వవచ్చును.

బిడ్డని రుచిగల ఆహారాలకీ, కారానికీ, ఎక్కువ వుప్పుకీ అలవాటు చెయ్యకూడదు.

తరువాత బిస్కట్లకి అలవాటు చెయ్యాలి. కాని బిస్కటు త్వరలో తినెయ్యాలి బిడ్డ. అట్లా బిస్కటుని చీకుతో బిడ్డ కూచోకూడదు. కూరగాయల బదులు గుడ్లూ, మాంసము వుడికించి ఇవ్వవొచ్చును. ఆవుపాలు మాత్రం రోజుకి ఒక్కసారన్నా ఇస్తోనే వుండాలి. గుడ్లు పాలలో కలిపి ఇవ్వవొచ్చును. రొట్టె పెట్టవచ్చు.

## తొమ్మిదో నెలలో :

పొద్దున్నే - బిస్కట్లూ, ఆవుపాలు, 10 గంటలకి బిస్కట్టు— కందికట్టూ అది అయిన తరువాత ఆవుపాలూ.

2 గంటలకు కొంచెంగా వుడికిన గుడ్డు.

సగ్గుబియ్యం జీరా, బిస్కట్టూ లేక రొట్టె, తేనే, పాలూ, పళ్ళు.

సాయంత్రం 7 గంటలకి - రొట్టీ, పాలు,

రాత్రి – పాలు.

యీ గంటల మధ్య ఏమీ పట్టకూడదు. కాఫీ, టీ పట్టకూడదు. బిడ్డ తల్లిపాలు కుడుచుకోడం పూర్తిగా తప్పించగానే తల్లి తన రొమ్ములమీద ఒక గుడ్డ కట్టుకోవాలి. విరోచనాలకి మందు కొంచెం తీసుకోవడం మంచిది. రెండుమూలు రోజులు బాధని వోర్చుకోవాలి. తరువాత పాలని పిండి పారపొయ్యాలి.

## బిడ్డకి పళ్ళు మొలవడం :

ఏడోనెలలో మొదటిపళ్ళు ప్రారంభించి, చివరిని రెండేళ్ళు నిండే ప్పటికి అన్నీ వొచ్చేస్తాయి. మరీ ఆలస్యమైతే తప్ప ఏమీ అదుర్దా పడనక్కర్లేదు. బిడ్డని ఆరోగ్యంగా వుంచితే పళ్ళు వచ్చేటప్పుడు ఏ జబ్బూ చెయ్యదు. ఆ సమయంలో ఏ జబ్బు దేనివల్ల చేసినా, పళ్ళు మొలవడానికే ఆరోపిస్తారు. ఏ జబ్బూ చెయ్యకపోతే, అదేదో అనా రోగ్యమని భయపడే స్థితికి వొచ్చారు తల్లులూ, ముసిలమ్మలూ.

## కొన్ని నిబంధనలు :

1. ఆయాల్ని పెట్టకూడదు. పిల్లల్ని ఎత్తుకోడానికీ, దానికీ,ఎవరినీ నియమించకూడదు. నౌకర్లున్నా పని అంతా తల్లిపైన చేస్తోవుండాలి.

2. ఆహారం యీగలు వాలకండా, దుమ్ము పడకండా వుండాలి. ఈగలు వాలితే పారెయ్యాలి.

3. వండిన ఆహారం బజారులో కొనకూడదు.

4. రాత్రి నిలవవున్న ఆహారం వాడకూడదు.

5. బాగా కడగంది పళ్ళు వాడకూడదు.

6. తాగేనీళ్ళు ముందు మరగకాచి, మూతపెట్టి వుండాలి.

7. బిడ్డకి వీలైనన్ని ఎక్కువ నీళ్ళు పట్టాలి.

8. కిటికీలు తెరిచి వుంచాలి.

9. బిడ్డ పక్కబట్టలు వారానికి ఒకసారన్నా ఎండలో వెయ్యాలి.

10. బిడ్డని తాకక ముందు చేతులు కడుక్కోవాలి.

11. మందు తల్లితప్ప బిడ్డకి ఎవరూ పట్టకూడదు.

12. మురికి అయ్యే ఆటవస్తువులు, బొమ్మలు మొదలైనవి ఇవ్వకూడదు.

13. ఆహారమిచ్చిన గంటలోపల స్నానం చేయించ కూడదు.

14. బట్టలు వెయ్యకూడదు, చలిలో తప్ప.

15. ఎత్తుకోకూడదు. ఎత్తుకోడానికి నౌకర్ని పెట్టకూడదు. స్వేచ్ఛగా ఆడి దొర్లడానికి పాకడానికి వొదలాలి. బిడ్డకి తెలీకండా ఒకకన్ను బిడ్డమీద వుంచాలి.

16. ప్రతిరోజూ ఓ గంట ఎండ తగలాలి బిడ్డకి—అంటే నీరెండ.

17. బిడ్డ కాలం వీలైనంత వరకు ఆరుబైటా, వరండాలలోనూ గడపాలి.

18. బిడ్డకి కుడుచుకోవడానికి పాలపీకలూ, సూదర్లూ ఇవ్వకూడదు, నోట్లో వేలేసుకునే అలవాటు మాన్పాలి.

19. నగలు పెట్టకూడదు. ఏవీ వొంటికి కట్టకూడదు.

20. బిడ్డని బడాయిగా చూపుకోకూడదు.

21. చివాట్లూ, కోపం, దెబ్బలూ, ఏవీ పనికిరావు. అరవకూడదు.

22. బలవంతం కూడదు.

23. ఎప్పుడూ సంతోషంగా, దయగా, ప్రేమగా వుండాలి.

24. వెక్కిరించడం, ఖండించడం, నిరసనా, అసహ్యం చూప కూడదు. బిడ్డని ఏ విధానా అవమానించకూడదు.

25. బుజ్జగించి గొప్ప చెయ్యనూకూడదు.

26. బిడ్డ పాలుగాని, భోజనంగాని నిరాకరి స్తే ఎన్నడూ బలవంతం చెయ్యకూడదు.

27. డాక్టరు చెప్పింది ఏ మందులూ బిడ్డకి ఇవ్వకూడదు.

28. పిన్నులు ఉపయోగించకూడదు బిడ్డ వొంటిమీద.

## ఏడుపు :-

మరీ నెలలప్పుడు పిల్ల వుత్త వ్యాయామంకోసం ఏడుస్తుంది. అప్పుడు బాగా యేడవనివ్వాలి.

పిల్లని గారాబం చెయ్యడం, పెద్దవాళ్ళు చుట్టూ వుండడం, ఎత్తు కోడం, ఆడించడం అలవాటు చేస్తే మళ్ళీ వాటికోసం యేడుస్తుంది. అప్పుడా అలవాట్లు సరిచేసుకోవలసి వస్తుంది.

## కారణాలు :

1. బాధ—కడుపులో గాని, చలి, వుక్క,ఏదన్నా గుచ్చుకోవడడం, ఆకలి, దాహం, చెవిపోటు, దోమ, నల్లికాటు మొదలైన వాటివల్ల.

2. పడక సరిగా లేకపోవడం, మలబద్ధకం.

3. భోజనంలో ఎక్కువ తక్కువలు. ఆకలి, ఏడుపు, బిగ్గరగా, "నా ఏడుపు విను" అన్నట్టుంటుంది.

తన సంగతి చూడకపోతే కోపంతో కూడివుంటుంది ఏడుపు.

పొట్ట గాలి పోసుకుని వుబ్బితే, విడిచివిడిచి ఏడుస్తుంది సన్నగా.

## మలబద్ధకానికి కారణాలు :

1. పొట్ట కండరాల బద్ధకం — అట్లాంటప్పుడు సబ్బుముక్కని పుల్లలాగు చేసి ముడ్డిలో దూర్చాలి.

లిక్విడ్ పారాఫిన్ ఇవ్వవొచ్చు. భోజనంలో ఎక్కువ తక్కువలికి బురాచక్కెర నీళ్ళు తాగి స్తే మంచిది.

## కడుపునెప్పి ఉబ్బరం :

ముఖ్యమైన కారణం అజీర్ణం. పాలపీకల్ని, ఉత్త పాలబుడ్డిని చీకడానికి ఇయ్యడం ఇంకో కారణం.

చికిత్స :— ముందు బిడ్డని కూచోపెట్టి లేక పైకెత్తి, వీపు తడుపుతో ఉండాలి. ఒక ఔన్సు వేణ్ణీళ్ళని తాగించాలి. వేణ్ణీళ్ళ స్నానం చేయించాలి—ఆహారం ఇవ్వకూడదు.

డిల్‌వాటర్ (Dil water)లేక గ్రైప్‌వాటర్ ఇవ్వవచ్చును. చిటికెడు సోడావుప్పు నీళ్ళలో కలిపి తాగించవొచ్చును.

## కక్కులు :

కొంచెం కొంచెంగా పాలు పైకివొచ్చేస్తే ఎక్కువగా తాగిందన్న మాట. పుల్లగా వాసనవేస్తే దోకులు అజీర్ణాన్ని సూచిస్తాయి. పాలలో ఎక్కువనీళ్ళూ బురాచక్కెరా చేర్చాలి. లేక ఫ్లూయిడ్ మెగ్నీషియా చేర్చాలి.

## చిన్నబిడ్డ గుణం :

ఇది అజీర్ణంవల్ల కలుగుతుంది. కొంచెం పెద్దపిల్లల్లో పొట్టలో పాములవల్లకూడా కలుగుతుంది. భయంకరంగా కనపడతుందిగాని, భయం లేదు. వెంటనే డాక్టరుకి కబురుపంపి, వొచ్చేలోపల బిడ్డ బట్టలు తీసేసి, వాళ్ళో పడుకోపెట్టుకుని, తలని చన్నీళ్ళతో తడుపుతో వుండాలి.

## బిడ్డ తెలివి :

ఒకటో నెల — తల్లిని గుర్తుపట్టడం — వేళకి అలవాటు కావడం, చేతుల్లో వేటివన్నా పట్టుకోవడం.

నాలుగో నెల లోపల — ఇంటో వాళ్ళని గుర్తించడం, దగ్గిర వొస్తు వుల్ని చూసి పట్టుకోడం, కాళ్ళతో గట్టిగా తొయ్యడం, తల నిలబెట్టడం వేళ్ళతో ఆడుకోడం.

ఏడో నెల లోపున దూరంగా చూడగలగడం, వొస్తువుల్ని పట్టుకుని తాకి, రుచిచూసీ పరీక్షించటం, దేకడం, దాచుని చుట్టూచూడడం,నమలడం చిగుళ్ళతో గట్టిగా కొరకడం, చంచాలోంచీ, కప్పులోంచీ తాగగలగడం.

పదో నెలలోపల — పిల్లల్ని అనుకరించడం. స్నేహం, విశ్వాసం కనపరచడం, నించోడానికి ప్రయత్నం.

యేడాదిలోపల — ముద్దుమాటలు, ఊహలు, ఆడుకోడానికి సామానులు కావలసిరావడం, నడవడం, తనంతట తను చంచాతో తినగలగడం.

ఏణ్నర్థంలోపల — సహాయం చెయ్యడానికి ప్రయత్నం—బొమ్మల్ని పడుకోపెట్టి ఆడడం, పరిగెత్తడం.

# ఆఖరి మాట

ఇప్పుడిప్పుడే ప్రపంచం బిడ్డల విషయమై తాను నమ్మిన అబద్ధాలలోంచి మేలుకుని పెద్దవారి అంధత్వంవల్ల బిడ్డలకి అన్యాయం జరుగుతోందనీ, బాధకలుగుతోందనీ గ్రహిస్తోంది. తక్కిన ప్రజలవలె బిడ్డ తన బాధల్ని చెప్పుకుని, వాటి నివారణకోసం ఆందోళన చెయ్యలేదు. కనక పెద్దవారే బిడ్డకోసం శ్రమపడి, వారి జీవితాన్ని ఆనందకరంగానూ ఫలవంతంగానూ చెయ్యాలి.

ఇంతకాలమూ స్త్రీ యెట్లా పురుషుడి ఆస్తిగావుందో బిడ్డకూడా అట్లానేవుంది. ఒక్క చంపడంతప్ప తక్కిన యే బాధలూ తలితండ్రులూ వారు లేనప్పుడు, సవతి తల్లులూ, మామలూ, అత్తలూ మొదలైనవారు యేంచేసినా బిడ్డకి నోరెత్తడానికి తెలివీ శక్తీలేవు. ఏడ్చినా వినేవారులేరు.

బిడ్డకి యీ లోకంలో ఆనందం అనుభవించడానికీ, సౌఖ్యపడడానికీ హక్కు వున్నదనే సంగతే మంచి యెంతవరకు పెద్దవారికి సహాయపడ గలదనే ఆలోచనలోనేవున్నారు. బిడ్డకి ప్రత్యేకవ్యక్తిత్వమిచ్చి, బిడ్డయెవరి ఉపయోగం కోసమూ కాదనీ, తనకోసం తాను జీవించేహక్కును పొందాలనీ మనుషులు గుర్తించాలి. బిడ్డకూడా పెద్దవారివలెనే వివేకము కలదని విశ్వసించి బిడ్డకి, సంపూర్ణమైన బాధ్యతలను యిచ్చినప్పుడే అదీ అభివృద్ధి చెందుతుంది. లోకంలోకి స్వేచ్ఛగా పోనిచ్చి, అన్నీ స్వయంగా చూసి నేర్చుకునేట్టు సహాయం చెయ్యాలి. తన శక్తుల్ని, పంచేంద్రియాలను, బుద్ధిని వుపయోగించి, సత్యాసత్యాల్నీ, న్యాయన్యాయాల్నీ, నీతి అవినీతుల్ని స్వయంగా తెలుసుకోనేట్టు వుండాలి. బిడ్డని వీలైనంతవరకు స్వేచ్ఛగా వొదిలి పెద్దవారు తటస్థంగా నుంచోడం మంచిది. అపాయం

లోకి తెలివి తక్కువగా నడుస్తోందని తోచినప్పుడుతప్ప పెద్దవారు జోక్యం కలుగజేసుకోకూడదు. బిడ్డ చేతిని పట్టుకుని నడిపించి జ్ఞానాన్ని యివ్వడానికి గొప్ప తల్లి ఈ ప్రపంచం వుంది. పెద్దవారు మెక్కువ ఆదుర్దా పడనక్కర్లేదు. ఏ ఆజ్ఞ పెట్టినా, యే శిక్ష విధించినా యే జోక్యం కలగ చేసుకున్నా ముందు పెద్దవారు తమ ఆత్మపరీక్ష జేసుకొని, బిడ్డ క్షేమం కోసమా తమ స్వంత క్షేమం కోసమా అని యోచించుకుంటే బిడ్డలు చాలా సౌఖ్య పడిపోతారు. ప్రేమ పేర పెద్దలు బిడ్డలకి చేసే అపచారాలంత ఘోరమైన కార్యాలు యెక్కడా వుండవు.

ఈ పద్ధతులేమీ అమలులో పెట్టకపోయినా, కొన్నిగానీ అన్నిగానీ ఆచరణలో వుంచినా, బిడ్డని దిద్దాలనుకొన్నప్పుడు, బిడ్డ పనులలో సహజమైన ఉద్దేశ్యాలలో, నడవడిలో, జోక్యం కలగజేసుకోవాలన్నప్పుడు, ఏం జోక్యం ఎట్లా కలిగించుకోవాలో నిశ్చయంగా సరైనిదేదో అది తెలిస్తేనే జోక్యం కలగజేసుకోవాలి. సందేహం కలిగినప్పుడు, మాట్లాడకండా వూరుకోడం మంచిది. ఇంపెర్సనల్‌గా చూడలేనప్పుడూ అంతే. 'నేను' 'నా పెద్దతనం' అనే మోహం పనిచేసేదానికంటే ఏ శిక్షణా లేకుండా వూరుకోడం వుత్తమం. పెద్దవారి రక్షణా, శిక్షణా లేకుండా పెరిగినపిల్లలు చాలా శిక్షణలోవున్న పిల్లలకన్న చాలా ఉత్తములుగా తయారౌతారు. ఈ పెద్దవారి చేతులలో, వారి అభిప్రాయలకీ, ఉద్దేశ్యాలకీ, సాధనాలై వంకర తిరిగిన పిల్లలకన్న దిక్కులేని అనాధ శిశువులు వారి ఆనందాన్ని వారే వెతుక్కుని సహజంగా జీవిస్తారు. విద్యావంతుల పిల్లలు, ధనికులూ, అధికార్లూ, కీర్తివంతులూ, కావొచ్చు లోకం ముందు. కాని వారికి లోపల్నించి సుఖపడి బతకగల శక్తినశిస్తుంది. చెడిపోతున్నట్టు కనపడ్డా సరే. బిడ్డని బిడ్డ స్వభావానికి వొదలడం చాలా వివేకమైన శిక్షణ. యితరులు వాళ్ళ జోలికి వచ్చి వంకర్లు తిప్పకండా వీలైనంతవరకు చూడడమే గొప్ప రక్షణ.



# అనుబంధం

పిల్లలు సరిగా తెలివిగా ప్రశ్నలు వెయ్యరు పైకి. కాని ఈ ప్రశ్నలవంటి ఆలోచనలు వాళ్ళ మనసులో జరుగుతోనే వుంటాయి ఏ దూరంగానో.

ఇంతకన్న చిక్కు ప్రశ్నలు వేసే పిల్లలు లేకపోలేదు.



1. దొంగలున్నారు జాగ్రత్త.
2. పెళ్ళిముస్తాబు.
3. పుట్టిన పండుగ.
4. వినాయకచవితి.
5. డబ్బు.

# దొంగలున్నారు జాగ్రత్త!

(వ్యవధిలేక అమె పిల్లవాడితో మొగవాళ్ళ పెట్టెలో ఎక్కింది. 'బిడ్డల శిక్షణ' మీద పుస్తకాలు చదివి తల్లీ తండ్రీ పిల్లవాడి ప్రశ్నల్ని నిరుత్సాహ పరచకండా పెంచారు. అతను వాక్యాలు చదవటం అభ్యాసం చేస్తున్నాడు, ఆ కాలంలో. పెట్టెనిండా మనుషులు)

కుర్రవాడు : (పెట్టెపైన చూసి)

ద.... దె, దేకీ ... సున్నావెడితే....

తల్లి : (కంగారుపడి) సరిగాచూడు. దె....కాదు. దొ....

కుర్ర : అవును... దొం... గ....లు... తరవాత ఏమిటి అమ్మా ?

తల్లి : న్నారు....

కుర్ర : 'దొంగలున్నారు జాగ్రత్త' !

....యేరీ దొంగలు? (చుట్టూ చూస్తున్నాడు).

తల్లి : లేరు.

కుర్ర : మరి ఉన్నారన్నారే !

తల్లి : అంటే వుంటారేమో నన్నమాట.

కుర్ర : రాసినవాళ్ళకి తెలీదా ?

తల్లి : తెలీదు.

కుర్ర : ఐతే ఎందుకు రాశారు ?

(వ్రాసేవాళ్ళందరూ తెలిసే వ్రాస్తున్నా రనుకుంటున్నాడు కుర్రాడు. ఇంకా ఆంధ్రపత్రిక చదవలేదు.)

తల్లి : ఉంటే జాగ్రత్త పడమన్నారు.

కుర్ర : వాళ్ళు చెప్పడమెందుకు మనకి కనపడరూ దొంగలూ?

తల్లి : ఎట్లా కనపడతారూ ?

కుర్ర : చూస్తే.

తల్లి : వాళ్ళూ అందరిమల్లేనే వుంటారు.

(కుర్రాడు ఆలోచించాడు, తెలివిగలవాడు గనుక. నల్లగా, బట్టలు లేకుండా కోరలతో, గడ్డాలతో ఫిల్ములలో కన్పడే మహారుషుల మల్లే వుండరని తెలుసుకున్నాడు.)

కుర్ర : దొంగలూ షర్టూ కోటూ వేసుకుంటారు, అవునా ?

(ప్రక్కన కూచున్న పుస్తకాల అధికారిని చూస్తున్నారు దొంగే నేమోనని. ఆయన గడించిన లక్ష రూపాయల దొరతనాన్ని ప్రశ్నిస్తున్నట్టు.)

తల్లి : ఆ !

కుర్ర : మరి నాన్నకూడా దొంగ కావచ్చు.

తల్లి : దొంగతనం చేసేవాళ్ళు దొంగలు.

కుర్ర : దొంగతనం చేశారని ఎట్లా తెలుస్తుంది?

తల్లి : కనుక్కుంటారు

కుర్ర : ఓ, చేసినట్టు పట్టుపడ్డవాళ్ళు దొంగలా ?

(తల్లి ఆలోచిస్తో వూరుకుంది. ఆమేకాదు, చాలామంది ఆలోచించుకోవాలి.)

కుర్ర : ఎందుకు దొంగతనం చేస్తారమ్మా ?

తల్లి : వాళ్ళకి — లేక !

కుర్ర : ఎందుకు లేదు ?

తల్లి : వాళ్ళు సంపాయించరు.

కుర్ర : నువ్వు ఆ నగలు సంపాయించావా ?

తల్లి : తాతయ్య యిచ్చారు.

కుర : పోనీ, దొంగలకి కూడా ఎవరన్నా ఇయ్యరాదూ ?

తల్లి : ఇచ్చినా పాడుచేసుకుంటారు.

కుర : మనం భద్రంగా దాచుకుంటాం, వాళ్ళు ఖర్చుచేస్తారు. దాచుకోడానికి మిగలదు గావును ; మరి మనకి ఇంత డబ్బుఎక్కడిది ?

తల్లి : కష్టపడి సంపాయించుకుంటాం.

కుర : దొంగలూ కష్టపడి సంపాయించుకుంటారుగా ?

తల్లి : ఏం కష్టం, ఇంకొకళ్ళది తీసుకుంటారు.

కుర : మనకీ ఇంకోళ్ళ దగ్గర్నుంచేగా వొస్తుంది ?

తల్లి : మరి చెప్పకుండా తీసుకుంటామా ?

కుర : నాన్న, నా పెనసలు చెప్పకండా తీసుకున్నాడే !

తల్లి : మళ్ళీ యియ్యలా?

కుర : నేను కనుక్కొని అడిగితే ఇచ్చాడు.

తల్లి : చిన్నపిల్లవాడివని తన కొడుకువని ...

కుర : మరి మా నాన్న అని జేబులో డబ్బులు నేనుతీస్తే కొట్టాడే?

తల్లి : మరి చిన్నవాడివి....

కుర : అవును చిన్నవాళ్ళు పెద్దవాళ్ళవి తీస్తే తప్పు .... పెద్దవాళ్ళు చిన్నవాళ్ళవి తీస్తే తప్పులేదు .... (ఆలోచిస్తూ) అట్లానే బీదాళ్ళు గొప్పవాళ్ళవి తీస్తే తప్పు, గొప్పవాళ్ళు బీదాళ్ళవి తీస్తేతప్పులేదు.

తల్లి : దొంగలు మళ్ళీ ఇయ్యరు అడిగినా సరే.

కుర : విశాలమ్మని 'దొంగముండ నాన్నని ఎత్తుకుపోయిందన్నావు. మళ్ళా నాన్నని మనింటోనే పెట్టేసిందిగా !

తల్లి : ఛీ, వూరుకో.



# పెళ్లి ముస్తాబు

(తల్లి ముస్తాబు చేసుకుంటూ అద్దంముందు నుంచుంది. పిల్ల వొచ్చి చూస్తోంది. తనుకూడా అద్దంలో చూసుకుందామంటే అద్దం అందదు. తల్లి చూసింది)

తల్లి : ఇంకా పింజారీలాగు అట్లానే వున్నావేం. పద....

పిల్ల : పింజారి అంటె యేమిటి అమ్మా ?

తల్లి : పింజారి అంటేనా ? నీవంటి దరిద్రం మొహం అన్నమాట. వెళ్ళి మొహం కడుక్కో.

పిల్ల : కడుక్కుంటాను గాని, అందరూ నా మొహం నీ మల్లేనే....

తల్లి : ఇట్టా మాట్టాడుతో ఆలస్యం చేశావా....

పిల్ల : పెళ్ళి ఎప్పుడు అమ్మా....?

తల్లి : ఇప్పుడే మొదలు పెడుతో వుంటారు.

పిల్ల : ఇప్పుడేనని నీకెట్లా తెలుసు ?

తల్లి : వాళ్ళు పిలవలేదూ తొమ్మిదింటికనీ—

పిల్ల : తొమ్మిదయిందని యెట్లా తెలుస్తుంది?....ఓ, గడియారంలోనా (ఆలోచిస్తో) గడియారాని కెలా తెలుసో! (తల్లి మాట్లాడలేదు). పోనీ పదింటికి చేస్తేనేం పెళ్ళి ?

తల్లి : ముహూర్తం మించిపోదూ ?

పిల్ల : ఎక్కడికి మించిపోతుంది ? ముహూర్తం ఎక్కడ వుంటుంది ?

తల్లి : (పిల్లల ప్రశ్నలకి జవాబు చెప్పాలని వ్రాసే చలం మొదలైన వాళ్ళని తిట్టుకుంటో) ముహూర్తం అంటే, మంచి సమయం.

పిల్ల : దేనికి మంచిసమయం ? ఓ, పెళ్ళికా ? పెళ్ళికేనా, తక్కినవాటికీ ముహూర్తాలు వుంటాయా?

తల్లి : శుభకార్యాలకి వుంటాయి. [శుభకార్యమంటే యేమిటని అడుగు తుందనుకుంది——]

పిల్ల : మంచి సమయమిని యెట్లా తెలుస్తుంది? తక్కిన సమయాలకన్నా అది యెట్లా మంచి సమయం అవుతుంది? వాళ్ళు లెక్కలు వెయ్యడమేనా ? ఆ సమయంలో ఏమన్నా మంచి వుంటుందా ?

తల్లి : ఆ సమయంలో చేస్తే ఆ పెళ్ళి సరిగా జరుగుతుంది.

పిల్ల : ఎవరన్నా చెడ్డసమయంలో చేశారా ?

తల్లి : ఎందుకు చేస్తారేం?

పిల్ల : అయితే సరిగా జరగదని ఎట్లా తెలుసు ?.... తెలీదా నీకు ? మరి మంచి సమయంలోనే చేశారుకదా కోపల్లివారి పెళ్ళిలో కొట్టు కున్నారే ?

తల్లి : వాళ్ళ ఖర్మం.

పిల్ల : ఆయితే యింక ముహూర్తం ఎందుకు?

తల్లి : ఏమోనే, ఆ ముహూర్తం పెట్టే బ్రాహ్మల్ని అడుగు.

పిల్ల : మనం బ్రాహ్మలేగా, నాన్నహూతా ?

తల్లి : బ్రాహ్మలు వేరు.

పిల్ల : వాళ్ళెలా వుంటారు? మనమల్లే వుండరా?

తల్లి : వాళ్ళపని అది.

పిల్ల : అసలు బ్రాహ్మలని ఎట్లా తెలుస్తుందమ్మా ?

తల్లి : అడిగితె చెపుతారు.

పిల్ల : ప్రతివాళ్ళని అడగాలా? అందరూ బ్రాహ్మం మేనంటే?

తల్లి : అనసీవే.

పిల్ల : అంటే ఏం చేస్తావమ్మా ?

తల్లి : నే నేం చేస్తానే !
పిల్ల : అసలు బ్రాహ్మలంటే ఏమిటి?
తల్లి : అదో కులం.
పిల్ల : కులమంటే ?
తల్లి : కులమంటేనా—అదేమో నాకు తెలీదు.
పిల్ల : నీకు కులం వుందిగా ?
తల్లి : వుంటే ?
పిల్ల : మరి తెలీదంటావేం ! కులం ఎక్కడ వుంటుంది ?
తల్లి : ఎక్కడ వుండటమేమిటి కులం ? ఓ కులంలో పుడతాము.
పిల్ల : ఏ కులంలో ?
తల్లి : ఏదో కులం!
పిల్ల : ఎన్నికులాలు అన్నీ?
తల్లి : నాకు తెలీదే.
పిల్ల : ఏ దడిగినా తెలీదంటారు. పిల్లలకి ఏమీ తెలీదు, మీకే తెలిసినట్లు మమ్మల్ని తిడతారేం ? మీకే తెలీకపోతే, మాకు చెప్పేదేమిటి ? మరి తెలీని మాటలన్నీ ఎందుకు మాట్లాడతారు ?
తల్లి : ఈ గోల యెంమకంట పెళ్ళికి పోతో.
పిల్ల : పెళ్ళి అంటే యేమిటమ్మా?

(తల్లి హడలిపోయింది. కాని 'సడన్ ఇన్స్పిరేటివ్ తో')

తల్లి : చూడబోతున్నావుగా !

(అవును. అక్కడే పెళ్ళిమధ్య తక్కిన సంగతులన్నీ అడగవొచ్చునని పిల్ల ప్రస్తుతం వూరుకుంది.)

తల్లి : ఇంకా అట్లానే వున్నావేం ? నీ ప్రశ్నలూ నువ్వూనూ పింజారి మల్లె ? ఆ బట్టలతోనే వొస్తావా ఏమిటి ?

పిల్ల : పెళ్ళిలో మనకివున్న మంచి బట్టలూ నగలూ అందరికీ చూపించు కోవాలికదూ, అందుకేనా పెళ్ళి ?

తల్లి : చూపించుకోడానికా ఏం ? అందానికిగాని.

పిల్ల : మరి వాళ్ళ అనసూయ మొహానికి రంగుపూసుకుంటే మరీ షోకులు చేస్తోంది. అదేం పొయ్యేకాలం ? అన్నావే ?

తల్లి : రంగు పూసుకోవడమూ, చీరె కట్టుకోడమూ వొకటేనా ఏమిటి ?

పిల్ల : కాంత జాకెట్టూ చీరా కట్టుకుందని తిట్టావే కాంతని !

తల్లి : అవి మర్యాదస్తులు కట్టుకోరు.

పిల్ల : మనం మర్యాదస్తులమా అమ్మా....? ఏం చేస్తే మర్యాదస్తులు ?

తల్లి : (చెలాన్ని మరిచిపోయి) ఏదో వొకటి — నోరుమూసుకో.

పిల్ల : మర్యాదస్తుల పెళ్ళికి పట్టుచీరెలు కట్టుకొని వెడతారా ?

తల్లి : మామూలు చీరతో వెడితే బీదవాళ్ళనుకుంటారు. (టూ లేట్. తను చేసిన పొరపాటు గ్రహించింది.)

పిల్ల : బీదవాళ్ళు మర్యాదస్తులు కారుకదూ? వారికి పట్టుచీరెలు వుండవుగా, బీదవాళ్ళను పెళ్ళికి రానీరు కదూ?

తల్లి : బంధువుల్ని పిలుస్తారు. (మనం బంధువులమా అనే ప్రశ్న వినబడుతో) స్నేహితుల్ని కూడా....

పిల్ల : బీదవాళ్ళతో స్నేహం చేసుకోరుకదూ ?

తల్లి : చేసుకోరు.

పిల్ల : బీదవాళ్ళు చెడ్డవాళ్ళు, దుర్మార్గులు.

తల్లి : ఎందుకు ?

పిల్ల : దుర్మార్గులతో స్నేహం చేసుకోగూడదుగా. (తల్లి లాజిక్ చదువు కోలేదు.)

తల్లి : అదికాదు....

పిల్ల : ఐతే నన్ను కాసింతో ఆడుకోనియ్యవేం ?

తల్లి : అట్లాంటివాళ్ళకి చెడు అలవాట్లుంటాయి.

పిల్ల : ఎట్లాంటివాళ్ళకి ?

తల్లి : కాసింలాంటి వాళ్ళకి.

పిల్ల : సాయేబులకా ?

తల్లి : కాదు.

పిల్ల : బీదవాళ్ళకా?

తల్లి : (గతిలేక) ఊఁ

పిల్ల : మనం బీదవాళ్ళమైతే మనకీ చెడు అలవాట్లు వొస్తాయి ఎక్కడ వుంటాయో అవి ? .... .. ... చెడు అలవాట్లంటే ఏమిటమ్మా ?

తల్లి : బూతులు మాట్లా ....
(నాలిక కొరుక్కుంది)

పిల్ల : బూతులంటే ఏమిటమ్మా !

తల్లి : పో — మొహం కడుక్కురా, ఇంక ప్రశ్నలు చాల్లే.

పిల్ల : (వెళ్ళక) బూతులంటే ఏమిటమ్మా !
('పాడుమాటలూ' ఇట్లాంటి జవాబులు యోచించింది; కానిలాభంలేదని తెలుసు)

తల్లి : ('పాడుమాటలూ'......... .....)నాకు తెలీదు.

పిల్ల : మరి వాళ్ళు బూతులు మాట్లాడతారని నీకెట్లా తెలుస్తుంది అమ్మా?

తల్లి : మాట్లాడినప్పుడు తెలుస్తుంది.

పిల్ల : ఆ 'చెలం' అన్నీ బూతులు రాస్తాడు అంటావే, రాజేశ్వరమ్మ గారితో. ఏం రాస్తాడమ్మా?

తల్లి : చిన్నపిల్లలకి నీ కెందుకు పో.

పిల్ల : మరి నన్ను నేర్చుకోవద్దంటావుగా !

తల్లి : నువ్వు నేర్చుకోవద్దు చిన్నపిల్లవి అన్నాను.

పిల్ల : మరి బూతులు పెద్దవాళ్ళే నేర్చుకోవాలా ? నే నెన్నాళ్ళకు పెద్ద దాన్నవుతాను ? (గొప్ప అపాయం స్ఫురించింది తల్లికి.)

తల్లి ; ఆ ! ఇట్లా నుంచుంటే నిన్ను తీసుకెళ్ళకుండా వెడతాను.

పిల్ల : మరి వాళ్ళు మీ పిల్ల రాలేదేం అంటే, ఆవాళమల్లే 'జ్వరంగా ఉంది' అంటావా? (జ్ఞాపకం తెచ్చుకుంటో) నేను అడుకుని వొచ్చేటప్పటికి వాళ్ళు "మీ పిల్లలకి జ్వరంలేదే, జ్వరమని చెప్పారేం ?" అని అడగరేం ?

తల్లి : మర్యాదస్తులు గనక ?('మళ్ళీ మొదలు.రామ రామ'! అనుకుంది. కాని మన పిల్ల తెలివైంది. చిలకకాదు.)

పిల్ల : మర్యాదస్తులు నిజం అడగరు....అబద్ధాల్ని నమ్మకపోయినా నమ్మి నట్టే చూస్తోంటారు.

తల్లి · నీకుమల్లే ప్రశ్నలడగరు.

పిల్ల : అమ్మా నువ్వు లోలకులు పెట్టుకోవేం ?

తల్లి ఛీ ! ఇన్నేళ్ళొచ్చి ఇంకా లోలకులు పెట్టుకోవలసిందే !

పిల్ల : ఎన్నేళ్ళొచ్చినప్పుడు పెట్టుకోవాలి అమ్మా ?

తల్లి ; చిన్నవాళ్ళు—

పిల్ల : మరి ఇంత చిన్నదానివి నీ కప్పుడే లోలకులు ఏమిటి, అన్నావే ?

తల్లి ; అంటే ... కొంచెం పెద్దవాళ్ళు ....

పిల్ల : నువ్వు మరీ పెద్దదానివా ? నువ్వు పెట్టుకుంటే చాలా బావుంటావు.

తల్లి : అందరూ నవ్వరూ ? ....

పిల్ల : మరి నాన్న అందర్నీ నవ్విస్తాడే !

తల్లి : నాన్న మొగవారు. (అని తప్పించుకుంది. రాబోయే ఆపద ఎరగదు.)

పిల్ల : మొగవాళ్ళని చూసి అందరూ నవ్వితే మంచిదా ?

తల్లి : ఏదోలెద్దూ.

పిల్ల : మరి ముగ్గురు పిల్లలను పెట్టకొని 'రాజామణి' లోలకులు పెట్టుకుందే !

తల్లి : దానికేం సిగ్గులేని ముండ—

పిల్ల : మరి సిగ్గులేని ముండ....అనకూడదన్నావే నన్ను !....ఓ ! చిన్న వాళ్ళు అనకూడదుకదూ? చెప్పేవు, మరిచిపోయినాను. మరి రాజామణి వొస్తే, రండి, రండి ఎన్నాళ్ళకి రావడం అన్నావే !

తల్లి : అది మర్యాద.

పిల్ల : మర్యాద అంటే దొంగవేషాలా అమ్మా :

తల్లి : నీకు తెలీదులే....

పిల్ల : అమ్మా లోలకులు పెట్టుకుంటేనేం ?

తల్లి : మొదటికి వచ్చావూ? మర్యాద కలవాళ్ళు, కాదు....పతివ్రతలు పెట్టుకోరు.

పిల్ల : పతివ్రతలు మర్యాద కలవాళ్ళు కారా ?

తల్లి : అట్లా అనలేదు నేను.

పిల్ల : మరి ఎట్లా అన్నావు అమ్మా ?

తల్లి : ఎట్లాగో ఓలాగు — వూరుకుందూ నీ పుణ్యం.

పిల్ల : మరి చంద్రమతి లోలకులు పెట్టుకుంటే !

తల్లి : ఏ చంద్రమతి ?

పిల్ల : సినిమాలో చంద్రమతి.

తల్లి : అది బోగంది.

పిల్ల : ఏమిటి హరిశ్చంద్రుడు బోగందాన్ని పెళ్ళి చేసుకున్నాడా ? అది బోగం పతివ్రతా ?

తల్లి : అది సినిమా.

పిల్ల : సినిమాలో అన్నీ అబద్ధాలా ? మరి అబద్ధాలు చూడ్డానికి వెడతారేం అమ్మా ? చెడిపోతారుగా !

తల్లి : నేను చెప్పలేనే.

పిల్ల : బోగంది అంటే ఎవరమ్మా ?

తల్లి : మొగుడు లేందాన్ని బోగంది అంటారు.
పిల్ల : అమ్మమ్మ బోగందేనా ?
తల్లి అసలు పెళ్ళికాదు బోగంవాళ్ళకి.
పిల్ల : నాకు పెళ్ళి కాకపోతే—
తల్లి • ఛీ ! ఎందుకు కాదు ?
పిల్ల : మా పంతులమ్మ బోగందా ?
తల్లి : ఛీ ! అట్లా అనకు. బోగంవాళ్ళు పనిచెయ్యరు.
పిల్ల : వాళ్ళకి ఎందుకు కాదూ పెళ్ళి ?
తల్లి : వాళ్ళే చేసుకోరు.
పిల్ల : ఎందుకు చేసుకోరు ?
తల్లి : వాళ్ళకులం అది.
పిల్ల : మరి పిల్లలెట్లా అమ్మా ?
తల్లి : ఫో. నీకా సంగతులన్నీ ఎందుకు ?

పిల్ల : మరి ఎనిమిదేళ్ళొచ్చాయి, ఈ మాత్రం తెలీదా, అని నువ్వేగా అంటావు.

తల్లి : ఇట్లాంటి సంగతులా ?
పిల్ల : ఎట్లాంటి సంగతులు ?
తల్లి : ఏదో ఒకటిలే.
పిల్ల : నువ్వేగా చెప్పావు.
తల్లి : ఏం చెప్పాను ?

పిల్ల : అమ్మా, నాకో పాపాయి పుడితే బావుంటుందంటే — పెళ్ళికాంది పిల్లలెట్లా పుడతారు అన్నావే !

తల్లి : అవునులే. రా జడవేస్తాను.
పిల్ల : జడవద్దు. ఇట్లానే వస్తాను.
తల్లి : ఛీ, ఛీ అట్లానా ? అందరూ చక్కగా దువ్వుకొని వొస్తారు.
పిల్ల : నీ పిల్ల అని నన్ను చూపించుకోడం నీకు సిగ్గుగా వుంటుంది.

పోనీ నేను బీదవాళ్ళ పెళ్ళికి వెడతానులే. వాళ్ళు హాయిగా దువ్వుకోకుండా ...

తల్లి : ఛీ, నీకేం ఖర్మం ?
పిల్ల : నేను బీదదాన్ని కదూ ....?
తల్లి : నువ్వెందుకు బీదదానివి ?
పిల్ల : నాకేం వున్నాయి ? అన్నీ మీవేగా?
తల్లి : నీవీనీ.

పిల్ల : మరి నా కానీని నేను కోతిమనిషికి ఇస్తే, నన్నాట్లా తిట్టారే ? నాదిగా ఆ కానీ——

తల్లి : చిన్నపిల్లవి నీకేం తెలుసు ?

పిల్ల : ఏమైనా మనం బీదవాళ్ళం కాకూడదు, బీదవాళ్ళు వెధవలు. మర్యాదస్తులు కాదు వాళ్ళతో ఆడుకోకూడదు. వాళ్ళకి అన్నీ చెడ్డ అలవాట్లు, బీదవాళ్ళంటే డబ్బులేని వాళ్ళుకదూ ? మనకి డబ్బు లేకపోతే మనమూ బీదవాళ్ళమైపోతాము. డబ్బు జాగ్రత్తగా దాచుకోవాలి. బాగా సంపాయించి దాచుకోవాలి. డబ్బులేకపోయినా బీదగా కనపడకూడదు, అందుకనే మంచి బట్టలు అవీ వేసుకుని తల దువ్వుకుని పోవాలి. పెళ్ళిలో అక్కడా బీదవాళ్ళం కాము అని చూపుకోడానికి మంచి బట్టలు దాచుకోవాలి. అవును, అమ్మా! "మీ పిల్ల ఏదీ ?" అంటే 'అది బీదది' అని వూరుకుంటారు.... నిజంగా నన్ను తీసుకు వెళ్ళాలని వుందా అమ్మా ? నేను మంచి బట్టలు వేసుకోకపోతే తీసికెడతావా? నీ చీర మల్లే....కాసుల పేరు మల్లే —— నన్నూ షోకుచేసి చూపించుకోడానికి తీసుకుపోతున్నావు – (ఏడుస్తోంది)

తల్లి : ఛీ, అట్లా అంటావేమిటి.. నువ్వు లేకపోతే నాకేం తోస్తుంది——? ఏడవకు....కళ్ళు వాస్తాయి. అందరూ....

(చప్పున వూరుకుంది, సాధారణ స్త్రీలకన్న తెలివికలది కనక.)



# పుట్టిన పండగ

(చిన్న కుర్రాడికి - తలంటిపోసి చిక్కుతీస్తోంది తల్లి. ఆ పిల్లాడు గోలెత్తుతున్నాడు. ఆ పిల్లాడి అక్క వచ్చింది.)

అక్క : పండగలంటే నాకు కోపంగావుంది. పాడుపండగలు ! ఈ పుట్టిన పండగ ఒకటి ! ఎందుకు పుట్టామో !

తల్లి : ఇంతలో ఏమొచ్చిందే నీకు ?

అక్క ప్రతి పండుగకీ, ఈ తలంటి, కళ్ళలో కుంకుడు పులుసు, ఈ జుట్టు పీకడం, కొత్తబట్టలు వెయ్యడం, వాటిని ఆటల్లో మాపితే తన్నటం, చూడు తమ్ముడు జుట్టుని పీకి ఎట్లా ఏడిపిస్తున్నావో !

తల్లి : కాకపోతే మురికితలతో....

అక్క : ఎవరికోసం ఈ పుట్టిన పండుగ ? మాకోసమా, మీకోసమా?

తల్లి : మీ కోసమే.

అక్క: మాకొద్దు. మానెయ్యి.

తల్లి : అందరు పిల్లలూ చేసుకోవటంలేదూ ? మీరే దిగివొచ్చారా ?

అక్క: ఎక్కడనుండి దిగివచ్చామమ్మా మేము ? ఎట్లా దిగివొచ్చాము ?

తల్లి : దేముడి దగ్గిరినుంచి. ఎన్నిసార్లు చెప్పాలి ?

అక్క: దేముడి దగ్గర హాయిగా వుండేవాళ్ళం ఎందుకు దిగివొచ్చాము ?

తల్లి : దేవుడు పంపిస్తే.

అక్క: ఎందుకు పంపించాడు ? దేముడికి మామీద కోపమా ?

తల్లి : మాకోసం.

అక్క: మీకోసం మమ్మల్ని బాధలు పడమన్నాడా? ఎందుకు ?

తల్లి : మేం పడటంలేదా మీవల్ల ?

అక్క : అదే అంటున్నా మావల్లమీకూ మీవల్ల మాకూ ఈబాధలెందుకు ? పోనీ మేం రాకపోతేనేం ?

తల్లి : అది దేవుడి యిష్టం.

అక్క : బాధ ఇష్టమా దేముడికి ? ఏనాది రత్తికి పదిమంది పిల్లల్ని ఎందుకు పంపాడు ? వొద్దని ఏడుస్తోంటే !

తల్లి : దేముడి దయ.

అక్క : అదేం దయ ? మరి దేముడి దయకి బుద్ధిలేదా ?

తల్లి : దేముడి సంగతి మనకి తెలీదు.

అక్క : రారా తమ్ముడూ ఇంక పోదాం. ఇవాళ రాజాగారి ఇంటికి వెడదామనుకున్నాం. అమ్మా : అమ్మా ! రాజామణిగారిక్కి పిల్లల్ని పంపలేదేం దేముడు ?

తల్లి : మనకి ఆ సంగతులు తెలీవు అని చెప్పలేదూ ?

అక్క : దేవుణ్ణి అడక్క పోయినావా ?

తల్లి : దేవుణ్ణి అడగట మేమిటే ? దేవుడు కనపడడు.

అక్క : మరి మమ్మల్ని మీకు ఇచ్చేప్పుడన్నా కనపడలేదా ?

తల్లి : ఉహూ.

అక్క : ఎవరూ కనపడలేదూ ?

తల్లి : లేదు.

అక్క : అయితే దేవుడు పంపించాడని ఎట్లా తెలుసు ?

తల్లి : (తడుముకుంటో) దేవుడు పంపకపోతే ఎట్లా వొస్తావేం ?

అక్క : (ఆలోచిస్తో) నాకు తెలీదే. ఎవరు పంపించినట్టు ? నేను వొచ్చినప్పుడు ఎంత వున్నాను ?

తల్లి : చాలా చిన్న పాపాయివి.

అక్క : నీ పక్కలో వున్నానా తెల్లారి లేచిచూస్తే ?

తల్లి : (బతికాను దేముడా అనుకొని) అవును.

అక్క : ఆవులకి అట్లాకాదే? మన ఆవుకి___

తల్లి : (హడలిపోయి త్వరగా) ఆవులకి వేరు.

అక్క : కాంతమ్మగారు నెప్పులు పడుతున్నారని మీరు అందరూ వెళ్ళారే మర్నాడు ప్రొద్దున్న___

తల్లి : పోండే, ఇంకచాలు ప్రశ్నలు. పోయి ఆడుకోండి.

అక్క: కాదమ్మా ! అప్పుడు డాక్టరు వచ్చి పిల్లని బైటకి....

తల్లి : ఆ సంగతులన్నీ మీ కెందుకు? చిన్నవాళ్ళకి. పోండి.

అక్క: మరి దేవుడు పంపిస్తాడన్నావే ?

తల్లి : దేవుడు పంపిస్తేనే, డాక్టరు -

అక్క: బోడి శీతమ్మ కడుపులో పిల్ల తిరుగుతోందంటే....అమ్మా ! విను మరీ, కొందరికి....

తల్లి : పోతారా; తన్ననా ? (తన్నబోయింది. పిల్లలు బైటికి పరుగెత్తుకుని వెళ్ళారు.)

అక్క: (బైట కిటికీలోంచి) అమ్మా, నాకు సరిగా చెబుతావా ? అన్నయ్యని అడగనా ?

తల్లి : అన్నయ్య మొహం—వాడికేం తెలుసు ?

అక్క: తెలీకేం ? అన్ని సంగతులూ బళ్ళో పుస్తకాలలో వుంటాయట— అన్నయ్య రానీ.

తల్లి : ఏమిటో ఏడు, అన్నయ్యని అడగకు.

అక్క: బోడివాళ్ళకి పిల్లలు — అమ్మా! పిల్ల పుట్టింవంటారే ! ఎట్లా పుడుతుంది ?

తల్లి ; (విదిలేక) పొట్టలోంచి.

అక్క: అవునులే, ఎట్లా బయటికి వొస్తుంది ?

తల్లి : బొడ్డులో నుంచి.

అక్క: అందుకా బొడ్డు? నాకు పుడతారా ?

తల్లి : పెద్దయినాక.

అక్క: చిన్నపిల్లలకి చిన్న బొమ్మలంత పాపాయిలు పుట్టకూడదూ ? దేవుడు పుట్టించడా ?

తల్లి : మీరు పెంచలేరని.

అక్క: నీకిస్తాముగా పెంచడానికి !

తల్లి : నాకిదే పని. మీరు చాలరూ ?

అక్క: ఇంక అక్కర్లేదా ? దేవుడు నీ పొట్టలో పెడితే ? మరి మొగుడు లేనివాళ్ళకి పిల్లల్ని పొట్టలో పెట్టడేం ?

తల్లి : ఏమో. నాకు తెలీదే, వాళ్ళకి నాన్న వుండదని.

అక్క: నాన్న చచ్చిపోతే ?

తల్లి : అప్పుడేం చేస్తాం ?

అక్క: ఎందుకు చంపుతాడమ్మా ?

తల్లి : జబ్బువాస్తే చచ్చిపోతారు.

అక్క: దేవుడు కాదన్నమాట చంపేది.

తల్లి : (గతిలేక) కాదు.

అక్క: మరి ఆ నారాయణగారు 'దేవుడా? నా కొడుకుని తీసుకుపోయినావా?' అని ఏడ్చారేం ?

తల్లి : వాళ్ళట్లా అనుకున్నారు.

అక్క: మరిమరి.... వెంకటరత్నంగారి శీతాబాయికి మొగుడు లేదు కదా——

తల్లి : నేను చెప్పలేనే, నన్ను వాదిలిపోదూ !

——o——

# వినాయక చవితి

కుఱ్ఱవాడు : నాన్నా, వినాయకుడుకూడా దేవుడేనా ?

నాన్న : ఎందుకా సందేహం ?

కుఱ్ఱ : ఏమిటో ఆ తొండం, ఆ బొజ్జా చూస్తే నవ్వుగా వుంటుంది.

నాన్న : అట్లా నవ్వకూడదు. కథ తెలుసుగా నీకు, యేనుగుతల యెట్లా వొచ్చిందో !

కుఱ్ఱ : తెలుసులే. ఆ పిండిబొమ్మ యింత పెద్దదిగా యెదిగిందా? దేవుళ్ళు కూడా యెదుగుతారా ?

నాన్న : ఆ.

కుఱ్ఱ : ఎంత యెదుగుతారు? ముసలివాళ్ళవుతారా ?
(తండ్రికి సందేహం వొచ్చింది. యెన్నడూ ఆ సంగతి ఆలోచించలేదు.)

నాన్న : ముసలితనం లేదు వాళ్ళకి.

కుఱ్ఱ : అయితే, యెదిగి యేమౌతారు? వూరికే యెత్తుగా యెదగడమేనా పెరుగుట విరుగుట కొరకే. చచ్చిపోతారా?

నాన్న : వాళ్ళకి చావు లేదు.

కుఱ్ఱ : యెదగడానికి బాగా తినాలికదా, వాళ్ళు తింటారా ?

నాన్న : వాళ్ళేదో అమృతం తాగుతారంటారు.

కుఱ్ఱ : అమృతం తాగి ఎదుగుతారన్నమాట. అమృతమంటే పండుతుందా? అది ఎట్లా దొరుకుతుంది ? దాన్ని తింటారా ? తాగుతారా ?

నాన్న : తెలీదురా.

కుర్ర : అసలు ఈ దేవుళ్ళ సంగతులు యెవరికి తెలుసు ? యెట్లా తెలుసు ?

నాన్న : పూర్వం ఋషులు పురాణాల్లో రాశారు. దేవుళ్ళు వాళ్ళకి చెప్పారు గావును.

కుర్ర : యేం తినకపోతే? అంతనోరూ—తొండం దేనికీ వినాయకుడికి ?

నాన్న : వూరికే ఆకారానికి.

కుర్ర : ఈ బొమ్మలేనా, అసలు వినాయకుడు వుంటాడా ?

నాన్న : వుండకేం ?

కుర్ర : మనం నైవేద్యం పెడితే ఉండ్రాళ్ళు తింటాడా ?

నాన్న : తినకేం ?

కుర్ర : అమృతం తప్ప మరేం తినడన్నావు ?

నాన్న : మన నైవేద్యాలు తింటారు.

కుర్ర : సయించినా సయించకపోయినా, పొట్టనిండినా, మనం పెట్టిన వన్నీ తినాలిసిందేకదూ? యెన్ని వుండ్రాళ్ళు యెందరో పెడతారు కదా !

నాన్న : తినరు.

కుర్ర : అదేమిటి నాన్నా, ఇవాళ అట్లా చెబుతావు. ఒకసారి ఒకటి అంటావు; ఇంకోసారి ఇంకోటి అంటావు.

నాన్న : మరి నువ్వు వేసే ప్రశ్న లెట్లా వున్నాయి?

కుర్ర : నాకు తెలీకేకదా నిన్ను అడిగేది ? నా ప్రశ్నలు యెట్లా వున్నాయి ? సరిగానే అడిగానే ! వినాయకుడే తింటాడా ? అయితే ఉండ్రాళ్ళు అన్నీ అట్లాగే వుంటాయా ?

నాన్న : రుచిచూస్తాడు.

కుర్ర : ఉండ్రాళ్ళకు రుచి యేముంది ! యెవరూ తినేది ? ఈ బొమ్మా ! కైలాసంలో వినాయకుడా ? ఈ బొమ్మ తింటే మన కెందుకు, అసలు వినాయకుడు తినాలిగాని !

నాన్న : నువ్విక్కడ నైవేద్యం పెడితే అక్కడ వినాయకుడికి చేరుతుంది !

కుర్ర : యెట్లా వెడుతుంది నాన్నా ! అన్నీ యిట్లాంటివి చెపుతావు ?

నాన్న : యేమో వెడుతుంది అంటారు.

కుర్ర : ఆ వినాయకుడికి తెలుస్తుందా యెవ రెవరు యెంత నైవేద్యం పెడుతున్నారో !

నాన్న : అంతటా వున్నాడన్నానుగా, అన్నీ చూస్తాడు.

కుర్ర : సరిగా చెప్పు నాన్నా ! వినాయకుడు అంతటా వున్నాడా? కైలాసం లోనా ? అతనికి పొట్టా తొండం వున్నాయికదా, అంతటా ఎట్లా వుంటాడు ?

నాన్న : వినాయకుడంటే తెలీడానికి ఓ రూపం చూపించారు అంతే. అతనికి శరీరం లేదు

కుర్ర : లేకపోతే ఉండ్రాళ్ళు ఎట్లా తింటాడేం ?

నాన్న : ఏమోరా నన్ను చంపకు, అవన్నీ పెట్టినవాళ్ళ నడుగు.

కుర్ర : ఎవరు పెట్టారు ?

నాన్న : ఎవరో పెద్దలు.

కుర్ర : వాళ్ళెక్కడ వుంటారు ?

నాన్న : చచ్చిపోయినారు.

కుర్ర : వాళ్ళకి తెలుసా ?

నాన్న : ఆ.

కుర్ర : వాళ్ళకి తెలుసునని నీ కెట్లా తెలుసు ?

నాన్న : ఏమోరా అందరూ చేస్తున్నారు.

కుర్ర : కొందరు చెయ్యరే ?

నాన్న : వాళ్ళ యిష్టం.

కుర్ర : మన ఇష్టంకాదా ? తెల్లారకట్టే చలిలో నిద్రలేపి తలంటు పొయ్యమన్నారా ఆ పెద్దలు ? అన్నారో లేదో నీకెట్లా తెలుసు?

నాన్న : ఏమో అందరూ....

కుర్ర : అందరూ సిగరెట్లు కాలుస్తారు నువ్వు కాల్చవే ?

నాన్న : వాళ్ళుకాదు. మంచివాళ్ళు.

కుర్ర : సిగరెట్లు కాల్చేవాళ్ళు మంచివాళ్ళు కాదా ?

నాన్న : కాదు.

కుర్ర : చిన్నాన్న....

నాన్న : మంచివాడే కాని ఆ సిగరెట్లు....

కుర్ర : కాల్చేవాళ్ళు మంచివాళ్ళు కాదన్నావే !

నాన్న : అది మంచిపని కాదు.

కుర్ర : చెడ్డపని చేసేవాళ్ళు చెడ్డవాళ్ళు కాదా ?

నాన్న : కాదు.

కుర్ర : మనపిల్లిని కొడితే నన్ను చెడ్డవాడందే అమ్మ !

నాన్న : అమ్మకు తెలీదు.

కుర్ర : మరి నన్ను అమ్మమాట వినమంటావే.

నాన్న : అవన్నీ ఎందుకురా, వినాయకుడి సంగతి మాట్లాడుతో.

కుర్ర : సరే తమ్ముడి బారసాలకి పసుపుముద్దని చేసి విఘ్నేశ్వరుడన్నారే ! ఆ ముద్దకూడా వినాయకుడేనా ?

నాన్న : పసుపు శుభం. అందుకని....

కుర్ర : శుభమంటే___

నాన్న : మంచి చేస్తుంది.

కుర్ర : ఎవరికి ?

నాన్న : మనకి.

కుర్ర : ఏం మంచి ?

నాన్న : అన్నీ.

కుర్ర : ఏం చేస్తే ?

నాన్న : పసుపుని వాడితే—

కుర్ర : ఎట్లా ?

నాన్న : ఏమోరా, వో !

కుర్ర : అయితే పసుపుని నువ్వు వాడవేం ?

నాన్న : ఆడవాళ్ళు....

కుర్ర : మొగవాళ్ళకి శుభం వొద్దా ?

నాన్న : వాళ్ళకి వేరు.

కుర్ర : ఏం వేరు ?

నాన్న : నేను చెప్పలేనురా.

కుర్ర : సరే శుభమైతే.

నాన్న : దాంటో వినాయకుడు వుంటాడనీ.

కుర్ర : పసుపులోనా ?

నాన్న : ఊఁ

కుర్ర : పసుపులో ఎట్లావుంటాడు నాన్నా—మరీనీ ?

నాన్న : ఏమోరా.

కుర్ర : ఇంకా ఏమైనా వున్నాయా శుభమైనవి ?

నాన్న : వున్నాయి.

కుర్ర : వాటిల్లోకూడా వుంటాడా ?

నాన్న : వేరే దేవతలు వుంటారు.

కుద్ర : మట్టితో చేస్తారే వినాయకుణ్ణి ! మట్టిలో వుంటాడా ?

నాన్న : ఊఁ

కుద్ర : మట్టికూడా శుభమా

నాన్న : శుభ్రమైనది.

కుద్ర : అయితే పసుపు కొనడ మెందుకు ?

నాన్న : నాకు తెలీదు.

కుద్ర : నవ్వే కుంటో తెలీవంటావేం ? నే నేదన్నా తెలీకండా కొన్నా నంటే వూరుకుంటావా ? నాకు బావుందన్నా వొప్పుకోరే!

నాన్న : చిన్నవాడివి.

కుద్ర : పెద్దవాళ్ళు అసలు తెలీకుండానే కొంటారే అన్నీ ! మీరే మాకు ఇట్లాంటి బుద్ధిలేనివన్నీ నేర్పేది. శుభమైన వాటిల్లోనేనా వినాయకుడు వుండేది? దేవుడు అన్నిట్లోనూ వుంటాడంటావుగా?

నాన్న : వుంటాడు.

కుద్ర : మరి అన్నిటినీ పూజచెయ్యరే ?

నాన్న : ఏవో కొన్నిటిని ఏరుకున్నారు పూజకి.

కుద్ర : నేను ఇంకోటి ఏరుకుంటే.

నాన్న : ఏరుకో.

కుద్ర : అయితే నేను కుక్కపిల్లని ఏరుకున్నాను.

నాన్న : ఛీ. కుక్కపిల్లా !

కుద్ర : దాంటో దేవుడు లేడా ?

నాన్న : వున్నాడుడే, కాని అది మురికి.

కుద్ర : నేను శుభ్రంగా వుంచుతాను. మన అమ్మమ్మ ఎంత మురికి—

నాన్న : అట్లా అనకూడదు. పెద్దవాళ్ళని.

కుద్ర : ఎందుకు అనకూడదు ? తను అంత మురికిగావుండీ, నన్ను—

నాన్న : పెద్దవాళ్ళు.

కుర్ర : అయితే___

నాన్న : వాళ్ళని అనకూడదు.

కుర్ర : ఎందుకు ?

నాన్న : తప్పు.

కుర్ర : ఎందుకు తప్పు ? ఈ తప్పులన్నీ, ఇన్ని తప్పులు, నీ కెట్లా తెలి శాయి నాన్నా ? ఎవరు పెట్టారు ?

నాన్న : ఏమోరా, అవన్నీ ఎందుకు—వినాయకుడి సంగతి మాట్లాడు.

కుర్ర : ఏమిటో, మాట్లాడితే చిన్నపిల్లలకి ఏమీ తెలీదంటారు. పెద్ద వాళ్ళకే తెలీదు. మాకు తెలీవని వూరుకుంటాము. మీరు తెలుసు నని మమ్మల్ని దబాయించి, అబద్ధాలు చెపుతారు.

నాన్న : నే నబద్ధాలు చెప్పానా ?

కుర్ర : అమ్మ చెపుతుంది. నువ్వయినా ఒక్కదానికి సరిగా చెప్పవుకదా ! మరి వినాయకుడు అన్నిట్లోవుంటే, మరియెక్కడో కైలాసంలో వున్నాడంటారేం ?

నాన్న : అక్కడా, యిక్కడా, యెక్కడా ఉన్నారు.

కుర్ర : అయితే కైలాసంలో వున్నారని అనడమెందుకు? ఇక్కడే వున్న వాళ్ళని ?

నాన్న : అక్కడ కనపడతారేమో !

కుర్ర : ఎవరికి ?

నాన్న : అక్కడి ఋషులకీ, దేవతలకీ.

కుర్ర : వాళ్ళకి ఇక్కడా కనపడతాడుగా !

నాన్న : ఇక్కడ కనపడడు.

కుర్ర : అయితే ఇక్కడ వున్నట్లు చూసిందెవరు ?

నాన్న : నాకు తెలీదురా.

కుర్ర : వినాయకుడికి ఆకలి లేకపోతే, ఉండ్రాళ్ళు పెట్టడమెందుకు ?

నాన్న : మన భక్తి చూపడానికి.

కుఱ్ఱ : ఆకులూ, పువ్వులూ చాలవా ? పోనీ నాకు అరిసెలు ఇష్టం. అవి పెడితేనేం ?

నాన్న : నీ ఇష్టమా ?

కుఱ్ఱ : ఎవరి ఇష్టం ?

నాన్న : వినాయకుడి ఇష్టం.

కుఱ్ఱ : ఆకలి లేనివాడికి ఇష్టమేమిటి ?

నాన్న : కాదు, ఋషులు అట్లా పెట్టమన్నారు.

కుఱ్ఱ : అంటే ఋషులకి ఇష్టమన్నమాట ఉండ్రాళ్ళూ అవీ. మనం భక్తి నెందుకు చూపడం ? నాకేం భక్తిలేదే ?

నాన్న : నమస్కారం పెట్టి పూజచేస్తే భక్తి వున్నట్టే.

కుఱ్ఱ : దేవుడు అనుకుంటాడా, భక్తి వున్నట్టేనని.

నాన్న : ఊఁ,

కుఱ్ఱ : దేవుడు తెలుసుకోలేడా ?

నాన్న : నమస్కారం పెడుతోవుంటే భక్తి అదే వొస్తుంది.

కుఱ్ఱ : అన్నయ్యా వాళ్ళ హెడ్మాష్టరుకి ఐదేళ్ళమట్టి నమస్కారం చేస్తాడా ? ఒక్కరవ్వ భక్తి రాలేదు అన్నయ్యకు. ఇన్నేళ్ళమట్టి నమస్కారం పెడుతున్నావా, నీకేం భక్తి కనపడదే దేవుడిమీద ?

నాన్న : లేకేం?

కుఱ్ఱ : మరి దేవుణ్ణి తిట్టావు ఎన్నోసార్లు, నీకు ఏదో జీతం సరిగా రాక పోయినప్పుడు.

నాన్న : అది నా బుద్ధి తక్కువ.

కుఱ్ఱ : నువ్వు బుద్ధితక్కువ వాడివా ? మరి నన్నెందుకు తిడతావు బుద్దిలేదని ?

నాన్న : పూరికే మాట వరసకన్నాను. నీకన్నా బుద్ధిగల వాడినే. దేవుడి ముందు బుద్ధి తక్కువవాణ్ణి.

కుర్ర : ఇన్నేళ్ళు పూజలు చేస్తే ఏ మొచ్చింది ?

నాన్న : మనకి తెలీదు. మనం చేసే పాపాలు క్షమిస్తాడు. మనకి మంచి చేస్తాడు, ఈశ్వరుడు.

కుర్ర : పూజలంటే ఇష్టమా ఈశ్వరుడుకి?

నాన్న : ఊ.

కుర్ర : చాలా బడాయివాడా? మనవూరి ప్రైర్మనుమల్లే.

నాన్న : కాదు. పూజలు చెయ్యడం మన ధర్మం.

కుర్ర : ఎందుకు ?

నాన్న : మరి నిన్ను పుట్టించాడా?

కుర్ర : పుట్టిస్తే నాకేం? పుట్టించవొద్దనూ.

నాన్న : పోనీ, పీల్చడానికి గాలి, తాగడానికి నీళ్ళు —

కుర్ర : ఇవన్నీ పెట్టకపోతే తను పుట్టించిన వాళ్ళు చచ్చి పోతారు. నాకోసం పెట్టాడా ? ఇంతమంది పూజలు చేస్తోవుంటే అన్నీ లెక్కలు పెడుతో రాసుకుంటో కూచుంటాడా ? ఎవరెన్ని నమస్కారాలు పెట్టారో, ఎన్ని పువ్వులు వేశారో ?

నాన్న : దేవుడికి తెలుస్తాయి ఇవన్నీ.

కుర్ర : పూజ చెయ్యకపోతే కోపం వస్తుందా ఈశ్వరుడికి? ఆ, మన ధర్మం మనం చెయ్యటంలేదని. ఎందుకు మన ధర్మం పూజ చెయ్యడం ? చెప్పావుగా, పోనీలే. తురకవాళ్ళు వినాయకుడిని పూజ చెయ్యరుకదా, వాళ్ళమీద కోపమేనా ?

నాన్న : వాళ్ళ దేవుణ్ణి వాళ్ళు పూజిస్తారు.

కుర్ర : మరి వినాయకుడికి కోపం రాదా ?

నాన్న : తురకాళ్ళు చేస్తే ఇష్టంలేదు.

కుర్ర : ఎందుకో.

నాన్న : వాళ్ళు తురకవాళ్ళు గనక.

కుర్ర : వాళ్ళని వాళ్ళ దేవుడు పుట్టించాడా ?

నాన్న : (అనుమానంగా) అంతే.

కుర్ర : అయితే వాళ్ళని వేరే లోకంలో పుట్టించుకోక మన దేవుడి లోకంలో ఎందుకు పుట్టించాడు ? వాళ్ళ దేవుడికి లోకాలు చెయ్యడం తెలీదా?

నాన్న : (ఇంక గతిలేక) అందరు దేవుళ్ళూ ఒకటే — ఇవన్నీ పేర్లు.

కుర్ర : అయితే నేను తురకవాళ్ళ దేవుణ్ణి....

నాన్న : వీల్లేదు. నువ్వు తురకవాడివి కాదుగా ?

కుర్ర : అసలు అతను తురకవాడు ఎట్లా ఐనాడు? దేవుడు చెప్పాడా తురకవాడని? ఎట్లా తెలుస్తుంది?

నాన్న : అదో మతం.

కుర్ర : మతమంటే?

నాన్న : ఇప్పుడప్పుడే అవన్నీ తెలీవురా నీకు.

కుర్ర : నీకే తెలీవు. ఇందాకా చాలా దేవుళ్ళన్నావు. ఇప్పుడు ఒక్కడే నంటావు. ఒక్కడే అయితే వినాయకుడు వున్నాడా లేడా ?

నాన్న : ఇవన్నీ దేవుడికి పేర్లు. చదువు కావలిస్తే వినాయకుడు అని పూజ చేస్తాము. ధనం కావలిస్తే లక్ష్మి అని—

కుర్ర : చదువు కావలిస్తే లక్ష్మీదేవిని అడగకూడదా ?

నాన్న : ఉహూ.

కుర్ర : తురకవాళ్ళు వినాయకుడిని పూజచెయ్యరు. వాళ్ళకి చదువు వస్తోందే !

నాన్న : వాళ్ళ దేవుడు ఇస్తాడు.

కుర్ర : వాళ్ళకి ఎంతమంది — దేవుళ్ళు ?
నాన్న : ఒక్కడే.
కుర్ర : అన్నం తనే ఇస్తాడా ?
నాన్న : ఆ.
కుర్ర : మన దేవుడేనా, ఇన్ని దేవుళ్ళు ? వాళ్ళది సులభంకదూ ? మరి సుశీలవాళ్ళ ఇంట్లో అసలు ఏ పూజలూ చెయ్యరే ...వాళ్ళకి డబ్బు వుంది....
నాన్న : పూర్వ జన్మలో చేసివుంటారు.
కుర్ర : మరి ఈ పూజలు వొచ్చే జన్మకా, ఈ జన్మకా ?
నాన్న : రెంటికీ.
కుర్ర : సుందరం ఎన్నో పూజలు చేస్తాడు. వాడికి చదువు రాదు....
నాన్న : వాడి ఖర్మం.
కుర్ర : ఖర్మమంటే ?
నాన్న : నీకిప్పుడు తెలీదు.
కుర్ర : వాడికి వినాయకుడు చదువు నియ్యడేం ? వాడి ఖర్మం అట్లా వుంటే దేవుడు ఇయ్యడా ?
నాన్న : వొచ్చే జన్మలో ఇస్తాడు.
కుర్ర : వొచ్చే జన్మలో కూడా వాడి ఖర్మం అట్లాగే వుంటే... ?
నాన్న నీకిప్పుడప్పుడే తెలీవురా !
కుర్ర : నీకు తెలుసా పోనీ ?
నాన్న : (సందేహంగా) ఆ.
కుర్ర : అయితే చెప్పు. తెలుస్తుందో తెలీదో చూస్తాను.
నాన్న : నేను చెప్పలేనురా? ఇంక పో.

అక్క: అమ్మా! అమ్మా! పిల్లలం ఏమడిగినా అబద్ధాలు చెప్పుతారే?

తల్లి: ఏం అబద్ధాలు చెప్పాము?

అక్క: ఇందాకటినించి అన్నీ అబద్ధాలేకదా? దేవుడు పిల్లల్ని ఇవ్వడమూ అదీ, యింకా అడిగితే తెలీదంటారు. అంతా తెలిస్తే నువ్వు నాన్నతో మాటాడేప్పుడు వినలేదా? మొగుడులేని శీతాబాయికి పిల్ల పుట్టడానికని వాడెవడో పోస్టు అతను. ఏం చేశాడో ....ఆ మాటలే మేమంటే, బూతులు మాటాడతామని తంతారు. మన దాసీ లక్ష్మిని నాన్న తిడతాడే. ఆ మాటలకి అర్థమేమిటి?

తల్లి: ఏం మాటలే?

అక్క: ఏం మాటలా? చెప్పనా? మాకు రావనుకున్నారా? మేము అంటే తంతారని తెలీనట్లు వూరుకుంటాము. మేము అబద్ధాలు చెపితే బాగా కొడతారు. ఏదన్నా అడిగితే చాలు తంతామంటారు. ఇంతకీ మాకన్న బలం వుందికదా అని, మీరు అబద్ధాలు చెప్పవొచ్చు. బూతులు మాటాడవొచ్చు.

తల్లి: మీరన్నా బాగుపడతారేమోనని తంతాము.

అక్క: మీకుమల్లే యెదగకండనా?

తల్లి: ఊఁ.

అక్క: మిమ్మల్ని అబద్ధాలు చెప్పి కొట్టించారు కదా ఏం బాగు పడ్డారు మీరు? పోనీ ఇది చెప్పు. మరి నిజం చెపుతావా అప్పుడన్నా...? తమ్ముడి పుట్టినరోజు ఇవాళని యెట్లా తెలుస్తుంది? రేపు ఎందుకు కాకూడదూ?

తల్లి: (పుట్టుక విషయం వొదిలి పోయింది గదా అని సంతోషంతో) తమ్ముడు ఒక రోజున పుట్టాడా....?

తమ్ము: రేపు ఇవాళ ఎందుకు కాదూ?

అక్క : పోరా పిచ్చిముండా ! రేపు ఇవాళ ఎట్లా అవుతుంది ?
తమ్ము : యెందుకు కాకూడదూ? రేపంటే ఏమిటి? ఇవాళ అంటే ఏమిటి ?
అక్క : నువ్వు చెప్పవే అమ్మా, వాడితో ఏమిటి.
తల్లి : (నవ్వుతో) చూశావా ప్రశ్నలు? జవాబు చెప్పు తమ్ముడికి. తమ్ముడు ఒకరోజున పుట్టాడా! ఆరోజు మళ్ళీ వొచ్చిందన్న మాట.
అక్క : అసలు ఈ రోజులు ఎక్కణ్నుంచి వస్తాయమ్మా ?
తల్లి : రోజులు రావడమేమిటి ?
అక్క : మళ్ళీ వొచ్చిందన్నావు ?
తల్లి : ఆ తిథీ—నక్షత్రం—వొచ్చాయన్నమాట.
అక్క : ఆ తిథీ—నక్షత్రం యెక్కణ్ణించి వొచ్చాయి ? యెక్కడ వుంటాయి అవీ ?
తల్లి : సోమవారం అవీ రావూ అట్లా.
అక్క : అదే నే నడిగేది. ఆ సోమవారం యెక్కణ్ణించి వొస్తుందని ?
తల్లి : రాదు. అట్లా పేర్లు పెట్టుకున్నారు.
అక్క : తిథీ నక్షత్రం అంటే ఏమిటి ?
తల్లి : నక్షత్రం తెలీదా నీకు, చూడలేదా ?
అక్క : ఆకాశంలోనేనా ! అదెట్లా వొస్తుంది ?
తల్లి : పేర్లు అంతే .
అక్క : ఆ తిథీ—నక్షత్రమే వొచ్చాయని ఎట్లా తెలుస్తుంది ?
తల్లి : పంచాంగాల వాళ్ళకి తెలుస్తుంది.
అక్క : వాళ్ళకి ఎట్లా తెలుస్తుంది ?
తల్లి : పుట్టి సంవత్సరం ఇవాళిటికి అయిందన్నమాట.
అక్క : సంవత్సరం అంటే ?
తల్లి : మూడువందల అరవై అయిదురోజులు ఒక సంవత్సరం.

అక్క : అన్ని రోజులు ఎందుకు ?

తల్లి : అట్లా పెట్టుకున్నారు.

అక్క: ఎవరు ?

తల్లి : అందరూనూ.

అక్క: నువ్వూనా ?

తల్లి : ఆ.

అక్క: అన్ని ఎందుకు పెట్టావు? ఒక పదిరోజులే పెట్టకూడదూ.

తల్లి : పదిరోజుల కొకసారి పుట్టిన పండుగా?

అక్క: నేను పెట్టానా ? ఆ రోజుల్ని నేను పెట్టలేదే ?

తల్లి : పెద్దవాళ్ళు పెడతారు.

అక్క: పిల్లలెందుకు పెట్టరూ ?

తల్లి : వాళ్ళకి ఇంకా సరిగా తెలీదు.

అక్క: పెద్దవాళ్ళకి తెలుసా ? మేము ఏమడిగినా, తెలీదు అంటారు. ఏంతెలుసు ? పైగా చెప్పేవన్నీ అబద్ధాలు. పిల్లలు అబద్ధాలు చెపితే కొడతారు? మీరు ఎన్నో అబద్ధాలు చెపుతారు. మిమ్మల్ని ఎవరు కొడతారు ?

తల్లి : నేనేం అబద్ధాలు చెప్పానే?

అక్క: అదుగో మళ్ళీ అబద్ధం ! పిల్లలు పుట్టడం సంగతి అడిగితే....

తల్లి : అట్లాంటివి అడిగితే చావనా ?

అక్క ఎట్లాంటివి అడిగాను ? మీరు మాత్రం మమ్మల్ని ఎట్లాంటివి అడుగుతారు ? నిజం చెపితే కొడతారు. అందుకని అబద్ధం చెపుతాము.

తల్లి : అప్పుడు రెండు తప్పులవుతాయి.

అక్క: అబద్ధం చెపితే, మీకు తెలీదుగా ! ఎప్పుడోగాని తెలీదు. పైగా అన్నీ తెలుసునంటారు. రెండు తప్పులు మావైతే, మీ తప్పులు కాక, మమ్మల్ని కొట్టటం కూడాను. తమ్ముడు ఎప్పుడు పుట్టాడు ?

తల్లి : అయిదేళ్ళ కిందట.

అక్క: అదికాదు ఏదో తిధీ నక్షత్రం అన్నావే?

తల్లి : మాఘ శుద్ధ ఏకాదశినాడు....

అక్క: అంటే ?

తల్లి : ఆ రోజు పేరు ప్రతిరోజుకీ ఓ పేరు వుంటుంది. మళ్ళా ఇవాళ మాఘ శుద్ధ ఏకాదశి.

అక్క: అదే ఆ సంగతి పంచాంగం వాళ్ళకి ఎట్లా తెలుస్తుందీ అని అడుగుతున్నాను.

తల్లి : పేర్లు వుంటాయిగా ఒకరోజు తర్వాత ఒకటి రాస్తారు.

అక్క: ఆ 'రోజు తర్వాత రోజు' ఎట్లా వొస్తుంది ?

తల్లి : అది తెలీదా? సూర్యుడు వెళ్ళిపోతే చీకటి అవుతుందా, మళ్ళీ తెల్లారదూ? అప్పుడు కొత్తరోజు.

అక్క: సూర్యుడు ఎక్కడికి పోతాడు?

తల్లి : ఆకాశం కిందికి పోతాడు.

అక్క: పోయి___

తల్లి : పొద్దున్న వొస్తాడు.

అక్క: రాత్రంతా పాపం ఎక్కడ కూచుంటాడూ అని.

తల్లి : ఎక్కడో వుంటాడు. మనకేం తెలుస్తుంది?

అక్క: మళ్ళీ ఎప్పుడు రావాలో ఎట్లా తెలుస్తుంది ఆ సూర్యుడికి?

తల్లి : ఆరుగంటలకి వొస్తాడు.

అక్క: గడియారం వుంటుందా అక్కడ ?

తల్లి : గడియారం అక్కర్లేకండానే తెలుస్తుంది.

అక్క: ఎట్లా తెలుస్తుందే ?

తల్లి : నీకు తెలీటంలా తెల్లారిందని ?

అక్క: సూర్యుడు వొస్తాడు కనక. అమ్మా సూర్యుడు రాకపోతే మనకి రోజులు ఎట్లా తెలుస్తాయి ?

తల్లి : తెలీవు.

అక్క: అప్పుడు అంతా ఒకరోజే కదూ?

తల్లి : అవును.

అక్క: ఇప్పుడూ ఇదంతా ఒకరోజేనేమోనమ్మా ? సూర్యుడు రెండుసార్లు వొస్తే. రెండురోజు లవుతుంది. ఒకవేళ రాకపోతే, కొత్తరోజే రాదు. అప్పుడు మనం పక్కమీదనుండి లేవం. మనకి ఆకలి వెయ్యదు.

తల్లి : హాయిగా మొఖం కడుక్కోం.

అక్క: బడికి పోనక్కర్లేదు. ఈ సూర్యుడి మూలానే ఇవన్నీ.

తమ్ము: సూర్యుడు చచ్చిపోడా ?

అక్క: సూర్యుణ్ణి ఎవరన్నా ఎత్తుకుపోతే ! ఒకవేళ, బాగా తిడితే సిగ్గేసి రాడేమో ? ఆకాశంలోంచి పడిపోడా ?

తల్లి : పడడు. పట్టుకుని వుంటాడు.

తమ్ము: చేతులు నెప్పికదూ ?

అక్క: చేతులు లేవురా పిచ్చివాడా ! అమ్మా, సూర్యుడు ఎట్లా జరుగుతాడో ! అటువేపు కాళ్ళు వుంటాయా ?

తల్లి : నాకు తెలీదే.

అక్క: సరేలే. ఆవిమాత్రం నీకు తెలిసి చెప్పావా ఏమిటి ? పిల్లలేకదా అని నీ నోటికి వొచ్చినవి చెబుతావు అన్నీ అబద్ధాలు ! రారా తమ్ముడూ పోదాం.

# డబ్బు

కుర్ర : నాన్న, మనం మోటారుకారు కొనకూడదూ ?

నాన్న : కారు ఎంత ఖరీదో తెలుసా, పదివేల రూపాయలు ఈ రోజుల్లో.

కుర్ర : మనకి పదివేల రూపాయలు లేవా ?

నాన్న : లేవు. ఎక్కడివీ ?

కుర్ర : కార్లు కొన్నవాళ్ళకి ఎక్కడివి ?

నాన్న : వాళ్ళు సంపాయించు కుంటారు.

కుర్ర : నువ్వెందుకు సంపాయించుకోవు ?

నాన్న నాకు చేతకాదు.

కుర్ర : చేతకాకపోతే నేర్చుకోరాదూ ?

నాన్న : ఎట్లా ?

కుర్ర : మరి నన్ను నేర్చుకోమంటావే, చేతకానివన్నీ

నాన్న : ఇది నేర్చుకుంటే వొచ్చేదికాదు.

కుర్ర : వాళ్ళ కెట్లా వచ్చింది ?

నాన్న : వాళ్ళకా తెలివి వుంది.

కుర్ర : నీ కెందుకు లేదు ?

నాన్న : దేవుడు ఇయ్యలేదు.

కుర్ర : ఎందుకు ఇయ్యలేదు ?

నాన్న : ఏమో !

కుర్ర : నాకు లెక్కల్లో దేవుడు తెలివినియ్యలేదు. మార్కులు తక్కువ వొస్తే కొడతావేం ?

నాన్న : రావడానికి.

కుర్ర : నిన్ను కొట్టేవాడుంటే నీకు డబ్బు చేసుకునే తెలివి వొస్తు
దేమో? నీ కెంత జీతం ?

నాన్న : మూడువందల ఇరవై.

కుర్ర : ఎవరిస్తారు ?

నాన్న : కంపెనీ వాళ్ళు.

కుర్ర : అంతే ఎందుకిస్తారు ! ఎక్కువ ఇయ్యరే ?

నాన్న : నేను చేసే పనికి అంతే.

కుర్ర : ఎక్కువ జీతం పనులు లేవా ?

నాన్న : ఉన్నాయి.

కుర్ర : అవి నీ కెందుకు ఇయ్యరు ? నీకు చేతకాదా ?

నాన్న : చేతనౌను. కాని ఇయ్యరు.

కుర్ర : వాళ్ళకెందు కిచ్చారు.

నాన్న : వాళ్ళకి అనుభవం తెలివి ఎక్కువనుకుంటారు.

కుర్ర : ఎందుకనుకుంటారు ?

నాన్న : నాకేం తెలుసు ?

కుర్ర : అడగరాదూ వాళ్ళని !

నాన్న : అడిగినా లాభంలేదు.

కుర్ర : ఎవరు ఎప్పుడు మాట్లాడినా, డబ్బులేదు, డబ్బులేదు, అంటారు.
ఎక్కడనించి వొస్తుంది డబ్బు.

నాన్న : కష్టపడి పనిచేస్తే వొస్తుంది.

కుర్ర : నువ్వు కష్టపడి పనిచెయ్యవా ?

నాన్న : చేస్తాను.

కుర్ర : మరి నీకు రాదేం ? ఇంకా కష్టపడు, వొస్తుంది.

నాన్న : ఇంక నా చాతకాదు. లాభమూలేదు.

కుర్ర : పెద్దవాళ్ళకి లాభంలేదుగావును, కాని చిన్నవాళ్ళని మాత్రం కొడతారు ఇంకా కష్టపడు, ఇంకా కష్టపడు అని —

నాన్న : అవును. చిన్నవాళ్ళకి వోపిక ఎక్కువ.

కుర్ర : ఎక్కణ్ణించి వొస్తుంది డబ్బు ?

నాన్న : ప్రభుత్వంవారు తయారు చేస్తారు.

కుర్ర : అందరికీ సరిపడేట్టు ఇంకా ఎక్కువ తయ్యారు చెయ్యరా ?

నాన్న అందరికీ చాలదు.

కుర్ర : ఎట్లా తయారు చేస్తారు ? డబ్బు అంటే రూపాయలూ అనేగా ?

నాన్న : నోట్లుకూడా అచ్చుకొడతారు.

కుర్ర : ఇంకా కాయితాలు అచ్చుకొట్టరాదూ ?

నాన్న : అవసరమున్నవి కొడుతూనే వున్నారు.

కుర్ర : ఎవరికి అవసరం ?

నాన్న : ప్రభుత్వానికి.

కుర్ర : వాళ్ళకి వాళ్ళు అచ్చుకొట్టుకుంటే మనకెట్లా వస్తుంది ?

నాన్న : ప్రభుత్వానికీ, పనిచేసేవాళ్ళకీ ఇస్తారు. వాళ్ళు తక్కువ పనివాళ్ళకి ఇస్తారు.

కుర్ర : అందరికీ సరిపడేంత ఇవ్వకూడదూ ? మనకి కారు కొనుక్కోడానికి పదివేలు అచ్చుకొట్టి ఇయ్యకూడదూ ? కొందరు వాళ్ళనడిగి తెచ్చుకుని కార్లు కొనుక్కుంటారు. నీకు వాళ్ళనడగడం చాతకాదు. నీ మొహం చూస్తే వాళ్ళివ్వరు.

నాన్న : అదేమిటి ?

కుర్ర : అమ్మ అందిగా నన్ను మొన్న ; నా మొహం చూస్తేనే ఎవరికీ ఏమీ ఇయ్య బుద్ధిపుట్టదని. ప్రభుత్వమంటే ఎవరు ?

నాన్న : కొందరు గొప్పవాళ్ళు.

కుర్ర : వాళ్ళు గొప్పవాళ్ళెట్లా అయినారు ?

నాన్న : ప్రజల విశ్వాసంవల్ల.

కుర్ర : నీమీద రాకూడదా విశ్వాసం? నువ్వూ తెచ్చుకో. అప్పుడు నువ్వు బోలెడు నోట్లు అచ్చుకొట్టించుకుని, నీకోకారు, నాకోకారు అమ్మకోకారు, కొనవచ్చు. అవును. అన్నినోట్లూ వాళ్ళే తీసుకుంటే ఈ బీదవాళ్ళకి ఎట్లా మిగులుతాయి ? ప్రజలు వాళ్ళని నమ్మినందుకు వాళ్ళకి కార్లూ మేడలూ. వాళ్ళని నమ్మి గొప్పవాళ్ళను చేసిన బీదలకి తిండికూడా లేదు అంతే.

నాన్న : అంతకన్న ఏం చేస్తారు ?

కుర్ర : ఎందుకు ఊరుకుంటారు తన్నరే ?

నాన్న : తంతే ప్రభుత్వం వుండదు.

కుర్ర : వుండకపోతే——?

నాన్న : పరిపాలన అంతా ఎవరు చేస్తారు ?

కుర్ర : డబ్బు అంతా తామే తీసుకోకుండా పారిపాలించేవారుండరా ?

నాన్న : వుండరు.

కుర్ర : నువ్వూ అంతేనా ?

నాన్న : ఇప్పుడేగా నన్ను నాలుగు కార్లు కొనమన్నావు ?

కుర్ర : అవును. మన స్వాములవార్ని ప్రభుత్వం చేస్తే? ఆయన డబ్బు అనవసరంగా——

నాన్న : ఆయన చెయ్యరు. ఆయన వొప్పుకున్నా ఆయనకు చేతకాదు.

కుర్ర : వాళ్ళ కెట్లా చాతనయింది ? ఈయనకి నేర్పితే రాదా ?

నాన్న : ప్రజలకి ఆయనమీద విశ్వాసం రాదు.

కుర్ర : డబ్బంతా దాచుకునే వాళ్ళమీద తప్ప ప్రజలకి విశ్వాసం రాదా ? ఒకవేళ డబ్బు దాచుకోని వాళ్ళకి ప్రభుత్వం పనిచెయ్యడం

వాతకాదేమో ః పోనీ వాళ్ళు తీసుకున్నంత తీసుకుని, ఇంకా నోట్లు వేసి అందరికీ ఇవ్వరాదా ః అప్పుడు అందరికీ తిండి కార్లూ వుంటాయిగా ?

నాన్న : అందరికీనా అట్లా వొప్పుకోరు.

కుర్ర : ఎందుకు ?

నాన్న : అట్లా వొప్పుకుంటే అందరికీ వుంటాయి. ఇంక గొప్పవారి ఆధిక్యత ఏముంది ః

కుర్ర : అందుకని చాలామందిని బీదవాళ్ళుగా వుంచుతారా ః

నాన్న : అంతే నీ చొక్కాలూ, నీ బొమ్మలూ పుస్తకాలూ మన చాకలి కుర్రాడితో పంచుకు టావా ?.... ఏం తెలుస్తోందా ః

కుర్ర : ఊ ...పంచుకోను, కాని అందరికీ మొదటనించీ సమానంగా వుంటే, నాకే కావాలని, నాకే వుండాలనీ దాచుకోను.

నాన్న : వాళ్ళూ అంతే. వీలైతే దాచుకుంటారు. లేనప్పుడు పంచి కుంటారు విధిలేక

కుర్ర : పోనీ, అన్నీ చవకగా చెయ్యకూడదూ ః అన్నిటికీ ఖరీదులు హెచ్చించడం ఎందుకు ః ఎవరాపని చేసేది—ప్రభుత్వమేనా?

నాన్న : ప్రభుత్వంకాదు. అదే ఎక్కుతుంది. ఆ వస్తువు తక్కువై, అవసరం ఎక్కువైనకొద్దీ....

కుర్ర : మొన్న మా క్లాసులో కామరాజు లేడూ, రాజయ్యా కొడుకు అతను పుస్తకం కొనుక్కోలేదు. టీచరు అడిగితే 'డబ్బులేదు—' అంటే టీచరు కొట్టాడు వాణ్ణి. వాడెట్లా ఏడ్చాడనీ ః రాత్రులు తిండి తినరట వాళ్ళు. పోనీ అట్లాంటివాళ్ళకన్నా డబ్బు ఇవ్వరు.

నాన్న : అట్లాంటివాళ్ళకి మన డబ్బు పంచిపెడితే నీ కెట్లా వుంటుంది ? నీకు నెయ్యీ పెరుగూ వుండవనుకో —

కుర్ర : వాళ్ళకేం. వాళ్ళు ఎన్ని నోట్లన్నా అచ్చువెయ్యవచ్చుగా.

నాన్న : ఊరికే నీకు అర్థమయ్యేందుకు అన్నాను. వాళ్ళు వెయ్యడానికి పీల్లేదు. వాళ్ళకీ తెలాలే.

కుర్ర : ఎవరిస్తారు.

నాన్న : వాళ్ళల్లో వాళ్లే నోట్లు ఎక్కువ అచ్చువేస్తే డబ్బు చవకై వస్తువులు ఇప్పటికన్న ప్రియమౌతాయి.

కుర్ర : అసలీ డబ్బు అనేది లేకపోతే బావుంటుంది.

నాన్న : ఎట్లా కొనుక్కుంటావు ? దేనితో.

కుర్ర : కొనుక్కోడమెందుకు ? ఎవరికి కావలసినవి వాళ్ళకి ఇస్తేసరి, ప్రభుత్వం ?

నాన్న : నీకు నెయ్యి అక్కర్లేదు. కాఫీ అక్కర్లేదు. మాంసంకూడా అక్కర్లేదంటే వొప్పుకుంటావా ?

కుర్ర : ఆ అందరికీ సుఖంగా వుండేట్టు ఇస్తే నేను వొప్పుకుంటాను.

నాన్న : కాని అందరూ అలా వొప్పుకోరు.

కుర్ర : వొప్పుకోనివాళ్ళని తంతేసరి.

నాన్న : కమ్యూనిస్టువైపోతున్నావే ?

కుర్ర : అంటే....

నాన్న : నీకుమల్లే మాట్లాడేవాడన్నమాట.

కుర్ర : అదే మంచి సంగతి ఇప్పుడు చాలా అన్యాయం....నువ్వూ కమ్యూనిస్టువైపో.

నాన్న : వాళ్ళు దేవుడు లేడంటారు.

కుర్ర : అంటే ఏం ? దేవుడుకేమన్నా ఇబ్బందా? ఏమీలేదు అంత కావలసిన దేవుడు అందరికీ కావలసినవన్నీ ఏర్పాటు చెయ్యడేం ?

నాన్న : ఏమోరా. నాకవన్నీ తెలీవు వెళ్ళు.

